ఈ శతాబ్దం ఆరంభంలో సాహిత్య పునరుజ్జీవన యుగ వైతాళికులుగా మహాకవి త్రయం ఆవిర్భవించడంతో మలయాళ సాహిత్య చేతనలో అపూర్వమైన నూతన వికాసం గోచరించింది. ఆ మహా కవి త్రయం : కుమారన్ అశాన్, వళ్ళత్తోళ్ నారాయణ మేనోన్, ఉళ్లూర్ పరమేశ్వర అయ్యర్. ఉపాధ్యాయుడుగా మొదట జీవితం ఆరంభించిన ఉళ్ళూర్ అధికారిక పదవీ నిశ్రేణిక మెట్లు ఎక్కి ఎక్కి, చివరికి తిరువాన్కూరు ప్రభుత్వంలో సర్వోచ్చ పదవి అధిరోహించారు. 1937 లో తిరువాన్కూరు మహారాజా ఆయనకు 'మహాకవి' బిరుద ప్రదానం చేశారు. ఆధునిక భారతీయ మహాకవుల్లో ఒకరుగా ఎన్నదగిన ఉళ్ళూర్ సాంప్రదాయిక కవితలోని గాంభీర్యానికి, కాల్పనిక కవితలోని వైవిధ్యానికి చక్కని సమన్వయం సాధించారు. తన గద్య, పద్య రచనల ద్వారా కేరళ ప్రజల అంతశ్చేతనను ఆయన కేరళ దేశ ప్రాచీన చరిత్ర తోనూ, భారత దేశ ప్రాచీన చరిత్రతోనూ ఏకీకరించ గలిగారు.

కాలికట్ యూనివర్సిటీకి కొంత కాలం పాటు ప్రో-వైస్-చాన్సలర్‌గా ఉండి ప్రస్తుతం మలయాళం ప్రొఫెసర్‌గా పని చేస్తున్న ప్రొ. సుకుమార్ అళీకోడ్ ఉళ్ళూర్ మీద ఈ చిన్న పుస్తకంలో వ్యక్తిగత మైన ఆయన మహత్త్వం పూర్వ రంగంగా బహుముఖ మైన ఆయన సాహితీ సేవను సింహావలోకనం చేశారు.

ముఖ పత్ర రచన : సత్యజిత్ రాయ్

వెల :

భారతీయ సాహిత్య నిర్మాతలు

# మహాకవి ఉళ్లూర్

ఆంగ్లమూలం :

శ్రీ సుకుమార్ అళీకోడ్

తెలుగు సేత :

శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు



సాహిత్య అకాదెమి

న్యూ ఢిల్లీ

MAHAKAVI ULLOOR— Telugu Translation by Sri B. V. Srinivasa-charyulu, of Sukumar Azhicode's English Monograph of the same name, Sahitya Akademi, New Delhi, 1983. *Price* : SAHITYA AKADEMI
REVISED PRICE Rs 10-00



First Edition : 1983

*Copies available at :*
SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-110 001.

*Regional offices* :
29, Eldams Road, Madras-600 018;
Block VB. Rabindra Sarobar Stadium, Calcutta-700 029;
172, Mumbai Marathi Grantha Sangrahalaya Marg,
Dadar, Bombay-400 014.

Published by Sahitya Akademi and Printed at
WELDUN PRESS, 68, Mannappa Mudali Street, Madras – 600 021.

# కృతజ్ఞత

— 5 —

వ్రాత ప్రతి చదివి, ఉపయోగకర మైన అనేక సూచనలు చేసిన కాలికట్ విశ్వ విద్యాలయంలో ఇంగ్లీషు ప్రొఫెసరు డా॥ సి. టి. తామస్‌కి—

ఉళ్లూర్ పద్యాలకు తమ ఇంగ్లీషు అనువాదాలను ఈ పుస్తకంలో చేర్చుకోడానికి అనుమతించిన కేరళ విశ్వ విద్యాలయం ప్రో-వైస్-చాన్సలర్ డా॥ ఎన్. ఏ. కరీమ్‌కి, తిరుచూరులోని సెంట్ తామస్ కళాశాల ఆంగ్లశాఖాధ్యక్షులు ప్రొ॥ ఎన్. కె. శేషన్‌కి —

ఉళ్ళూర్‌ని గురించిన కొన్ని అపురూప మైన రచనలు ఎరువిచ్చి తోడ్పడిన తిరుచూరులోని 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' సహాయ సంపాదకులు శ్రీ వి. కరుణాకరన్ నంప్యార్ కి —

ఈ పుస్తకం వ్రాసే కాలంలో ప్రశాంత మైన తమ కార్యాలయంలో నాకు వసతి కల్పించడమే కాక, అద్భుతమైన తమ గ్రంథాలయాన్ని వినియోగించుకో నిచ్చిన తిరుచూరు కేరళ సాహిత్య అకాడమీ వారికీ —

ఈ రచయిత మిక్కిలి కృతజ్ఞుడు.

కాలికట్ విశ్వ విద్యాలయం

సుకుమార్ అళీకోడ్

# అధ్యాయ క్రమం

—: ౦ :—

# 1. అవతారిక

భారతీయ ఆలంకారిక సార్వభౌముడు ఆనంద వర్ధనుడు ధ్వన్యాలోకంలో "ఒక జాతి సాహిత్య చరిత్రలో ఇద్దరో, ముగ్గురో, మహా అయితే అయిదుగురో, ఆరుగురో కంటె మహా కవులు ఉండరు"[1] అన్నప్పుడు ప్రపంచ సాహిత్యాల్లో సర్వ సాధారణంగా కనిపించే అంశాన్నే ఆయన ప్రతిపాదించారు. అయితే—కొన్ని కొన్ని అనుకూల సందర్భాల్లో—పెరిక్లిజ్ యుగంలో గ్రీక్ నాటక కళలో లాగ, అగస్టస్ చక్రవర్తి హయాంలో రోమక సాహిత్యంలో లాగ—అపూర్వమైన కవితా ప్రతిభ ఆవిష్కృతం అవుతూ ఉండడం చరిత్ర పుటల్లో మనకు కనిపిస్తూంది. ఈ శతాబ్ది ఆరంభ కాలంలో అలాంటి అద్భుతమైన కవితా విజృంభణ మలయాళ సాహిత్య రంగంమీద కనిపించింది. ఎన్. కుమారన్ ఆశాన్, ఉళ్ళూర్ ఎస్. పరమేశ్వర అయ్యర్, వళ్ళత్తోళ్ నారాయణ మేనోన్[2] అనే ఆధునిక మలయాళ మహా కవిత్రయం ఆ కాలంలో అవతరించారు. 'ఆశాన్', 'ఉళ్ళూర్', 'వళ్ళత్తోళ్' అనే సంక్షిప్త నామాలతో ప్రసిద్ధులైన ఈ ముగ్గురూ మలయాళ ప్రజల దృష్టిలో మలయాళ సాహిత్యానికి త్రిమూర్తులవంటి వారు. సాహిత్య చరిత్రలో అద్భుత సంఘటనగా ముగ్గురు మహా కవులు ఏక కాలంలో అలా ఉద్భవించడం 19వ శతాబ్దిలో హీనదశ అనుభవించిన మలయాళ సరస్వతి నోములు ఫలించినట్టు తోచింది. మలయాళ భాషా విపంచిలో కవిత్వావకాశాలు ఉన్న అన్ని స్థాయిలనూ పలికించి చూసి, చిరస్థాయి అయిన సాహిత్యం మలయాళ భాషలో వారు సృష్టించారు; నూతన యుగోదయానికి స్వాగతం పలికారు. పునరుజ్జీవన యుగ సహజమైన నూతన సృష్టిశోభను పుణికి పుచ్చుకున్న ఆ రోజులు మలయాళ కవితా చరిత్రలో రెండో స్వర్ణయుగంగా పరిగణించ బడుతున్నాయి. మొదటి స్వర్ణయుగం 15 వ శతాబ్దంలో తుంచత్తెళుత్తచ్చన్ కాలం.

---

1. "యేనాస్మి న్నతి విచిత్ర కవి పరంపరా వాహిని సంసారే కాళిదాస ప్రభృతయో ద్విత్రాః పంచషా వా మహా కవయః ఇతి గణ్యంతే"– ధ్వన్యా. పు. 34.
2. కుమారన్ ఆశాన్ (12-3-1873 నుంచి 16-1-1924)
   ఉళ్ళూర్ పరమేశ్వర అయ్యర్ (6-6-1877 నుంచి 15-6-1949)
   వళ్ళత్తోళ్ నారాయణ మేనోన్ (16-10-1878 నుంచి 13-3-1958)

తుఞ్చత్తెళుత్తచ్చన్ అనంతరం ఆయన ప్రవేశపెట్టిన అంతర్దృష్టి, శబ్ద సారళ్యం, ఉక్తి గాంభీర్యం లాంటి ఉదాత్త లక్షణాలు క్రమంగా అడుగంట సాగినయి. ఎళుత్తచ్చన్ తరువాత వచ్చిన కవితోద్యమాల్లో సంకుచిత దృష్టి, పదకాఠిన్యం, ఉక్తిపేలవత్వం చోటు చేసుకున్నాయి. ఈ క్షీణదశకి కారణాలు అనేకం. ముఖ్యమైంది: సంస్కృత పదాలమీదా, సమాసాలమీదా మితిమీరిన మోజూ, ఒకే మూస కట్టులో ఉండే పౌరాణికేతివృత్తాలే మళ్ళీ మళ్ళీ గ్రహిస్తూ ఉండడం. ఎక్కువ సంఖ్యలో వెలువడి నప్పటికీ ఆట్టకథ[1], చంపువు[2] – అసాధారణ ప్రతిభ ప్రదర్శించిన కొన్ని రచనల్ని మినహాయిస్తే తక్కినవన్నీ–సంస్కృత పద భూయిష్ఠతవల్లా, అంధానుకరణంవల్లా దెబ్బతిని పోయినయి. 17వ శతాబ్దానికి చెందిన కుఞ్చన్ నంప్యార్ ఒక్కరే పాండిత్య ప్రకర్ష శృంఖాలాలనుంచి మలయాళ సాహిత్యానికి విముక్తి కలిగించడంలో కొంతవరకు కృతకృత్యులు కాగలిగారు. కవిత్వ భాషలోకి పెద్ద ఎత్తున దేశ్య పదజాలాన్ని దిగుమతిచేసి కవిత్వానికి ఆయన కొత్త జీవం పోశారు. కాని, దురదృష్టవశాత్తు ఆ ఉద్యమం అల్పాయుష్కం అయింది. మహాకావ్యం మళ్ళీ వెనుకటి క్షీణ సంప్రదాయాన్నే ఆదరించడం, తత్ఫలితంగా మలయాళ కవిత్వం మరింత హీనదశకు దిగజారడం తటస్థించింది.

19 వ శతాబ్దం నాటి నంపూతిరి కవులు సంస్కృత సర్వాధిపత్యంమీద బలమైన తిరుగుబాటు చేశారు. అగ్రవర్ణస్థులైన ఈ కేరళ బ్రాహ్మణులు సంస్కృత భాషాధ్యయనానికి తామే పట్టుగొమ్మలై ఉండి కూడా సంస్కృత ప్రాబల్యాన్ని వారే ధిక్కరించడం చిత్రం! నంపూతిరి కవుల్లో పూన్తోట్టం[3], వెణ్మణి కవులు[4] మొదలైనవారు మధురమైన పదాల కూర్పు, లలితమైన హాస్యం, దేశ్య పదజాలం, అర్థవ్యక్తి, లౌకికేతివృత్తాలు అనే లక్షణాలతో కూడిన నూతన కవితా సంప్రదాయానికి అంకురార్పణ చేశారు. అయితే – కొత్తగా సాధించిన ఈ కవితా

1. కథాకళి నృత్యరూపకానికి సాహిత్యం – ఆట్ట కథ.
2. ఆలంకారికం, సంస్కృత పద భూయిష్ఠం అయిన గద్య పద్యోభయాత్మక రచన.
3. పూన్తోట్ట త్తచ్చన్ నంపూతిరి (1823-1865).
4. వెణ్మణి అచ్చన్ నంపూతిరి (1817-1891); వెణ్మణి మహాన్ నంపూతిరి (1844-1893). ఈ ఇద్దరూ తండ్రీ, కొడుకులు; వెణ్మణి సంప్రదాయ స్థాపకులు.

గుణా లన్నీ కామోద్రేకం కలిగించే చౌకబారు శృంగార రచనల అలంకరణానికే వారు ఉపయోగించడంతో మలయాళ కవిత్వంలో పునరుజ్జీవనం కలిగించడంలో వారి ఉద్యమం విఫలమైంది.

అంతవరకూ సంస్కృత పద భూయిష్ఠంగా ఉన్న మలయాళ కవిత్వం శిష్టులైన విద్వద్వర్గం వారినే అలరిస్తూ ఉండగా. ఈ నూతన కవితోద్యమం కవిత్వాన్ని రెండో కొసకి తీసుకుపోయి, దానికి ప్రజాదరణ, ఆకర్షకత్వం, వినోద దాయకత్వం సమకూర్చింది. అయితే, దాని ఆ విపరీతాకర్షణే దాని పాలిటి శాప మయింది. ఈ కవుల చేతుల్లో భాషాసంబంధమైన సాము గరిడీల స్థాయికి కవిత్వం దిగజారింది. అర్థపుష్టి లేని మధుర, మంజుల పదాల్ని కూర్చడంలోనూ, తమ భాషా వైదగ్ధ్యాన్ని చాటుకోడంలోనూ వారు ఒకరితో ఒకరు పోటీ పడ సాగారు. చౌకబారు తనంతో, అశ్లీలాలతో కూడిన ఒక కౌశలంగా కావ్యకళ తయారయింది. జన రంజకులూ, దేశ్య పదాల శక్తిని ఆవిష్కరించ గలిగిన ప్రతిభాశాలులూ అయినా, తాత్కాలికమైన ఇతివృత్తాలు తీసుకుని చౌకబారు రచనలు చెయ్యడం వల్ల వారికి 'మహాకవి' గౌరవాన్ని మనం కట్టబెట్టలేము. నిజానికి-విశ్వ జనీన ప్రాధాన్యం ఉన్న ఇతివృత్తం, ఉదాత్తమైన శైలీ—ఈ రెండూ జత కూడి నప్పుడే నిజమైన మహాకావ్యం వెలువడుతుంది. శబ్దాడంబరంతో కూడిన పాండిత్యం ప్రకర్షకి వ్యతిరేకంగా సాగిన మొట్టమొదటి తిరుగుబాటు ఉద్యమం ఆ విధంగా మలయాళ కవిత్వాన్ని అశ్లీలతా పేలవత్వాల పాలు చేసింది. విలాసపురుషు లైన ఆ కవులు లేవదీసిన నూతనోద్యమం మలయాళ సాహిత్యంమీద చిరస్థాయి అయిన ముద్ర వేయలేక పోయింది.

అందుచేత మలయాళ కవిత్వంలో గాంభీర్యాన్నీ, ఉదాత్తతనీ సాధించడం కోసం వెనుక ఎప్పుడో ఎழுత్తచ్చన్ వెలిగించిన అచ్చమైన కవితావేశ జ్యోతిని మలయాళ రచయితలు తిరిగి వెలిగించుకోవలసి వచ్చింది. నిజమైన ఆవేశంతో, శబ్దార్థ సామరస్యంతో, మౌలికభావ ప్రకటనతో కొత్త తరహా కవిత్వం ఆవిర్భవించ డానికి కాలం పరిపక్వమైంది. వెణ్మణి సంప్రదాయపు కవుల కవిత్వంలోని కృతకత్వం, చౌకబారు శృంగారం జుగుప్సావహాలు కావడంవల్ల ఆ కవిత కాల గర్భంలో లీనమైపోయింది. సరిగ్గా అలాంటి క్షణంలో ఆధునిక మహా కవి త్రయం మలయాళ సాహిత్య రంగంమీద దర్శనం ఇచ్చారు.

ఈ ముగ్గురు కవులూ అవతరించడానికి ముందుగానే దిక్చక్రంమీద ఆశా ద్యోతక మైన కొన్ని వెలుగు రేఖలు కనిపించినప్పటికీ, ముఖ్యంగా ఈ ముగ్గురు కవులూ చేసిన దోహదమే మలయాళ కవిత్వాన్ని ఆధునిక యుగ సింహద్వారం దగ్గిరికి చేర్చింది. ఎఝుత్తచ్చన్ సాహిత్య సంప్రదాయంతో తెగిపోయిన అను బంధం తిరిగి నెలకొల్పబడింది. విశ్వ మానవుని ఆశలూ, ఆశయాలూ, భయాలూ, ఆందోళనలూ తమ రచనలద్వారా వారు వ్యక్తం చేశారు. ముగ్గురూ అచ్చమైన మానవతావాదులే అయినా, వారి వారి ప్రత్యేక జీవన దర్శనాల కనుగుణంగా ఎవరి విలక్షణ మైన గొంతు వారికి ఏర్పడింది. తాత్త్విక దృష్టి ఎక్కువగా ఉన్న ఆశాన్ మానవ జీవనానుభూతి మూల స్రోతస్సుల్ని ఆవిష్కరించ గలిగారు. ప్రగాఢమైన అనుభూతి శీలం గల వళ్ళత్తోళ్ కవిత జీవితంలోని నానా విధాలైన ఆనందాల్నీ, అందాల్నీ దర్శించగలిగింది. భారతీయ సనాతన సంస్కృతినుంచి ఉత్తేజం పొంది విశ్వ మానవ సౌభ్రాత్ర లక్ష్యంవైపు మహాప్రస్థానం సాగించడానికి కార్య సరణిని గానం చేసినవాడు ఉళ్ళూర్. ఈ విధంగా ఈ కవిత్రయం మలయాళ భాషలో కాల్పనిక కవితోద్యమానికి దృఢమైన ప్రాతిపదికలు నిర్మించారు.

అయితే – వీరి కృషివల్ల మలయాళ కవితా రంగంలో వెలసిన కాల్పనికత నీరస లక్షణాలు కలది కాదు. ప్రపంచంలోని అన్ని సారస్వతాల్లోనూ కాల్పనిక కవితలో కనిపించే భావావేశ తీవ్రతని అదుపులో ఉంచుకో గలగడానికి వారి సాంప్ర దాయిక కవితా గుణాలు వారికి సహాయం చేసినయి. ముగ్గురూ సాంప్రదాయిక కవితా మార్గంలో సుశిక్షితు లైనవారే! గతంనుంచి వారసత్వంగా సంక్రమించిన కవితా గుణా లన్నిటినీ స్వాయత్తం చేసుకున్నవారే!

ఈ ముగ్గురిలోనూ సాంప్రదాయికతా ముద్ర ఉళ్ళూర్ మీద మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఆయన పద్యా లన్నిటిలోనూ దాన్ని మనం గుర్తించ వచ్చును.

# 2. బాల్యం

మధ్య తిరువాన్కూరు లోని చంగనాచేరి[1] సమీపంలో ఉన్న 'పెరున్న' గ్రామంలో పాలూర్ పోట్టి (నంపూతిరి) కుటుంబం[2] తర తరాలుగా జీవించిన తామరశ్శేరి ఇల్లమ్[3] లో 1877 జూన్ నెల 6 వ తేదీన[4] పరమేశ్వర అయ్యర్ జన్మించారు. 1949 లో కొచ్చిన్‌లో విలీనమై[5] 'తిరువాన్కూర్-కొచ్చిన్' రాష్ట్రంగా ఏర్పడేవరకూ ఒక మహారాజా పాలనక్రింద ఉన్న చిన్న స్వదేశ సంస్థానం తిరువాన్కూరు. పరమేశ్వరన్ 'కౌశిక' సగోత్రులు;[6] అందుకే తనలో బ్రాహ్మణుని ఆధ్యాత్మిక చింతనా, క్షత్రియుని పౌరుష ప్రవృత్తీ—రెండూ చిత్రంగా సమ్మేళన చెందినాయని ఆయన అంటూ ఉండేవారు. ఆయన అసలు పేరు 'సాంబశివన్'. వారి పూర్వీకుల్లో చాలామందికి ఆ పేరు ఉన్నట్టు కనిపిస్తుంది. ఎలాగో క్రమంగా ఆ పేరు మరుగున పడి, 'పరమేశ్వరన్' అనే ముద్దుపేరు ఖాయం అయింది. ఏ కారణంవల్లో కుటుంబంలోని స్త్రీలకు ఆ పేరు నచ్చింది.

ఆయన తండ్రి సుబ్రహ్మణ్య అయ్యర్ తమిళ బ్రాహ్మణులు. కొన్ని శతాబ్దాల క్రిందటనే వారి కుటుంబం కేరళకు వలస వచ్చినట్టు చెబుతున్నారు. కోలత్తునాడు (నేటి కేరళరాష్ట్రంలో మిక్కిలి ఉత్తరాన ఉన్న కణ్ణూర్ జిల్లా) లో మొదట

---

1. నేటి ఆలప్పుழ జిల్లా.

2. జన్మచేత తమిళ బ్రాహ్మణుడైనా, పరమేశ్వర అయ్యర్‌కి మలయాళ సాహిత్యం పట్ల అంత గాఢమైన అనురక్తి కలగడానికి కారణం ఆయన స్థానిక నంపూతిరి బ్రాహ్మణుల ఇంట్లో పుట్టడం అని తమాషాగా అంటూ ఉంటారు.

3. 'ఇల్లమ్' అంటే సాధారణంగా బ్రాహ్మణుల ఇల్లు అని అర్థం.

4. మలయాళ శకం 1052 ఇటవమ్ నెల 25 వ రోజు.

5. అనంతరం 1956 లో రాష్ట్ర పునర్విభజన సందర్భంలో 'తిరువాన్కూర్-కొచ్చిన్' రాష్ట్రం మలబారులో లీనమై, నేటి కేరళ రాష్ట్రం ఏర్పాటయింది.

6. కుటుంబ మూలపురుషుణ్ణి చెప్పేది 'గోత్రం'. ఈ కవి గోత్ర ఋషి 'కౌశికుడు' - విశ్వామిత్రుడు.

ఆ కుటుంబం స్థిరపడింది. కోలత్తునాడు పాలిస్తూ వచ్చిన కోలత్తిరి రాజవంశంవారి రాజధాని చిఱక్కల్‌లో కొన్ని తరాలపాటు పరమేశ్వరన్ పూర్వికులు కాలక్షేపం చేశారు. అనంతరం – ఆ పూర్వికుల్లో ఒక సాహసికుడు తన అదృష్టాన్ని అన్వేషిస్తూ తిరువనంతపురం వెళ్ళా లని తీర్మానించుకున్నాడు. 14వ శతాబ్దంలో తిరువాన్కూరు రాజకుటుంబం వారు చిఱక్కల్ రాజవంశంనుంచి ఇద్దరు రాజ కుమారుల్ని దత్తత చేసుకున్నారు. ఆ రాజ కుమారుల పరివారంతో పాటు ఈ కుటుంబం దక్షిణాదికి బయలుదేరింది. తిరువనంతపురం చేరుకున్న తరువాత పరమేశ్వరన్ తాలూకు ఆ పూర్వికుడు తిరువనంతపురానికి ఉత్తరంగా 4 మైళ్ళ దూరంలో ఉన్న ఉళ్లూర్ గ్రామంలో స్థిరపడ్డాడు. తిరువాన్కూరు రాజవంశంలో ఒక శాఖవారు బ్రాహ్మణులకు అగ్రహారంగా ఇచ్చిన గ్రామం అది. ఆ గ్రామంలోని సుబ్రహ్మణ్యస్వామి ఆలయం ఆ గ్రామస్థులకు గర్వహేతువు. అప్పు డప్పుడు తిరువాన్కూరు మహారాజా కూడా వచ్చి ఆ ఆలయం సందర్శించడం ఉంది. పరమేశ్వర అయ్యర్ తాను జన్మించిన 'పెరున్న' గ్రామాన్ని కాకుండా, తన పూర్వికులు స్థిరపడిన ఊరనే అభిమానంతో ఉళ్లూర్‌నే అనంతరకాలంలో తన కలం పేరుగా స్వీకరించారు (మలయాళ సాహిత్యవర్గాల్లో ఆయన్ని ఉళ్లూర్ పరమేశ్వర అయ్యర్ అనీ, ఒక్కొక్కప్పుడు కేవలం 'ఉళ్లూర్' అనీ కూడా వ్యవహరిస్తూ ఉంటారు). అమూల్యమైన ప్రభుత్వ సేవల ఫలితంగా ఆ కుటుంబ సభ్యులు కొందరు తిరువాన్కూరు చరిత్ర పుటలకు కూడా ఎక్కారు. ఉదాహరణకి—ఈ కవి పూర్వికుల్లో ఒకరైన సుబ్రహ్మణ్య అయ్యర్ తిరువనంతపురంలో విడిది చేసి ఉన్న బ్రిటిష్ సైనికాధికారులవద్దకు మహారాజా బలరామవర్మ (1798–1811) వద్ద నుంచి క్షమార్పణ పత్రం తీసుకుని వెళ్లారట! ఈ అంశం వెల్ష్ వ్రాసిన "సైనిక స్మృతులు" (Military Reminiscences) లో పేర్కొనబడింది. తనకు అలా వారసత్వంగా సంక్రమించిన వీరోచితమైన దేశభక్తి ఈ కవి రచనల్లో ప్రతిధ్వనిస్తూ ఉండడం సహజమే గద! సాంబశివ అయ్యర్ కుమారుడు వేంకటరామ అయ్యర్—పూర్ణాయుష్యం జీవించిన మహనీయుడు – సుప్రసిద్ధ వాగ్గేయకారుడూ, సంగీత శాస్త్రవేత్తా, కళా పోషకుడూ అయిన స్వాతి తిరునాళ్ (1828–1847) వంటి మహారాజులను సేవించారు. ఆయిల్యమ్ తిరునాళ్ రామవర్మ (1868–1880) ఉళ్లూర్‌లోని ఆలయం సందర్శించడానికి వచ్చినప్పుడు ఆయనకు వేంకటరామయ్యర్ ఇచ్చిన జవాబు ఒకటి చరిత్రకెక్కింది. మహారాజు "మీ కిష్టమైన వరం ఏదైనా కోరుకోండి—ఇస్తాను"

అనగా, తడుముకోకుండా ఆ వృద్ధ బ్రాహ్మణుడు "అయ్యా - నా కొక చేతికర్ర ఇప్పించండి చాలు!" అని కోరుకున్నట్టు ఐతిహ్యం! మహారాజు నిజంగానే బంగారు పొన్ను వేసిన చేతికర్ర ఒకటి ఆయనకు బహూకరించారట!

పరమేశ్వరన్ తండ్రి సుబ్రహ్మణ్య అయ్యర్ సాంబశివ అయ్యర్‌గారి కుమారుడు. ఆ సాంబశివ అయ్యర్ అర్ధాయుష్కంగా - తన తండ్రి వేంకటరామ అయ్యర్ ఇంకా జీవించి ఉండగానే - కాలం చేశారు. పరమేశ్వరన్ తల్లి భగవతి అమ్మాళ్ పుట్టిల్లు కూడా తిరువనంతపురం పరిసర గ్రామమే! సంస్కృతంలో మంచి విద్వాంసు డైనప్పటికి సుబ్రహ్మణ్య అయ్యర్ ఆర్థికమైన ఇబ్బందులవల్ల ఒక స్థానిక ప్రభుత్వ పాఠశాలలో ఒక చిన్న మలయాళం టీచరు ఉద్యోగానికి ఒడబడ వలసి వచ్చింది, రాష్ట్రంలో చాలా చోట్ల ఆయన హెడ్‌మాస్టరుగా కూడా పని చేశారు. సుదీర్ఘ కాలం పని చేసిన స్థలం చంగనాచేరి. ఉత్తర తిరువాన్కూరు ప్రాంతంలో మలయాళ భాషా బోధనలో ఇప్పటికీ ఆయన్ని అగ్రణి (pioneer) గా సంస్మరిస్తున్నారు. పరమేశ్వరన్ పుట్టిన కొద్ది కాలానికే మలయాళం పాఠశాలల మీద అసిస్టెంట్ ఇన్‌స్పెక్టరుగా ఆయనకి ప్రమోషన్ వచ్చింది. 1885 లో కాలం చేసేవరకూ ఆయన ఆ పదవిలోనే ఉన్నారు, అప్పటికి పరమేశ్వరన్ వయస్సు **12** ఏళ్ళు.

అధికార దర్పాలకు అలవాటుపడిన వ్యక్తి కాదు సుబ్రహ్మణ్య అయ్యర్. సంఘసేవకు ఇప్పు డున్నంత ప్రాధాన్యం లేని నాటి భూస్వామ్య వ్యవస్థలో కూడా అసాధారణ మైన సంఘచేతన ఆయనలో వెల్లివిరిసింది. చంగనాచేరి సిరియన్ కేథలిక్కుల పరిస్థితి మెరుగుపరచడానికి ఆయన గట్టి కృషి చేశారు. తిరువాన్కూరులో సిరియన్ కేథలిక్కులు ఎక్కువగా ఉన్న ప్రాంతాల్లో చంగనాచేరి ఒకటి. వారిలో చదువు సంధ్యలు తక్కువ. త్రాగుడు దురభ్యాసం ప్రబలంగా ఉండేది. వారికి ప్రాథమిక విద్య బోధించడానికి ఆయన పూనుకున్నారు. పలు ప్రాంతాల్లో 'మితపాన సంఘాలు' **(temporance committees)** ఆయన స్థాపించారు. ఆయన నిస్వార్థ సేవలను అక్కడి సిరియన్ కేథలిక్ నాయకులు కృతజ్ఞతతో స్మరిస్తారు.

సంఘ సంస్కరణంపట్ల ఉత్సాహం చూపడంతో పాటు తన పరిస్థితి మెరుగు పరచుకునే విషయంలో కూడా ఆయన తీవ్రమైన ఆసక్తి ప్రదర్శించారు. పట్టుదలగా చదివి ఆయన తిరువాన్కూరు ఉన్నత న్యాయస్థాన న్యాయవాద పరీక్షలో

ఉత్తీర్ణు లయారు. అయితే - న్యాయవాది వృత్తి చేపట్టడానికి కుటుంబపు పెద్ద వేంకటరామయ్యర్ అభ్యంతరం చెప్పడంవల్ల ఆ ఉపాధ్యాయ వృత్తితోనే అటు తర్వాత కూడా ఆయన సంతృప్తి చెందారు. చంగనాచేరిలోని లక్ష్మీపురం దివాణంలో రవివర్మ కోయిల్ తంపురాన్‌కి ఆంతరంగిక సచివులుగా కూడా ఆయన పని చేశారు.

తండ్రిలోని ఆ సుగుణా లన్నీ వారసత్వంగా కుమారుడికి సంక్రమించినయి. ఉళ్ళూర్ అనంతర జీవిత చరిత్రలో ఈ విషయం నిరూపిత మైంది.

ఆచారం ప్రకారం అయిదో ఏటనే పరమేశ్వరన్‌కి అక్షరాభ్యాసం జరిగింది. తండ్రిగారే మొదటి గురువు. సంస్కృత భాషలో తొలి పాఠాలు ఆయనే బోధించారు. బడిలో చేరి చదువుకుంటున్నా, అక్కడ చెప్పనివి ఇంటి దగ్గర తండ్రి బోధిస్తూ ఉండేవారు. ఆయన సంస్కృతాధ్యయనం సంప్రదాయ పద్ధతిలో సాగింది. ఆరేళ్ళు నిండేసరికి సంస్కృతంలో తొలి పాఠ్యగ్రంథాలు అమరకోశం, సిద్ధరూపం (శబ్దమంజరి), శ్రీ రామోదంతం (బాలరామాయణమ్), ధాతుపాఠమ్ లాంటి వన్నీ ఆయనకి కంఠతః వచ్చినయి తరువాత రఘువంశం, కుమారసంభవం, లఘుకౌముది చదివి తన సంస్కృత పాండిత్యానికి ప్రోదిచేసుకున్నారు. ఉద్యోగ రీత్యా తండ్రి గ్రామాంతరాలకు పోయినప్పుడు శ్రీ కృష్ణవిలాస అనే పండితుడి దగ్గిర ఆయన సంస్కృతం చదువుకుంటూ ఉండేవారు.

శ్రమపడి కంఠస్థం చేయడం-ఆధునిక విద్యావేత్తలు ఆ పద్ధతిని గర్హిస్తున్నా-విద్వాంసుడుగా, పరిశోధకుడుగా, సాహిత్య విషయాల్లో ప్రామాణికుడుగా తన అనంతర కార్యకలాపాల్లో ఈ కవికి ఎంతగానో ఉపయోగించింది.

గురుకుల క్లిష్ట మైన సంప్రదాయ పద్ధతిలో సంస్కృత భాషనే ఆయన అధ్యయనం చేస్తున్నా, రహస్యంగా పరమేశ్వరన్‌కి మలయాళ భాష అంటే తగని ఇష్టం; నాటి సంఘాన్నీ, కాలాన్నీ ఎదిరించడానికి కూడా వెనుదీయ నంతటి ఇష్టం! విద్యా బోధన విషయంలో సనాతన భావాలు గల ఆయన తండ్రి తన సంస్కృత పాండిత్య పరిధికి అనర్హా లని నిరసిస్తూ ఉండే మలయాళ గ్రంథాలు ఆయన చదవడం చూసి మండిపడేవారు. అయినా, ఆ గ్రంథాలపట్ల ఆయన ఆసక్తి ఏ మాత్రం తగ్గలేదు. ఉద్యోగరీత్యా తండ్రి టూర్ మీద వెళ్ళగానే ఎఝుత్తచ్చన్, కుఞ్చన్ నంప్యార్ మొదలైన ప్రాచీన మలయాళ కవుల కావ్యాలు స్నేహితుల దగ్గరనుంచి ఎరువు తెచ్చుకుని ఆవురావురు మని ఆయన వాటిని చదువుతూ ఉండేవారు. సుదీర్ఘ మైన

వేసవి సెలవల్లో తల్లికీ, నాయనమ్మకీ ఎఱ్ఱుత్తచ్చన్ అధ్యాత్మ రామాయణం నుంచీ, మహాభారతం నుంచీ, కుఞ్చన్ వ్రాసిన తుళ్ళాల్ పాట్టుకళ్ నుంచీ, కథాకళి సాహిత్యం నుంచీ రసవద్ఘట్టాలు చదివి వినిపిస్తూ ఉండేవారు. మలయాళ కవిత్వం పట్ల కుమారుడికి కలిగిన నూతనాభిరుచి అచిరకాలంలోనే తండ్రిగారి మనస్సును మార్చివేయ గలిగింది. తన గ్రంథ సంచయంనుంచే మలయాళ కావ్యాలు ఇస్తూ, వాటిని చదవ మని ఆయన ప్రోత్సహించసాగారు. ఇలా అడ్డగోలుగా కనిపించిన గ్రంథ మల్లా చదువుతూ వచ్చిన ఆ రోజుల్లోనే పరమేశ్వరన్‌కి మహాభారత హృదయం ఆవిష్కృత మయింది.

సంస్కృత భారతంలోని కొన్ని భాగాలను ఆయన తండ్రివల్ల విన్నారు. తరువాత స్వయంకృషివల్ల ఆ అధ్యయనం కొనసాగించి ఆ ఉద్గ్రంథం మీద గొప్ప అధికారం సంపాదించి, మలబారు పునశ్శేరి నంపి నీలకంఠశర్మ లాంటి సమకాలీన మహా విద్వాంసుల్ని కూడా ఆశ్చర్యచకితుల్ని చేశారు. నిరంతరం తనకు ఉత్తేజం కలిగించే నిధానంగానూ, మలయాళ భాషలో తన రచనల కెన్నిటికో వస్తువును సమకూర్చిన ఆకరంగానూ భారతం పట్ల గౌరవం ఆయనకు జీవితాంతం నిలిచి ఉంది.

ఎనిమి దేళ్ళు నిండేసరికి సంస్కృత ప్రధాన గ్రంథాల్లో ఆయన తగు మాత్రంగా పాండిత్యం ఆర్జించారు. పరమేశ్వరన్‌ని సంస్కృతంలో సాటి లేని విద్వాంసుడుగా తీర్చిదిద్దడం సుబ్రహ్మణ్య అయ్యర్ జీవితాశయం కావడంవల్ల కుమారుడి సంస్కృత విద్యాభ్యాసానికి సర్వ సౌకర్యాలూ ఆయన కలిగించారు. సంస్కృతంలో పై గ్రంథాలు చదవడంకోసం లక్ష్మీపురం ప్రభువు రవివర్మగారి వద్దకు కుమారుణ్ణి పంపించారు. వెనుక పేర్కొన్నట్టు ఆ రాజాగారు సుబ్రహ్మణ్య అయ్యర్‌కి మిక్కిలి సన్నిహితులు. సంస్కృతంలో మహావిద్వాంసు లైన ఆ తంపురాన్ ఆ నాటి ప్రముఖ కవుల్లో కూడా ఒక్కరుగా ప్రసిద్ధు లయ్యారు. అయిదేళ్ళపాటు నిరాఘాటంగా ఆయన దగ్గిర పరమేశ్వరన్ విద్యాభ్యాసం కొనసాగింది. సువిశ్రుతు డైన ఆ గురువువద్ద కుమారసంభవం, నైషధం, అభిజ్ఞాన శాకుంతలంలో కొన్ని అంకాలూ, కొన్ని చంపూ ప్రబంధాలూ ఆయన చదువుకున్నారు. కొన్నేళ్ళ అనంతరం ఉళ్లూర్ ఇంగ్లీషు నుంచి మలయాళంలోకి తర్జుమా చేసిన ఒక పద్యం చదివి ఆ గురువుగారు తన ఆనందాన్ని తెలుపుతూ ఆయనకి ఒక పద్యం వ్రాసి పంపారు. తన శిష్యుడికి మలయాళ సాహిత్యంలో ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉందని జోస్యం కూడా చెప్పారు. ఆ జోస్యం నిజం కావడానికి ఎక్కువకాలం పట్టలేదు. గ్రాహ

కత్వం ఎక్కువగా ఉండే ఆ విద్యార్థి దశలో చెప్పుకోదగినంత పాండిత్యం, చక్కని సాహిత్యాభిరుచీ అలవరుచుకోడం ఆ శిష్యుడికి కూడా అమితమైన ఆనందాన్ని కలిగించింది.

ఆ రోజుల్లోనే ఇంకో ప్రక్క పరమేశ్వరన్ ఆంగ్ల విద్యాభ్యాసం కూడా కొన సాగింది. సుబ్రహ్మణ్య అయ్యర్ స్వయంగా ఇంగ్లీషు చదువుకోకపోయినా, ఆధునిక కాలంలో ఆ భాషకి గల ప్రాధాన్యాన్ని ఆయన పూర్తిగా గుర్తించారు. ముందుగా సంస్కృత భాషమీద తగినంత అధికారం సంపాదిస్తే, ఆ తర్వాత మరో కొత్త భాష నేర్చుకోడం మరింత సుకరం కాగల దనే భావం తండ్రికి ఉన్నందువల్ల పరమేశ్వరన్ ఇంగ్లీషుచదువు ప్రారంభించడంలో కొంచెం జాప్యం జరిగింది. తన పదో ఏట చంగనాచేరి జిల్లా ఇంగ్లీషు స్కూల్లో ఆయన చేరాడు. ఆయన స్కూల్ రికార్డు ఉజ్జ్వలమైంది; చాలా తరగతుల్లో తరుచు డబుల్ ప్రమోషన్ చేయబడుతూ వచ్చాడు. అన్ని తరగతుల్లోనూ మొదటి స్థానం ఆయనదే!

తంపురాన్‌కీ, సుబ్రహ్మణ్య అయ్యర్‌కీ పొరుపులు రావడంతో ఆ విద్యాభ్యాస విష్కంభం హఠాత్తుగా అంతమై పోయింది. పరిస్థితులు తారుమారు కావడంతొ రాజుగారి దగ్గర ఆ యువ విద్యార్థి చదువుకునే అదృష్టం మరి లేకుండా పోయింది. దివాణానికి దూరంగా మరో ఇంటికి మకాం మారింది. తర్వాత కొద్ది కాలానికే అతిమూత్ర వ్యాధితో సుబ్రహ్మణ్యం అయ్యర్ మంచాన పడ్డారు. రాజాదరం తొలిగిపోయిందనే వ్యధ అవసానాన్ని మరింత తొందరించి ఉండవచ్చును. నలభై ఏళ్ళ నడి వయస్సులోనే అర్ధాయుష్కంగా ఆయన కన్నుమూశారు.

ముక్కుపచ్చ లారని బాలుడు పరమేశ్వరన్‌కి అది పెద్ద అఘాత మైంది. తండ్రి మరణంతో-ఇంతవరకూ తను అలవాటుపడ్డ సురక్షితమైన జగత్తు ఒక్కసారిగా కూలిపోయింది. జీవన వసంత మార్గంలో హఠాత్తుగా ఒక నల్లని నీడ అడ్డంగా పడిన ట్లనిపించింది. ఉన్నట్లుండి ఒక్క సారిగా తాను జీవన సంగ్రామం మధ్యకి నెట్టబడ్డాడు, తనని కబళింపజూస్తున్న కఠినమైన విధిని ఎదిరించి నిలిచే గుండె ధైర్యం అలవరచుకోవా లనీ, తన దుఃఖాన్ని విస్పష్టమైన కార్యసాధనగా పరిణమింపజెయ్యా లనీ ఆయన తీర్మానించుకున్నాడు. తల్లి, ముత్తవ, వితంతువైన ఒక పినతండ్రి కూతురు, సొంత చెల్లెలు, ఏడాది కూడా నిండని పసికందు అయిన ఒక తమ్ముడు-ఇందరు సభ్యు లున్న ఆ పెద్ద సంసారపు బరువు మోయవలసిన బాధ్యత ఆ పసి భుజ స్కంధాలమీద పడింది. సుబ్రహ్మణ్య అయ్యర్

ఉద్యోగంలో సర్వోచ్ఛస్థితిలో ఉన్న రోజుల్లో కూడా ఆ సంసారం చాలీచాలనట్టు గానే గడిచేది. అలాంటిది ఇప్పుడు ఆ సంసారం బరువు ముక్కుపచ్చ లారని ఆ పసివాడిమీద పడడంతో గడ్డు పరిస్థితి ఎదురైంది.

ఈ దుర్ఘటన అనంతరం ఆ కుటుంబం తిరువనంతపురం సమీపంలోని ఉళ్ళూర్ గ్రామానికి మారింది. తమ అయిన వాళ్ళందరూ అక్కడ ఉండడం వల్ల వాళ్ళకి ఆ ఊరు కొంత సంఘ బలాన్నీ, భద్రతా భావాన్నీ కలిగించింది. "శత్రు గూఢచారుల్లాగ కష్టాలు చెదురు మదురుగా రావు. చతురంగ బలాలతో ఒక్కుమ్మడిగా వచ్చి పడతాయి." పరమేశ్వరన్ తమ్ముడు తొమ్మిదేళ్ల పసిప్రాయం లోనే చనిపోయాడు. చెల్లెలు నిస్సంతుగా వితంతువు అయింది. ఆమెని కూడా తమ కుటుంబంలోకి ఆహ్వానించవలసి వచ్చింది.

పరిస్థితులకు తల ఒగ్గకుండా, మధ్యలో విఘాతం ఏర్పడిన తన చదువుని పరమేశ్వరన్ మళ్ళీ కొనసాగించాడు. తల్లీ, ముత్తవా చూపించిన ఆప్యాయతవల్లా, ప్రోత్సాహంవల్లా అతడు మళ్ళీ తిరువనంతపురం ఫోర్టు హైస్కూల్లో 'అప్పర్ ఫోర్తు క్లాస్'లో చేరాడు. ఉన్న కొద్దిపాటి ఆధారంతోనే అతి పొదుపుగా, అత్యాశ్చర్యకరంగా అతని ముత్తవ ఆ గడ్డు రోజులు వెళ్లదీసింది. రోజూ ఎనిమిది మైళ్ళ దూరం పోయి వస్తూ, మధ్యాహ్నం లంచ్ కోసం ఒక చక్రం[1] మాత్రమే పంచె మడతల్లో చుట్టి బొడ్డున దోపుకుని వెళుతూ, అతను బడి చదువు పూర్తి చేశాడు. తరచు దానిలో మళ్ళీ అరచక్రం ఆదా చేస్తూ కుటుంబానికి తోడ్పడుతూ ఉండేవాడు. అతని ధైర్యం, త్యాగ బుద్ధి ఎంత గొప్ప వంటే - చొక్కా, గొడుగు లాంటి కనీసపు అవసరాలు కూడా అతను ఆశించలేదు. అనంతర కాలంలో గడచిన రోజుల్ని స్మరిస్తూ ఆయన చెప్పినట్టు చాలాసార్లు కిరసనాయిలికి డబ్బుల్లేక మునిసిపల్ వీధిదీపాల దగ్గిర చదువుకోవలసి వచ్చేది. ఆ అగ్నిపరీక్షల కన్నిటికీ తట్టు కుని చదువు కొనసాగించి పదహారో ఏట అతను మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసయాడు.

అంతకు కొద్దికాలం క్రితమే తిరువనంతపురంలోని ఒక పెద్ద ఆఫీసరు మేనగోడలు అనంతలక్ష్మీ అమ్మాళ్‌ని పరమేశ్వరన్ వివాహ మాడాడు. బ్రహ్మ చారిగా ఉండగానే సంసారం బరువు మోయవలసి రావడంతో నిజానికి అంతకు

---

1. వెనకటి తిరువాన్కూరు రాష్ట్రంలో వాడుకలో ఉన్న నాణెం. ఇంచు మించు ఈ నాటి 4 నయా పైసలకు సమానం.

ఘుందే అతను సంసారి అయాడు. లాంఛనప్రాయంగా ఇప్పుడు గృహస్థు అయినా చదువుకి సంబంధించినంతవరకూ ఆతడు బ్రహ్మచారిగానే ఉండిపోవడానికి అది అడ్డు రాలేదు చేతికి అందిన ప్రతి పుస్తకం, ప్రతి పత్రికా అమితాసక్తితో ఆయన చదివేవారు. ఆశు కవిత్వం, అక్షర శ్లోకం[1] వంటి నిరర్థక సాహిత్య వ్యాసంగాలకు తలపడేవారు. అసాధారణమైన ధారణశక్తితో అన్ని పోటీల్లోనూ గెలుపొందేవారు.

ఈలోపుగా కుటుంబం ఆర్థిక పరిస్థితి మరింత దిగనాసిల్లింది. లోకజ్ఞత గల ముత్తవతల్లి ఆ కుర్రవాణ్ణి తన చదువు కింక స్వస్తి చెప్పమంది. కాని కుమారుని ఆస్థ, సమర్థతా చక్కగా గుర్తించిన తల్లి మాత్రం చదువు కొనసాగించ మని ప్రోత్సహించింది. విషమమైన ఉన్నత విద్యాపథంలో తొలి మలుపు తిరిగి ఎఫ్ ఎ. క్లాసు[2] లో చేరడానికి అతని మొండిపట్టుదలా, తల్లి దైవభక్తీ కారణం అయినయి ఆ నాడు మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉన్న తిరువనంతపురం మహారాజా కళాశాల్లో ఆయన చేరారు. ఉపాధ్యాయుల, సహ విద్యార్థుల ఆదరణవల్ల ఆయన కళాశాలా జీవితం ఆనందంగా గడిచింది సాహిత్యం, చరిత్ర లాంటి విషయాల్లో పై చెయ్యిగా ఉన్నా, గణితశాస్త్రంలో మాత్రం ఆయనకి అభిరుచి ఏర్పడలేదు. సహవిద్యార్థి వి. ఎస్. సుబ్రహ్మణ్య అయ్యర్[3] ఆసరాతో ఆ లోటు ఆయన భర్తీ చేసుకున్నారు. అనంతరం ఆ సుబ్రహ్మణ్య అయ్యర్ తిరువాన్కూరు సంస్థానం దివాన్ అయి, పరమేశ్వరన్ సాహిత్య జీవితం పొడుగునా ఆయనకి సన్నిహిత సహచరులుగా ఉన్నారు. సంస్కృతంలో ఆయన చొరవ చూసి, ఉపాధ్యాయుల్లో ఒకరైన మున్షీ ఎన్. రామకురుప్పు[4]

---

1. ఇప్పటికి కేరళలో ప్రచారంలో ఉన్న సాహిత్య వినోదం ఇది. ఒక నిర్ణీత క్రమంలో పండితులు తమకు నోటికి వచ్చిన శ్లోకాలు ఏకరువు పెట్టే సాహిత్యపు పోటీ ఇది.
2. ఇప్పటి పి. యు. సి. లేదా ఇంటర్మీడియేట్ పరీక్ష స్థానే అప్పుడు ఎఫ్. ఏ. పరీక్ష ఉండేది.
3. సుబ్రహ్మణ్య అయ్యర్ అధ్యక్షతను తన షష్ట్యబ్దపూర్తి సందర్భంలో తిరువనంతపురంలో జరిగిన ఒక సభలో ఉళ్లూర్ ఆ విషయంలో తాను ఆయనకు ఋణగ్రస్తుడై ఉన్నట్టు చెప్పారు.
4. రామకురుప్పు (1848–1897) నీరస నాటకాల రచనని ఆధిక్షేపిస్తూ, తాను వ్రాసిన "పరంగోటీ పరిణయమ్" అనే ఒక వ్యంగ్య పరిహాస రూపకంతో ఒక్క సారిగా ప్రసిద్ధిలోకి వచ్చారు.

రెండో భాషగా మలయాళానికి బదులు సంస్కృతం తీసుకోవలసిం దని ఆయనకి సలహా ఇచ్చారు. 1895 లో ఎఫ్ ఏ, పరీక్షలోనూ ఆ తరువాత రెండేళ్లకు బి. ఏ. పట్ట పరీక్షలోనూ ఆయన ఉత్తీర్ణు లయారు. ఇంగ్లీషు ప్రొఫెసర్ ఎస్.సి. బాయిల్‌కి ఆయన ప్రియతమ శిష్యుడు. ఇంగ్లీషులో ఆయనకి చాలా ఎక్కువ మార్కులు- ఒక్కొక్కప్పుడు 95 శాతందాకా కూడా వస్తూ ఉండేవి. స్వతంత్రంగానో, అనువాదం గానో ఇంగ్లీషులో కవిత్వం వ్రాసేందుకు పరమేశ్వరన్ చేసిన తొలి ప్రయత్నాలకు ఆ ప్రొఫెసర్ ప్రోత్సాహం లభించింది. బి. ఏ. లో ప్రత్యేక విషయంగా గణిత శాస్త్రం తీసుకోవలసిం దని ప్రిన్సిపాల్ ఇచ్చిన సలహాను కాదని ఆయన తత్త్వ శాస్త్రం (Philosophy) తీసుకున్నారు. ప్రిన్సిపాల్‌కి కోపం వచ్చినా ఇష్టమే గాని, తలుచుకుంటేనే గాభరా పుట్టించే ఆ గణితశాస్త్రం జోలికి మాత్రం తాను వెళ్లదలుచుకోలేదు. కళాశాలలో బహు ముఖ ప్రజ్ఞావంతు డని అతనికి ప్రసిద్ధి! సంస్కృతంలో ఆయన అనర్గళమైన పాండిత్యం చూసి ఫిలాసఫీ ప్రొఫెసర్ ఆయన్ని 'శాస్త్రీ!' అని పిలిచేవాడు. మరో ఇంగ్లీషు ప్రొఫెసరు ఆయన్ని 'కవి' అనే వాడు. తనకి తెలియకుండానే రామకురుప్ప్ సమస్కంధులైన వారి కిచ్చే గౌరవం ఇస్తూ, విద్యార్థులకు ప్రశ్న పత్రాలు ఇవ్వడంలోనూ, ఆన్సర్ పత్రాలు దిద్దడంలోనూ ఆయన సహాయం తీసుకుంటూ ఉండేవాడు.

అదే కాలంలో ప్రక్క ప్రక్కన సంస్కృతంలో కూడా కృషి కొనసాగిస్తూ, కరమణ కేశవశాస్త్రివంటి మహావిద్వాంసుల దగ్గిర ఆయన శుశ్రూష చేశారు. ఒటు విల్ కుఞ్ఞకృష్ణ మేనోన్, కె. రామకృష్ణ పిళ్లల సాహచర్యంవల్ల 'కవి'గా ఆయన కళాశాలా జీవితం ఉత్సాహకరంగా సాగింది. ఉళ్లూర్‌తో పాటు ఆ ఇద్దరూ కూడా అనంతర కాలంలో మలయాళ సాహిత్యంలో మహామహు లయారు. రామకృష్ణ పిళ్లని పత్రికా రచన చేపట్టేట్టు ప్రోత్సహించి, ఆ రంగంలో అతడు చరిత్ర సృష్టించ డానికి కారణభూతుడైన వాడు ఉళ్లూరే !

అనుకున్నట్టే ఫిలాసఫీలో ప్రథమశ్రేణిలో ఆయన బి.ఏ.పరీక్ష ప్యాసయారు. అయితే - ఇంగ్లీషులోనూ, సంస్కృతంలోనూ ఆయనకి ద్వితీయ శ్రేణి రావడం బాయిల్‌వంటి వారికి నిరుత్సాహం కలిగించింది. ఆ తరువాత తెలిసింది - ఆ రెండింటిలో ఆయనకి ఫస్ట్‌క్లాస్ రాకపోవడానికి కారణం ఆయన బ్రహ్మవ్రాత అని. చిత్రం ఏమిటంటే - తాను నిష్ణాతుడైన సంస్కృత, మలయాళ, తమిళ ఆంగ్ల భాషల్లో దేనిలోనూ ఆయన దస్తూరీ కుదురుగా ఉండదు. అనంతర కాలంలో

కూడా ఆ లోపాన్ని ఆయన సరిదిద్దుకోలేక పోయారు. అందమైన దస్తూరీ వ్రాసే వారిపట్ల ప్రశంసా భావాన్ని ఆయన దాచుకునేవారు కారు. తన లోపానికి పరిహారంగా అలాంటి వారికి ఉద్యోగా లిచ్చి సాయం చేసిన సందర్భా లెన్నో ఉన్నాయి.

ఆ రోజుల్లో ఆయన కుటుంబం లేమివల్ల ఎన్నో పాట్లు పడవలసి వచ్చింది. ఇల్లు తిరిగి కట్టుకునేందు కని ఏళ్లతరబడి తండ్రి ఆదాచేసిన కొద్దిమొత్తం చదువు కింద ఖర్చయిపోయింది. పరీక్షలకు పరమేశ్వరన్‌ని మద్రాసు పంపించడానికి ఆస్తి తాకట్టుపెట్టి ఆయన తల్లి అప్పు తేవలసి వచ్చింది. ఆ భారతీయ మాతృమూర్తికి పరమేశ్వరన్ ఎంతగా ఋణపడిందీ అంచనా కట్టడం కష్టం!

# 3. ఉన్నత పదవులు - సాహిత్య గౌరవాలు

"ఈ కుటుంబానికి కష్టకాలం ఎన్నటికి అంతం కాదా?" అని బంధువులు ఆదుర్దా పడేటంతగా పరమేశ్వరన్ విద్యాభ్యాస కాలం పొడిగించబడింది. ఆ సంగతి ఆయన మనస్సుని కూడా కలకపెడుతూనే ఉండేది. విశ్వవిద్యాలయపట్టం చేతికి రాగానే వెంటనే ఆయన ఉద్యోగ ప్రయత్నాలకు పూనుకున్నారు. వెనుక తను చదుకున్న తిరువనంతపురం ఫోర్ట్ హైస్కూల్లోనే వెంటనే ఒక చిన్న టీచరు ఉద్యోగం దొరకడంతో ఆయన చిరకాల వాంఛితం నెరవేరింది. అయితే - వెంట వెంట ప్రమోషన్‌లు రావడంతో 21 ఏళ్ల తరుణ వయస్సులోనే ఆయన తిరువనంతపురం హైస్కూలుకి హెడ్‌మాస్టరుగా నియమించబడ్డారు. ఇంగ్లీషు, చరిత్ర, సంస్కృతం, మలయాళం ఆయన బోధించేవారు. ఆయన హెడ్‌మాస్టర్ గిరీలో ఆ స్కూలు సర్వతోముఖంగా అభివృద్ధి పొందింది. ఆ స్కూల్లో ఆయనతో సహోపాధ్యాయుడుగా పనిచేసిన గణపతిశాస్త్రి అనంతరం-కాళిదాసుకంటె పూర్వుడైన సుప్రసిద్ధ నాటక కర్త భాసమహాకవి నాటక చక్రాన్ని లోకానికి ఆవిష్కరించి, జగద్విఖ్యాతు లయారు. లభించిన అవకాశాన్ని జారవిడువకుండా ఉళ్లూర్ ఆయన దగ్గిర సంస్కృత వ్యాకరణ గ్రంథాలు అధ్యయనం చేశారు. తోడ్తో - న్యాయశాస్త్ర ప్రథమ పరీక్ష అయిన ఎఫ్. ఎల్. కి కూడా కట్టి పాసయారు.

అంతలో మహారాజా కళాశాలలో ఒక మలయాళ పండిత పదవి ఖాళీ వచ్చింది. ఆయన వెనుకటి గురువు బాయిల్‌కి ఆ పదవికి ఎవరు అర్హులు అనే విషయంలో ఎలాంటి సందేహం లేదు. మలయాళ విద్యా వాచస్పతి అనదగిన కేరళ వర్మ వలియకోయిల్ తంపురాన్ కూడా పరమేశ్వరన్ అభ్యర్థిత్వాన్ని బలపరిచారు. అయితే – బి. ఏ. లో గణితశాస్త్రం తీసుకో మని తను ఇచ్చిన సలహా ఖాతరు చెయ్యకుండా తనని అవమానించా డనే కోపం మనస్సులో పెట్టుకుని ప్రిన్సిపాల్ ఆ పదవికి అయన్ని తీసుకోడానికి నిరాకరించాడు.

పెద్ద సంసారాన్ని తాను పోషించవలసి రావడంచేత ఎలాంటి పురోభి వృద్ధీ లేని ఆ హెడ్‌మాస్టర్ గిరీతో సంతృప్తిపడి ఆయన ఊరుకోలేకపోయారు. అందుచేత – ఆ పదవికి రాజీనామా ఇచ్చి, 1901 లో జనాభా లెక్కల కార్యాల యంలో ఆయన గుమాస్తాగా చేరారు. ఒక చిత్రమైన పరిస్థితి అందుకు దారి తీసింది. ''ప్రాచీన భారతదేశంలో స్త్రీలు'' అనే అంశంమీద ఒక సభలో పరమే శ్వరన్ చదివిన వ్యాసం జనాభా లెక్కల కమీషనర్ డా॥ ఎన్. సుబ్రహ్మణ్య అయ్యర్‌ని ముగ్ధుణ్ణి చేసింది. ఆయన స్వయంగా పరమేశ్వరన్‌ని ఆ ఉద్యోగానికి ఆహ్వానించారు. ఆశ్చర్యం ఏమిటంటే–జనాభా లెక్కల శాఖలో ఈ కొత్త ఉద్యో గంలో ఆయనకి తన వెనుకటి జీతంలో సగం కూడా రాదు. కాని, కష్టించి పని చేసే యువకుడికి అక్కడ ప్రమోషన్‌కి అవకాశాలు చాలా ఎక్కువ! అక్కడ చురు కుగా పనిచేసి కొద్ది నెలల్లోనె ఆయన హెడ్ గుమాస్తా అయారు. ఆయన చేసే పని తిరువాన్కూరు ప్రజల సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులకు సంబంధించిన వివరాలను సేకరించి, వర్గీకరించడానికి సంబంధించింది కావడంవల్ల పరిశోధన ప్రీతి గల పరమేశ్వరన్‌కి ఆర్థికంగా ఎక్కువ లాభదాయకం కాకపోయినా, ఎక్కువ ఉత్సాహాన్నీ, సంతృప్తినీ ఆ పని చేకూర్చింది.

**1901** (మ. శ. **1076**) వ సంవత్సరపు జనాభా లెక్కల నివేదిక తయారు చేయడంలో ఆ గుమాస్తా అసాధారణ పాండిత్యం, వర్గీకరణ నైపుణీ అభివ్యక్త మయినయి. నివేదికలో డా॥ అయ్యర్ కృతజ్ఞతతో ఆ అంశాన్ని పేర్కొన్నారు. ఉద్యోగి పరంపరలో మరింత బాధ్యతాయుత మైన పదవికి ఆయన అర్హు డని హృదయపూర్వకంగా ప్రభుత్వానికి సిఫార్సు చేశారు. జనాభా లెక్కలు పూర్తి అయిన వెంటనే ఆ నివేదిక సారాంశాన్ని మలయాళంలోకి తర్జుమా చేసే పని ఆయనకి అప్పగించారు. దానిక్రింద ఆయనకి మొత్తం రూ. **300/–**లు ప్రతి

ఫలంగా ఇచ్చేట్టు ఒప్పందం. ఆ పని పూర్తి అయిన తర్వాత కొద్ది సంవత్సరాలు రకరకాల తాత్కాలికోద్యోగాలతో ఆయన సంతృప్తి చెందవలసి వచ్చింది. తిరువాన్కూరు చరిత్ర రచయిత నాగమయ్య తన సుప్రసిద్ధ గ్రంథం "తిరువాన్కూరు ప్రభుత్వం మాన్యువల్" తయారు చెయ్యడంలో ఈ యువకుడి సాయం కోరారు. పరమేశ్వరన్ బుద్ధి సూక్ష్మతా, విజ్ఞాన సంపదా ఆ వృద్ధ చారిత్రకుణ్ణి ఆకర్షించినా యనడానికి తార్కాణంగా ధర్మాదాయసంస్థల బిల్లు చిత్తు ప్రతి తయారుచేయడంలో వివిధ దశల్లో ఆయన పరమేశ్వరన్ సాయం తీసుకున్నారు. తరువాత – నాగమయ్యే ఆ బిల్లుని రాష్ట్ర శాసన సభలో ప్రతిపాదించి పాసు చేయించారు.

నాటి విద్యా, వైజ్ఞానిక రంగాలలో పరపతి పెరిగిన సంపూర్ణ వ్యక్తిగా అప్పటికి పరమేశ్వరన్ రూపొందారు. డా॥ ఎడ్గార్ తర్‌స్టన్ తన ఉద్గ్రంథం "దక్షిణభారత కులాలు–జాతులు" తయారు చేయడంలో తిరువాన్కూరు ప్రజల సాంఘిక, సాంస్కృతిక పూర్వరంగంతో విశేష పరిచయం గల పరమేశ్వరన్‌లో సమర్థుడైన సహాయకుణ్ణి గుర్తించారు, తరువాత పరమేశ్వరన్ చేసిన ఉద్యోగం పద్మనాభపురం డివిజన్‌కి (ఆక్టింగ్) శిరస్తాదారు.[1]

ఒకవంక జనాభాలెక్కల నివేదికతో సతమత మవుతూనే, నిర్విరామంగా శ్రమిస్తూ మరోవంక న్యాయ విద్యాభ్యాసం ముగించి, 1904లో ఆయన బి. ఎల్. పట్టం పుచ్చుకున్నారు. ఆ మరుసటి ఏడాది మలయాళం, తమిళ భాషలలో ఎం.ఏ. పరీక్షలో ఉత్తీర్ణులై విద్యారంగంలో మరో ఘన విజయం సాధించారు. కాలాన్నీ, జవసత్తువల్నీ పొదుపుగా వాడుకుని కష్టించి పని చేస్తే ఎలాంటి ఘనకార్యాలనైనా సాధించవచ్చు నని నిరూపించారు. మొదట బాయిల్ సలహామీద ఇంగ్లీషులో ఎం. ఏ కి చదవడం మొదలుపెట్టినా, కేరళవర్మ వలియకోయిల్ తంపురాన్ ప్రోద్బలం వల్ల ఆ ప్రయత్నం విరమించి, మలయాళం, తమిళ భాషలలో ఎం. ఏ. కి కట్టారు. మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి ఆ పట్టం అందుకున్న ప్రప్రథముడు కావడంవల్ల ఆయన ఆ ఘన విజయాన్ని అందరూ అభినందించారు.

ఎం. ఏ. పట్టం పొందడంతో విద్యారంగంలో నూతనావకాశాలు అనేకం ఎదురయినయి. ఆయన మలయాళ భాషా పాండిత్యాన్ని గుర్తిస్తూ రాష్ట్ర ప్రభుత్వం

1. –నేటి పరిభాషలో డిప్యూటీ కలెక్టర్ పదవికి సమానం,

ఆయన్ని సహాయ పరీక్షకుడుగా నియమించింది. మద్రాసు విశ్వవిద్యాలయం కూడా ఆయన్ని పరీక్షకుడుగా ఎన్నుకుంది.

వృత్తిలో ఇలా అభ్యుదయం సిద్ధిస్తూ ఉండగా మరోవంక సాంసారిక మైన ఉపద్రవాలను ఆయన ఎదుర్కోవలసి వచ్చింది. పార్వతి, సుబ్రహ్మణ్యం అనే ఇద్దరు పిల్లలు కలిగాక, ఉన్నట్టుండి 1904లో ఆయన భార్య మరణిం చింది. ఆ తర్వాత రెండేండ్లకు సుబ్బమ్మాళ్‌ని ఆయన వివాహమాడాడు. ముగ్గురు కుమార్తెల్ని, అయిదుగురు కుమారుల్ని కని, 1930 లో ఆవిడ కూడా కన్ను మూసింది. పిల్లల్లో కడసారివాడు పసితనంలోనే పోయాడు. తక్కినవాళ్ళు పెరిగి పెద్ద అయి, జీవితంలో సుఖంగా స్థిరపడ్డారు. వారిలో ముగ్గురు ఇంకా సజీవులుగా ఉన్నారు.

ఆకర్షకమైన అనేక ఉద్యోగాలకు మద్రాసునుంచి ఆయనకు ఆహ్వానాలు వచ్చినయి. వాటిని అంగీకరించి ఉంటే, మలయాళ భాషా, సాహిత్యాలమీది ప్రీతికి స్వస్తి చెప్పి పరమేశ్వరన్ జీవితం మరో మార్గం పట్టి ఉండేది. ఒక ఆహ్వానం మద్రాసు హైకోర్టులో మలయాళం అనువాదకుడుగా రమ్మని. మరొకటి: ఆ కోర్టులోనే లాయరుగా ప్రాక్టీసు చెయ్యమని. ఇంకోటి: 'ది హిందూ' పత్రికలో సహాయ సంపాదకుడుగా రమ్మని. తీవ్రకాంక్షా పూరితుడైన ఆ యువకుడు ఆ పదవుల్లో దేనికీ అంగీకరించకుండా అడ్డుపడిన పరమేశ్వరన్ ముత్తవ తల్లికి మలయాళ సాహిత్యం ఎంతగా ఋణపడి ఉన్నదో వర్ణించడం కష్టం!

అంతలో పరమేశ్వరన్‌కి అదృష్టం కలిసి వచ్చింది. తిరువాన్కూరు దివాన్ వి. పి. మాధవ రాయర్ కోరిక మీద ఒక్క నెల రోజుల అల్ప వ్యవధిలో ఆయన 'తిరువాన్కూరు సైనిక దళ చరిత్ర' వ్రాశారు. దానిలో కనిపించిన ఆయన కూలంకష మైన అవగాహన దివాన్‌ని ముగ్ధుణ్ణి చేసింది. వెంటనే 1906 లో ప్రభుత్వ సచివాలయంలో రెవిన్యూ సెక్షన్‌కి హెడ్ క్లర్క్‌గా దివాన్ ఆయన్ని నియమిం చారు. దీనితో ఒక విధంగా ఆయన చిరకాల వాంఛితం నెరవేరింది. అధికార పదవీ నిశ్రేణిక మీద అతి శీఘ్ర గతిని పైకి పోవడానికి అది నాంది అయింది. చేరిన ఒక్క నెలరోజుల్లోనే 'కొట్టరకర'లో తహసీల్ – మేజిస్ట్రేట్[1] గా ఆయన్ని

1. కార్యనిర్వాహ కోద్యోగులకు ఆ రోజుల్లో న్యాయ నిర్ణయ విధులు కూడా ఉండేవి.

ప్రమోట్ చేశారు. మాధవ రాయర్ అనంతరం దివాన్ అయిన ఎస్. రాఘవా చారియర్ ఆయన్ని మళ్ళీ సచివాలయానికి మార్చారు. కొద్ది రోజుల్లోనే కొత్త దివాన్ గారికి కూడా ఆయన ఇష్టుడయాడు. టూర్‌లో దివాన్ ఆయన్ని తన వెంట తీసుకొని వెళుతూ ఉండేవాడు. మామూలుగా ప్రభుత్వ కార్యదర్శులకు మాత్రమే లభించే గౌరవం అది. ఉద్యోగకాలంలో తన బహుముఖ మైన ప్రజ్ఞ, విస్తార మైన అనుభవం, ప్రగాఢమైన పాండిత్యం ఆయనకు రక్షా బంధనాలుగా ఉపకరించినయి. అయితే ఉద్యోగం వచ్చిన తొలి రోజుల్లో మామూలుగా ఎదు రవుతూ ఉండే కడగండ్లను ఆయన కూడా తప్పించుకో లేక పోయారు. తహసి ల్దారుగా చాలా తాలూకాల్లో ఆయన పని చేశారు. ఎక్కడ పని చేసినా, మానవ సంక్షేమ కార్యక్రమాల వల్ల ప్రజానీకం అభిమానాన్నీ, నిజాయితీతోనూ, సమర్థత తోనూ అధికారుల ఆదరణనీ ఆయన చూరగొనే వారు.

అనంతరం 1910 లో తిరువాన్కూరు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి హిందూ ప్రాచీన శాస్త్ర గ్రంథాల్లో ఆయన కూలంషక మైన ప్రజ్ఞని గుర్తించడంతో న్యాయశాఖకు ఆయనను బదిలీ చేశారు. జిల్లా మున్సిఫ్‌గా నియమించబడడం చెప్పుకో దగినంత పెద్ద ప్రమోషన్. ఒక్క విషయంలో తప్పిస్తే, పరిస్థితు లన్నీ అనుకూలంగానే ఉన్నాయి. ఉద్యోగం కారణంగా వివిధ ప్రదేశాలు మారుతూ ఉండడంతో ఆయన సాహిత్య ఆకాంక్షలు బాగా దెబ్బ తిన్నాయి. మహారాజా శ్రీ మూలం తిరునాళ్, దివాన్ శ్రీ పి. రాజగోపాలాచారియర్, కేరళ వర్మ వలియ కోయిల్ తంపురాన్ మొదలైన ఆయన శ్రేయోభిలాషులు కూడా ఈ విషయంలో ఆందోళన చెందారు. తత్ఫలితంగా–1913 లో ప్రభుత్వ సచివాలయంలో (ఆక్టింగ్) సహాయ కార్యదర్శిగా ఆయన నియుక్తు లయారు. అటు తరువాత పన్నెండేళ్ల పాటు సచివాలయంలోని వివిధ శాఖల్లో, శ్రీ టి. రాఘవయ్య, శ్రీ ఎమ్. కృష్ణన్ నాయర్ వంటి ఎందరో దివాన్‌ల క్రింద వారి ఘనమైన ప్రశంస లందుకుంటూ ఆయన పని చేశారు. అక్కడ పని చేస్తూనే మ్యూజియమ్ డైరెక్టరు లాంటి ఎక్స్–అఫీషియో గౌరవ పదవులు కూడా ఎన్నో ఆయన నిర్వహించారు. కొద్ది కాలం పాటు దివాన్ ఎమ్. కృష్ణ నాయర్ దగ్గిర ఆంతరంగిక కార్యదర్శిగా పని చేస్తూ, అప్పుడే ఏర్పాటైన శ్రీ మూలం శాసనసభ[1] కు న్యాయ కార్యదర్శిగానూ, సభ్యుడు

1. తిరువాన్కూరులో శాసన సంస్కరణలు ప్రారంభించిన శ్రీ మూలం తిరు నాళ్ రామవర్మ (1885–1924) పేరున 'శ్రీ మూలం ప్రజాసభ' వెలి సింది.

గానూ కూడా పని చేశారు. 1937 లో ఆ సభ రద్దయ్యే వరకూ ఆయన ఆ పద విలో ఉన్నారు. శాసన సభలోనూ, సచివాలయంలోనూ గడించిన విస్తృత మైన, బహుముఖ మైన ఆయన అనుభవానికి గుర్తింపుగా ఆ పదవి ఆయన్ని వరించింది.

శాసన సభా కార్యదర్శిగా ఆయన చేసిన సేవ వేనోళ్ల కీర్తించబడింది చాక చక్యంతో, అతి నేర్పుగా ఆ పదవిని ఆయన నిర్వహించిన తీరును ఉన్నత పదవులలో ఉన్న పెద్దలు పలువురు బహిరంగంగా కొనియాడారు. సభ్యులకు సముచిత మైన, సవివర మైన సమాధానాలు ఇవ్వడంలో పరిణత మైన ఆయన బుద్ధి విశేషంగా తోడ్పడింది. దివాన్‌లకు ఆయన వ్రాసి పెట్టిన ప్రసంగాల్లో కనిపించే ఔచిత్యం, తను స్వయంగా తయారు చేసిన 'పరిపాలన నివేదికల' (Administrative Reports) లో కనిపించే సమగ్రతా, శాసన సభా వృత్తాంత సంగ్రహాల్లో కనిపించే అన్యూ నాతిరిక్తతా (Precision) నేటికి నిరుపమాన మైనవి. శాసన సభా గ్రంధాలయాన్ని పెంపొందించిన ఘనత కూడా నిస్సందేహంగా ఆయనకే దక్క వలసి ఉంది.

ఒక వంక ఈ ఔద్యోగిక విజయాలతో పాటు మరో వంక సాహిత్య గౌర వాలూ, సమ్మానాలూ కూడా అసంఖ్యాకంగా ఆయన పొందారు ఇండియాలోనూ, విదేశాల్లోనూ గల ఎన్నో విద్వత్పరిషత్తుల గౌరవ సభ్యత్వాలు ఆయన్ని వరించి నయి. 30 ఏళ్ల నడి వయస్సులోనే ప్రొఫెసర్ కె. వి. రంగస్వామి అయ్యంగార్ లాంటి ఆరితేరిన చారిత్రకుల సరసను "చారిత్రక పత్ర సంరక్షక సంఘం" (Historical Records Preservation Committee) లో ఆయన సభ్యుడుగా నియమించబడ్డారు. అలా కార్యకారి సభ్యుడుగా ఆయన పాల్గొనిన సంఘాల సంఖ్య అపరిమితం. దేశభాషా విద్యా బోధన సంఘం, మలయాళ పాఠ్యగ్రంథ సంఘం, పాఠ్య ప్రణాళికా సవరణ సంఘం, పాఠ్యగ్రంథ పరిష్కరణ సంఘం, వేతన నిర్ణయ సంఘం, మొదలైన ఎన్నో సంఘాల్లో ఆయన సభ్యులు. రాయల్ సొసైటీ ఆఫ్ ఆర్ట్స్, రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్, ది సొసైటీ ఆఫ్ ఆథర్స్, ప్లేరైట్స్ అండ్ కంపోజర్స్, జానపద సాహిత్య పరిషత్, ది ఈస్ట్ ఇండియా అసోసియేషన్, ది ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్, ది ఆంత్రపొలాజికల్ సొసైటీ ఆఫ్ బోంబే వంటి విద్వత్పరిషత్తు లెన్నో తమ విశిష్ట సభ్యుడుగా ఆయన్ని ఎన్నుకున్నాయి ఎన్నో సంఘాల్లోనూ, పరిషత్తుల్లోనూ సభ్యుడుగా ఉన్నా, దేనిలోనూ కేవలం సాక్షిభూతు డైన సభ్యుడుగా ఉండడంతో అయన తృప్తి చెందలేదు; ఆ అన్ని సంస్థలకి ప్రాణ భూతులుగానే ఉండి పని చేశారు

ఏ సంస్థ సభ్యత్వాన్నీ కేవలం అలంకార ప్రాయంగా గాని, గౌరవ మాత్రంగా గాని ఆయన భావించ లేదు. ఆత్మార్పణ బుద్ధితో సేవ చేయగల ఒక అవకాశం గానే ఆయన వాటిని గ్రహించారు.

ఉద్యోగ జీవిత కాలంలో ఆయన రూపొందించిన అసంఖ్యాక మైన నివేదికలే పరమేశ్వర అయ్యర్‌లోని ఈ సుగుణాలకు ప్రత్యక్ష నిదర్శనం. ఆ నివేదికల ప్రముఖ లక్షణం - సమగ్రత. చాలా వరకు ఈ లక్షణమే తన సహచరుల్ని వెనక్కి త్రొక్కి తాను పురోగమించేందుకు ఆయనకి తోడ్పడింది. జనాభా లెక్కల నివేదిక తయారు చెయ్యడంలోనూ, తిరువాన్కూరు రాష్ట్రపు మాన్యువల్‌కి సంబంధించిన పనిలోనూ, తిరువాన్కూరు సైనికదళ చరిత్ర రచనలోనూ ఎంత శీఘ్ర కాలంలో ఆయన ఎంత సమగ్రత సాధించిందీ వెనుక మనం గమనించి ఉన్నాం. ఇంత కాలం గడిచినా ఇప్పటికీ బహు విషయ సంభరితము లైన ఆయన నివేదికలు చూసి మనం ఆశ్చర్య పోతూ ఉంటే, ఇక ఆయన సహచరుల నవి ఎంతగా దిగ్భ్రాంతుల్ని చేసి ఉంటాయో సులభంగానే మనం ఊహించవచ్చును. తనకు వప్పగించిన చిన్న చిన్న దైనిక విధుల్లో కూడా పరమేశ్వర అయ్యర్ ఎంత సమగ్రతని సాధించే వారో నిరూపించే నిదర్శనా లనేకం ఉన్నయి. తిరునల్వేలిలోని బ్రిటిష్ కలెక్టర్‌ని ఒక తిరువాన్కూరు యువకుడు హత్య చేసినప్పుడు విచారణ సంఘానికి తోడ్పడేందుకు తిరువాన్కూరు ప్రభుత్వం ఆయన్ని పురమాయించింది. ఆ కార్యంలో ఆయన శ్రద్ధని మద్రాసు, తిరువాన్కూరు ప్రభుత్వాలు రెండూ అభినందించినయి. చెన్‌కోట్టలో జిల్లా మున్సిఫ్‌గా ఉండగా జరిగిన ఉదంతం ఇది.

బ్రిటిష్ ప్రభుత్వం తిరువాన్కూరులోని పాలక వంశాల, దండ నాయకుల సమగ్ర చరిత్ర కావాలని కోరినప్పుడు ఆ పనికి పరమేశ్వర అయ్యర్ ఒక్కరే సమర్థు లని ఆయన్ని ఎన్నిక చేశారు – దివాన్ రాజగోపాలాచారియర్. పర్యవసానంగా అద్భుతమైన చరిత్ర గ్రంథం తయారయింది. తరువాత ప్రభుత్వం చేత అది ప్రచురించ బడింది కూడా.[1] మరొక గ్రంథం – మహారాజా శ్రీ మూలం తిరునాళ్ పరిపాలనని గురించి దాదాపు వెయ్యి టైపు పేజీల్లో ఇంచుమించు ఒక్క నెల రోజుల్లోనే ఆయన తయారు చేశారు. పరిపాలన చరిత్రకు సంబంధించిన వివరాలకు ఒక గనివంటి దని దివాన్‌లు అనేకులు దాన్ని ప్రశంసించినా, దురదృష్ట వశాత్తు నేటికి అది అముద్రితంగానే ఉండిపోయింది.[2]

---

1. A Brief Account of the Rajas and Chiefs of Travancore.
2. Thirty-three years of Progress (1918).

1925 లో పరమేశ్వర అయ్యర్ క్విలాన్‌లో 'దివాన్-పేష్కార్' గానూ, జిల్లా మేజిస్ట్రేట్‌గానూ నియమించబడ్డారు. అప్పుడు దివాన్‌గా ఉన్నది ఎమ్. ఇ. వాట్స్. ఆయన దివాన్‌గిరీ లోనే సర్ హార్‌కోర్ట్ బట్లర్ అధ్యక్షుడుగా బ్రిటిష్ ప్రభుత్వం నియమించిన 'బట్లర్ సంఘం' ఇండియా సందర్శించింది. తాము ఉద్దేశించిన సమాఖ్యా రాజ్యంలో చేరే విషయమై స్వదేశ సంస్థానాల అభిప్రాయాలను ఆ కమిటీ సేకరిస్తూంది ఆ అవకాశాన్ని వినియోగించుకొని పరమేశ్వర అయ్యర్ అసాధారణ మైన తన రచనా శక్తీ, అసంఖ్యాకంగా ఉన్న వివరాలపట్ల అత్యంత శ్రద్ధా, అమితంగా ఉన్న భోగట్టాని ఒక క్రమ పద్ధతిలో ఇమిడికగా ప్రకటించ గల నైపుణీ ప్రదర్శిస్తూ ఆ సంఘానికి తిరువాన్కూరు ప్రభుత్వం అర్పించే నివేదిక (Memorandum) ని తయారు చేశారు. రెండు మాసాల స్వల్ప వ్యవధిలో ఆ ఘనకార్యం సాధించడంలో ఆయన ప్రకటించిన వేగాన్నీ, ఆకళింపునీ అతిశయించే సందర్భాలు భారత పరిపాలన చరిత్రలో అతి విరళం! పరమేశ్వర అయ్యర్ చేసిన మరపు రాని ఆ సేవని గుర్తిస్తూ దివాన్ వాట్స్ ఆవేశ భరిత మైన మాటలతో ప్రగాఢమైన తన కృతజ్ఞతని ఆయనకి తెలియజేశారు. అసంఖ్యాకమైన ఆధికారిక పత్రాలను అంత త్వరిత గతివి వ్రాయడం వల్లనే బహుశః ఆయన దస్తూరీ దెబ్బ తిన్నదేమో !

విద్వ త్సమాజపు ఏకగ్రీవమైన ఆమోదంతో పాటు – అంతకంటె మరింత విస్పష్టమైన ప్రశంసలూ, సమ్మానాలూ రాజకుటుంబం నుంచీ, ప్రజానీకం నుంచీ పరమేశ్వర అయ్యర్‌కి లభించినయి. 34 ఏళ్ళ ప్రాయంలోనే, ఆయన జిల్లా మున్సిఫ్‌గా పని చేస్తున్న రోజుల్లోనే శ్రీ మూలం తిరునాళ్ రామవర్మ ఆయనకి 'వీర శృంఖల' [1] బహూకరించారు. అప్పటికి ఆయన సామాన్యమైన కొద్ది సాహిత్య రచనలు మాత్రమే చేశారు. ఆయన సర్వోత్కృష్ట రచనలు అటు తరువాతనే వెలుగు చూసినయి. అయినా, ఆ రోజు సమ్మానాన్ని 'మలయాళ మనోరమ' [2] లాంటి పత్రికలూ, కె. సి. నారాయణ నంప్యార్ [3] లాంటి కవులూ హృదయ

1. దేశానికి వీరోచితమైన సేవ చేసినవారిని గౌరవిస్తూ మహారాజు సాధారణంగా ఇచ్చే బంగారు కంకణం - 'వీర శృంఖల.'
2. 1890లో కోట్టయమ్‌లో కంటత్తిల్ వరుగీస్ మాప్పిల స్థాపించిన ఒక ప్రముఖ మలయాళ దిన పత్రిక.
3. ఒక హాస్య కవి (1873-1922)

పూర్వకంగా హర్షించారు. ఆయన వైదుష్యాన్నీ, వక్తృత్వ ప్రతిభనీ అభినందిస్తూ కేరళవర్మ వలియ కోయిల్ తంపురాన్ కెంపులు పొదిగిన బంగారపు ఉంగరం ఆయనకి బహూకరించారు. కేరళ బ్రాహ్మణుల సాంఘిక ప్రగతికోసం కృషి చేసే 'యోగక్షేమ మహాసభ' కూడా 'కేరళ తిలకం' అనే బిరుదు చెక్కిన స్వర్ణ పతకాన్ని ఆయనకి బహూకరించింది. 1918 లో కొచ్చిన్ మహారాజా 'కవి తిలకన్' అనే బిరుద ప్రదానంతో ఘనంగా ఆయన్ని గౌరవించారు. 1932 నూతన సంవత్సర బిరుదావళిలో ఆయనకి 'రావు సాహెబ్' బిరుద వితరణ జరిగింది. తరువాత కొద్ది కాలానికే భారత వైస్రాయి చేతులమీదుగా 'రజతోత్సవ పతకం' (Silver Jubilee Medal) కూడా ఆయన అందుకున్నారు

1937 లో - అప్పటికి ఆయన కావ్యాలకు సార్వజనీన మైన ప్రశంసలు లభించడంతో ఆయన షష్ట్యబ్దపూర్తి సందర్భంలో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఒక దర్బారులో తిరువాన్కూరు మహారాజా చేత సర్వ విధాలా ఆయనకి సమర్థ మైన 'మహా కవి' బిరుద ప్రదానం జరిగింది. తర్వాత రెండేళ్ళకు కాశీలోని విద్యాపీఠంనుంచి 'సాహిత్య భూషణ' అనే మరొక ప్రముఖ బిరుదం ఆయనకి లభించింది. షష్ట్యబ్దపూర్తి ఉత్సవాల సందర్భంలో కోళ్లికోడ్ నుంచి తిరువనంతపురం దాకా అన్ని వర్గాల ప్రజలూ బహుముఖ ప్రజ్ఞా ధురీణు డైన ఆయన మీద హృదయ పూర్వకమైన అభినందన పరంపరలు కురిపించారు మహారాజులూ, విద్వాంసులూ చేసిన ఘన సత్కారాల కన్న ఎక్కువగా ప్రజా సామాన్యం నుంచి లభించిన ఈ ఆదరణ ఆయన హృదయాన్ని కదిలిచింది.

సమర్థమైన ఈ సత్కార పరంపర మధ్య ఆయన కుటుంబ సభ్యుల్లో ఒక్కొక్కరినే క్రమంగా మృత్యువు కబళింప సాగింది. కఠోరమైన విధి వైపరీత్యా లెన్నిటినో ఎదుర్కోవడంలో బలమైన అగడ్తగా తన ప్రక్కను నిలిచిన ముత్తవ తల్లి ఆయన్ని దుఃఖ సాగరంలో ముంచి 1911లో ఇహలోక యాత్ర చాలించింది. తన ద్వితీయ కళత్రం మరణానంతరం తన ఏకైక సోదరుడు కృష్ణయ్యర్ నడి యౌవనంలో కాలం చెయ్యడంతో ఆయన జీవితంలో మరొక తీరని లోటు ఏర్పడింది. సువిశ్రుతు డైన అన్నగారితో సమంగా ఉన్నత విద్య అభ్యసించి ఉద్యోగ రంగంలోనూ, సాహిత్య రంగంలోనూ [1] కూడా అతడు

---

1. పరమేశ్వర అయ్యర్ తొలి రచనల్లో ఒకటి అయిన 'మంగళ మంజరి' కి ఈ కృష్ణయ్యరే లఘు వ్యాఖ్య వ్రాశారు

అన్నగారి అడుగు జాడల్లో నడుస్తూ వచ్చారు. చనిపోయే నాటికి అతడు ఆక్టింగ్ తహసిల్దారు. తనకు ఎంతో అండగా ఉంటూ వచ్చిన ఆ తమ్ముడి వియోగం పరమేశ్వరయ్యర్‌కి దుర్భరం అయింది. "నా కుడిచేయి విరిగిపోయింది" అన్నారు ఆయన.

ఈ విపత్ పరంపరలో ఓర్పుకి మారుపేరు అయిన ఆయన తల్లి తన అమర ప్రేమతో ఆయన్ని ఆచ్ఛాదిస్తూ సంరక్షక దేవత లాగ, 'భగవతి' లాగ ఆయన్ని కాపాడుకుంటూ వచ్చింది. తన కొడుకు వ్యక్తిగతం గానూ, ఉద్యోగ రీత్యానూ కూడా సర్వోచ్చ శిఖరాలు అందుకోడం కళ్ళారా చూసుకునే అదృష్టానికి ఆమె నోచుకుంది. పూర్ణ జీవితం గడపి, తన 82 వ ఏట, కుమారుడు పదవీ విరమణ చేసిన ఆరేళ్ళకి, ఆయన పరమపదించడానికి 11 ఏళ్ళు ముందుగా 1938 లో ఆ తల్లి స్వర్గస్థురాలైంది.

**55** ఏళ్ళు పూర్తి కాగానే **1932** లో ఆయన పదవీ విరమణ చేశారు. పదవీ విరమణకి ముందు తిరువనంతపురం దివాన్ — పేష్కార్ గానూ, (ఆక్టింగ్) ప్రధాన కార్యదర్శి గానూ, (ఆక్టింగ్) లాండ్ రెవెన్యూ కమీషనరు గానూ పని చేశారు. ఒకప్పుడు ప్రభుత్వంలో ఆఫీసర్లందరిలోనూ ఆయన సీనియర్. అయినా, సర్వోన్నతా లయిన 'దివాన్', 'ప్రధాన కార్యదర్శి' పదవుల్ని భర్తీ చేసే సందర్భంలో - ఎలా జరిగిందో గాని - ఆయన సీనియారిటీని అలక్ష్యం చేయడం జరిగింది.

చాలామంది అందుకు నిరసన తెలిపారు. కాని, మహాకవి మాత్రం పెదవి విప్పలేదు. బహుశః పదవీ విరమణ తన కొక విధంగా విమోచనంలాంటి దనీ, అంతవరకూ ఉద్యోగ యంత్రాంగ చక్రాల మధ్య నలుగుతూ సాహిత్య, విద్యా రంగాల్లో తను సాధించలేక పోయిన ఘనతర విజయాలు సాధించే అవకాశం అందువల్ల లభించగల దనీ ఆయన భావించి ఉండవచ్చు!

# 4. సాంఘిక, సంక్షేమ కార్యకలాపాలు

ఇంతవరకూ - సమర్థు డైన కార్య నిర్వాహకుడుగాను, ప్రతిభాశాలి అయిన పండితుడుగానూ మాత్రమే పరమేశ్వరయ్యర్ మూర్తి ప్రదర్శించ బడింది. అయితే ఇది కేవలం ఆ వ్యక్తి యొక్క బాహిర రూపం మాత్రమే! వర్ణ రంజితంగానూ, వాస్తవంగానూ, సమగ్రంగానూ ఆ మూర్తిని తీర్చి దిద్దాలంటే మరి కొన్ని అంశాలు అవసరం. సాంఘిక, సాహిత్య రంగాల్లోని గణనీయమైన ఆయన కార్య కలాపాలు ఈ అంశాలను మనకు సమకూర్చ గలవు. వీటిలో ఆయన సాహిత్య వ్యాసంగం మరింత విస్తృతమూ, విఖ్యాతమూ కావడంతో చాలా మంది ఆయన జీవిత సర్వస్వం సాహిత్య వ్యాసంగంతోనే గడించిం దని భావించడం కద్దు. సాంఘిక, సాంస్కృతిక, జాతీయ సమస్యల్లో ఆయన నిమగ్నతని ఆయన అభి మానులూ, జీవిత చరిత్ర కారులూ కూడా తగినంతగా పట్టించుకున్నట్టు కనపడదు. పైకి స్థూల విషయాలుగా కనిపించే ఈ అంశాలు పండితుడుగానూ, కవిగానూ ఆయన సాధించిన ఔన్నత్యం ముందు బహుశః మరుగున పడి ఉండవచ్చును. కాని, ఆయన జీవితం తాలూకు అలక్ష్యం చేయబడిన ఈ ముఖాన్ని పరిశీలించడం వల్ల నిజానికి ఆయన సాహిత్య జీవితంమీద మరింత ఎక్కువగా వెలుగు ప్రసరించ గలదు. అన్ని అంశాలూ యథాస్థానంలో అమరి నప్పుడే సర్వ సమగ్రమైన, అపూర్వ మనోహరమైన సమష్టి మూర్తి మనకు సాక్షాత్కరించ గలదు.

పరమేశ్వరయ్యర్ కవిత్వం లాగే ఆయన పరార్థ చింతన కూడా అజన్మ సిద్ధం; తెచ్చిపెట్టుకొన్నది కాదు. ఇంతకుముందు మనం గమనించి ఉన్నట్టు - పరమేశ్వరన్ తండ్రి దళిత వర్గాలవారి ఉద్ధరణ విషయంలోనూ, సాంఘిక దురన్యాయాల నిర్మూలన విషయంలోనూ ఉదార భావాలు కలవారు. మానవ సేవ ఆయనకి స్వభావ సిద్ధం. అందువల్లే - తర తరాలుగా అగ్రవర్ణులైన బ్రాహ్మణుల్ని బంధించిన సనాతన బంధనాల్ని ఆయన పటాపంచలు చేసి ఉపాధ్యాయుడుగానూ, స్కూళ్ల ఇన్‌స్పెక్టరుగానూ తన ఉద్యోగ సంబంధమైన సంకుచిత పరిధుల్ని అధిగమించి, సంఘం అంతటినీ సేవించడంలో తృప్తిని అన్వేషించారు. చంగనాచేరి లో స్థానిక ప్రజల మద్యపాన దురాచారాన్ని మాన్పించడానికి ఆయన చేసిన కృషి తీవ్రంగా ఆయన్ని ఆవహించిన సంస్కరణా

వేశానికి తార్కాణం! దేశంలో అలాంటి ఉద్యమాలు ఇంచుమించు ఎక్కడా తల యెత్తి ఉండని ఆ రోజుల్లో 'మితపాన సంఘాలు' ఆయన ఏర్పాటు చేసి, 'అతి సర్వత్ర వర్జయేత్' అనే సందేశాన్ని ప్రచారం చేశారు. మద్యపాన దురాచారంలో కంఠ దఘ్నంగా నిమగ్నమై ఉన్న ఒక సంఘానికి 'మితపాన' హిత బోధ చేయబూనడం ఎక్కడైనా ఎప్పుడైనా ప్రమాద భూయిష్ఠ మైన పనే! 19 వ శతాబ్దంలో మధ్యతిరువాన్కూరు రాష్ట్రంలోని సిరియన్ కేతలిక్ సమాజంలో అలాంటి ప్రచారం చెయ్యడం మరింతగా ప్రమాద భరితమై ఉండాలి. మహాత్మా గాంధి గాని, ఆయన మద్య నిషేధోద్యమం గాని రావడానికి చాలా కాలం క్రితమే ఒక సాధారణోపాధ్యాయుడు మత బోధకుని పాత్ర వహించి మితపాన బోధకు పూనుకోడం ఆశ్చర్యకరం! ఆయన ఉదాత్త దృష్టి సమకాలీన పరిధుల నధిగమించి భవిష్యత్తులోకి చూడగలిగింది. జీవితంలో అంత తక్కువ స్థాయి ఉద్యోగికి అది అనుచిత మైంది. మద్యపాన దురాచారానికి, విద్యా గంధ రాహిత్యానికి మధ్య సంబంధం ఉందని ఆయన సరిగ్గా గుర్తించారు. ప్రజల్ని విజ్ఞతా స్వర్గం వైపు నడిపించడానికి గట్టిగా కృషి చేశారు. ఎంత నిరుత్సాహ కరమైన పరిస్థితులు ఎదురైనా, తన మొండి పట్టుదల వల్ల తను చేపట్టిన ఉద్యమాల్లో ఆయన విఫలుడు కాలేదు.

పరోపకారం, నిజాయితీతో నీతి తప్పకుండా జీవించడం ఉళ్ళూర్ కుటుంబంలో కనిపించే ప్రధాన సుగుణాలు. వ్యక్తిగత జీవితంలో ఉదాత్త నైతిక ప్రమాణాలు పాటించడం వల్లనే సుబ్రహ్మణ్యయ్యర్ న్యాయవాదిగా ప్రాక్టీసు పెట్టడం మానుకున్నారు. ఏమంటే - ఆయన తాతగారు చెప్పినట్టు సత్యాన్ని తారుమారు చేయవలసి వచ్చే వృత్తి చేపట్టడం ఆ కుటుంబ నైతిక సూత్రాలకు విరుద్ధం!

అలాంటి వంశవృక్షపు రెమ్మ అయిన పరమేశ్వరన్ తన నిజాయితీనీ, సోత్సాహ ప్రకృతినీ, దయార్ద్ర స్వభావాన్నీ తన పరిచితు లందరూ ప్రశంసిస్తూ ఉండగా సుదీర్ఘమైన తన ఉద్యోగ జీవితాన్ని ముగించ గలగడం ఎంతయినా సముచితమే! ఉన్నతోద్యోగ దర్పంతో మూర్ఖంగా గాని, కపటంగా గాని ప్రవర్తించకుండా కుటుంబ సంప్రదాయం ఆయన్ని కాపాడింది. కేరళవర్మ అనేక ప్రశంసా పత్రాలనుంచి ఉదాహరించి, చివరికి స్వయంగా ఆయన ఇలా అంటారు : "చేసిన ప్రతి ఉద్యోగంలోనూ జనం ఆయన్ని కృతజ్ఞతతోనూ, అను

రాగంతోనూ తలుచుకుంటూ ఉండడం నే నెరుగుదును."[1] ఇచ్చకాలూ, ముఖ ప్రీతి మాటలూ అలవాటు లేని మరొక సమకాలిక రచయిత ఆయన్ని ఇలా ప్రశంసిస్తున్నారు : "ఏ పదవిలో ఎక్కడ ఆయన పని చేసినా అన్ని వర్గాల ప్రజల అనురాగమూ ఆయన చూరగొన్నారు .. ఆయన కవితాత్మ ప్రజల అగ చాట్లను సులభంగా గ్రహించ గలిగేది. గ్రహించడం తడవుగా వెంటనే దానికి నివారణోపాయం ఆయన చూసేవారు. పర్యవసానంగా అందరికీ ఆయన ఆరాధ్య దైవం అయారు."[2]

ఆయన ఉద్యోగ జీవితానికి సంబంధించిన ఈ ఉదాత్త ముఖాన్ని ఆయన జీవిత చరిత్ర రచయితలు నిర్లక్ష్యం చేయడం శోచనీయం! అత్యధిక ప్రాధాన్యం వహించవలసి ఉన్న అంశాల్ని అతి తేలికగా తేల్చి వేసినయి - ఆయన జీవిత చరిత్రలు ఉద్యోగ రీత్యా ఆయన ఎక్కడికి వెళ్ళినా ఆయనకంటె ముందుగానే నీడలాగ ఆయన మంచి పేరు పురోగమిస్తూ ఉండే దని వాడుక. కున్నత్తూర్, కల్‌కుళమ్, వైక్కమ్, పత్తనాపురం, విళవంగోట్,తిరువనంతపురం, మావేలిక్కర, చిఱయిన్‌కీഴ് లాంటి తాలూకాల్లో ఆయన తహసిల్దారుగా పని చేశారు. ఎక్కడా ఆయన తన పదవి ఔన్నత్యంతో, విద్వాంసులికి సహజమైన నిర్లిప్తతతో తన ఒంటి స్తంభపు మేడలో తాను ముడుచుకు పోయి కూచోలేదు. అన్ని స్థలాల్లోనూ ప్రజా సంక్షేమాన్ని పెంపొందించే కార్యక్రమాల్లో ఆయన పాల్గొన్నారు. సంఘంలో అధోగతిలో ఉన్న వర్గాలవారి పరిస్థితి మెరుగు పరచడం కోసం ఉపయోగ కర మైన పను లెన్నో ఆయన చేశారు. కున్నత్తూర్ నుంచి ఆయనకి బదిలీ అయి నప్పుడు పౌరులు ఆయన కర్పించిన పద్యరూప మైన వీడ్కోలు పత్రంలో దయా మూర్తి అయిన ఆఫీసరు వెళ్ళిపోతున్నందుకు తమ గాఢమైన విచారాన్ని వ్యక్తం చేశారు. తిరువనంతపురంలో 'దివాన్-పేష్కార్' అయినప్పుడు కూడా ఈ గుణాలు ఆయన్ని విడనాడక పోవడం గణనీయ మైన సంగతి. ఆయన పని చేసిన స్థలా లన్నిట్లో ఈ నాటికీ 'యోగ్యుడైన ఆ దివాన్-పేష్కార్' స్మృతులు నిలిచి ఉన్నట్లు ప్రసిద్ధి! ప్రజల్ని పీడించేందుకు సాధనంగా తన అధికారాన్ని ఎన్నడూ ఆయన వినియోగించి ఎరుగడు. అందరికీ అందు బాటులో ఉండడం, ప్రజాసేవ

1. 'ఉమా కేరళం' కావ్యానికి వ్రాసిన ఇంగ్లీషు ఉపోద్ఘాతం.
2. ఓ. ఎమ్. తామస్, ఎం. ఏ., ఎల్. ఎల్ బి, "Under the Knife" పుట 128. ద్వితీయ ముద్రణ, కోట్టయం, 1927.

పట్ల ఉత్సుకత - ఇవి ప్రభుత్వోద్యోగికి ఉండవలసిన ప్రధాన లక్షణాలు అని ఆయన నమ్మకం!

ఇంతకు ముందు మనం గమనించి ఉన్నట్టు - తర తరాలుగా పూర్వీకుల నుంచి వారసత్వంగా సంక్రమించిన నిస్స్వార్థమైన సేవ పట్ల గల విశ్వాసమే ఆయన లోని నైతిక ప్రవర్తనకి ప్రాతిపదిక అని సులువుగానే మనం గ్రహించవచ్చు. ఈ దయా గుణం బాల్యంలో తను అనుభవించిన దారిద్ర్యం వల్ల మరింత పదును తేరి, కాల క్రమేణ ఆయనలో వ్యక్తిగత మైన ఒక మతంగా రూపొందింది. కడుపు నిండా తిండి కూడా దుర్లభ మైన భోగంగా అనిపించిన, తలుచుకుంటే ఒళ్లు జలదరింపజేసే ఆ రోజుల్ని ఆయన ఎన్నడూ మరిచిపోలేదు. రెండు జాముల వేళ ఇంటికి అభ్యాగతుడుగా వచ్చిన వ్యక్తికి-అతని కులంతో గాని, వృత్తితో గాని, హోదాతో గాని సంబంధం లేకుండా - స్విష్టకృత్తుగా భోజనం పెట్టడం మహాకవికి ఎంత సంతృప్తి కలిగించేదో ఆయన కుమారుడు కి. శే. మహాదేవన్ తన 'గత స్మృతులు' లో వివరించారు. ఉద్యోగ రీత్యా టూర్ వెళ్ళినప్పుడు తన క్రింది ఉద్యోగులతో కలసి భోజనం చెయ్యడం ఆయనకి అలవాటు.

ఉద్యోగ కాలంలో ఆయన పాటించిన సర్వమానవ సమానతా సూత్రం పదవీ విరమణ అనంతరం సంఘసేవా కలాపాల్లో తలమున్కలుగా ఆయన నిమగ్నులు కావడానికి దారి తీసింది, అధికార పదవులు త్యజించే రోజు రాగానే ప్రజా సేవా ప్రవాహంలో లీనం కావడం ఆయనకి మరింత తేలిక అయింది. పైకి అసందర్భంగా కనిపించినా పదవీ విరమణ మానవ సేవ ద్వారా ఆయన జీవితాన్ని మరింత సంపన్నం గానూ, సంపూర్ణంగానూ మలచడానికి దోహదం చేసింది, తామరాకు మీది చిన్ని నీటిబొట్టు జారి అఖండ జలరాశిలో కలిసి పోయినట్టు ఉద్యోగ జీవితం ముగియ గానే ఉళ్లూర్ పూర్తిగా సంఘ సేవకి అంకితమై, తన జీవితానికి పరిపూర్ణత సాధించారు.

పదవి విరమించిన కొద్ది కాలానికే-రిటైరైన దివాన్ వి. యన్. సుబ్రహ్మణ్యయ్యర్ అధ్యక్షత క్రింద 1932 నవంబరు 8 వ తేదీన స్థాపించబడిన తిరువాన్కూరు హరిజన దేవాలయ ప్రవేశ సంఘంలో ఒక సభ్యుడుగా ఆయన చేసిన అమూల్యమైన సేవ ఆయన సేవా కార్యకలాపాలు ఎంతగా విస్తరించిందీ విశదం చేస్తూంది. దివాణం తరఫునా, దివాన్ తరఫునా 'నిపుణ-సభ్యుడు' (Expert Member) గా ఆయన్ని నియమించారు. అందరూ అనుకున్నట్టే ఆ నివేదికకి రూపం కల్పించిన

ప్రధాన శిల్పి ఆయనే అయారు. 1934 జనవరి 11వ తేదీన ప్రభుత్వానికి సమర్పించబడిన ఆ నివేదికలో కనిపించే సంస్కరణ దృష్టి ఆయనదే! వెనక బడిన వరాలపట్ల సహజంగా ఆయనకి గల సానుభూతి ఆ నివేదికలో పూర్తిగా ప్రతిఫలిస్తూంది హిందూ సంఘంలోని పీడిత వర్గాల తరఫున దానిలో ఆయన తీవ్రంగా వాదించారు. వెనక బడిన వర్గాలవారికి దేవాలయ ప్రవేశం నిరోధించడం కోసం బలాలు ఆయత్తం చేసుకున్న సనాతన వర్గాలూ, ప్రతీప శక్తులూ చిత్తుగా ఓడిపోయినయి. హరిజనులకూ, ఇతర అవర్ణులకూ హిందూ దేవాలయాల తలుపులు తెరిపించడం కోసం ఆరంభమైన మహా సంగ్రామంలో అది తొలి ఘట్టం మాత్రమే! దానిలో మహాకవి నిర్వహించిన ప్రముఖ పాత్రని విస్పష్టంగా నిరూపిస్తున్న ఆ నివేదిక తిరువాన్కూరు హరిజన సేవాసంఘు కార్యదర్శి ప్రశంస లందుకుంది. గాంధీ మహాత్ముడు కూడా ఆ సందర్భంలో ఆయన పాత్రని అభినందించారు.[1]

ఆ నివేదికకి అనుబంధంగా ఉళ్లూర్ ప్రత్యేకంగా ఒక నోట్ చేర్చారు. దానిలో ఆయన సంస్కరణోత్సాహం వెల్లివిరుస్తూంది. ఆయన భావాలు కొన్ని నిజంగా విప్లవాత్మక మైనవి. ఆ రిపోర్టులోని దిగువ ఉదాహరించిన భాగాలలో వర్ణ వ్యవస్థని గురించి నిర్మొహమాటంగా, నిర్భయంగా ఆయన చేసిన వ్యాఖ్యలు కొన్ని మనం గమనించవచ్చును:

"మన పవిత్ర గ్రంథాల ప్రకారం కూడా అది (వర్ణ వ్యవస్థ) భగవత్ కల్పితం గాని, కాలానుగుణంగా మార్చుకోడానికి, సర్దుబాట్లు చేసుకోడానికి వీలు లేనిది గాని కాదని నాకు తోస్తూంది." (పుట 304)

"ప్రతి శ్రుతిలోని విషయాన్నీ అది వ్రాయబడిన కాలం నాటి పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని వ్యాఖ్యానించాలి. అప్పుడే ఆ యా మంత్రాల సరియైన

1. 'తిరువాన్కూరు పురాణం' వ్రాసే సందర్భంలో తిరువాన్కూరు దేవాలయాలకు సంబంధించిన వివరాలు తెలియ జేసి మహాదేవ దేశాయ్‌కి ఉళ్లూర్ చేసిన సహాయానికి గ్రంథకర్త పీఠికలో ఇలా కృతజ్ఞత తెలియ జేశారు: "దేవాలయాలకు సంబంధించిన వివరాలు చాలా వరకూ నాగమయ్యగారి అమూల్యమైన 'తిరువాన్కూర్ మాన్యువల్' నుంచీ, పురావస్తు శాఖవారు తయారు చేయగా, రావుసాహెబ్ మహాకవి ఉళ్లూర్ పరమేశ్వరయ్యర్ పరి చూసిన సమాచార పత్రం (note) నుంచీ గ్రహించబడినయి."

విలువ మనకు అవగతం అవుతుంది. దేశ కాలానుగుణంగా ఆచారాలు మారుతూ ఉండకపోతే అన్ని స్మృతులు వెలయవలసిన అవసరం ఉండేది కాదు.''
(పుట 327)

''నిర్గుణ పరబ్రహ్మోపాసకులకు తప్ప దేవాలయాలు అన్ని వర్గాల ప్రజలకి, సవర్ణులికి, అవర్ణులకి కూడా అవసరమే!'' (పుట 330)

''శ్రుతి ననుసరించి ప్రతి జీవుడూ భగవత్తత్త్వం నుంచి వెలువడిన ఒక స్ఫులింగమే! తిరిగి ఆ పరతత్త్వాన్ని చేరుకునేదే!'' (పుట 333)

అంధ విశ్వాసం తాలూకు దుర్గాల్లో తీవ్ర సంచలనం కనిపించింది. అగ్ర వర్ణాల్లోని సనాతను లందరూ ఆగ్రహోయత్తులై బలాలు సన్నద్ధం చేసుకుని యుద్ధానికి తయా రయారు. హరిజన దేవాలయ ప్రవేశానుమతి ప్రకటనను వాయిదా వెయ్యాలని కోరుతూ వారు మహారాజా వద్దకు రాయబారం వెళ్ళారు. ఉజ్జ్వల పద బంధాలతో అంధశక్తుల్ని నిరసిస్తూ, తిరువాన్కూరు హరిజన దేవాలయ ప్రవేశానుమతి ప్రకటనని అభినందిస్తూ 'చైత్ర ప్రభవమ్' (1938లో ప్రచురితం) అనే తన కావ్యంలో మహాకవి ఇలా అంటారు :

''ఎపుడు స్వార్థమ్ము మరవని కపట మతులు
ఎటులొ తమ రోజు గడుపుకో నెంచువారు
అంతరాత్మ దర్శిత మార్గ మనుసరింప
వెరచువారు, గతము గాంచి బెదరువారు
నిరత నిద్రాలసులు, స్థిత పరత రతులు
నత్తను విమాన వేగిగా నమ్మువారు!''

హోరాహోరీగా పోరాటం సాగింది. ఎదిరి పక్షాని కొక్క పిసరైనా లొంగ కూడ దని ఏ పక్షాని కా పక్షమే పట్టుదల వహించింది. మహారాజా శ్రీ చిత్ర తిరునాళ్ బాలరామవర్మ (1931-1948), దివాన్ శ్రీ సి. పి. రామస్వామి అయ్యర్ హరిజన దేవాలయ ప్రవేశ వ్యతిరేకోద్యమ కార్యకర్తలతో చర్చలు జరపడానికి రావలసిం దని మహాకవిని ఆహ్వానించారు. అది ఒక మరపురాని వాగ్యుద్ధం. చర్చలకు వెళ్ళే రోజు ఉదయం తన అభిప్రాయాల విషయంలో ఆయన మహా ధైర్యంగా ఉన్నా రనీ, చర్చల్లో తమ వాదాన్ని సమర్థించుకునే యుక్తులకోసం మత గ్రంథాలను సంప్రదించను కూడా సంప్రదించ లేదనీ ఆయన కుమారుడు వ్రాశాడు ఎదిరి పక్షంలో సంప్రదాయ వాదుల్లో కొమ్ములు తిరిగిన

హేమాహేమీ లున్నారు అయినా వాదంలో వారిని చిత్తు చేసి, వారి యుక్తుల్లోని అసంబద్ధతని ఎత్తి చూపించడం ఆయన కేమంత కష్టం అనిపించ లేదు సనాతన పక్షం దాసోఒమంది. 1936 లో చరిత్రాత్మక మైన హరిజన దేవాలయ ప్రవేశానుమతి ప్రకటన వెలువడింది. తన 'చైత్ర ప్రభనమ్' లో ఆ ప్రకటనని ఆయన ఒక 'నూతన ఈశావాస్యోపనిషత్తు' అని అభివర్ణించారు. ఒక విధంగా ఆయన జీవిత ధ్యేయం సిద్ధించిన ట్లయింది.

మొదటి సారిగా హరిజనులు శ్రీ పద్మనాభస్వామి ఆలయం ప్రవేశం చేసిన రోజు తిరువాన్కూరు చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయదగిన రోజు. ఆ రోజున తన సన్నిహిత మిత్రుడూ, అంతర్జాతీయ విఖ్యాతి గల కవీ, పండితుడూ అయిన డా॥ జేమ్స్ కజిన్స్ సరసను నడుస్తూ ఉండగా హరిజన బృందం వెంట దేవాలయానికి నడచి వెళుతున్నప్పుడు మహాకవి హృదయ చషకం సంతోషంతో పొంగి పొరలింది!

వర్షం వెలిసిన తరువాత కూడా కొంతసేపు చెట్ల మీదనుంచి పెద్ద పెద్ద చుక్కలు రాలుతూ ఉంటయి గద! చిత్తుగా ఓడిపోయినప్పటికీ, తిరువనంతపురంలోని ప్రతీప శక్తులు ఆ కక్ష మనస్సులో పెట్టుకుని మహాకవి మీద ఎదురు దెబ్బ తీయడానికి ప్రయత్నించినయి పూర్తిగా అసంతృప్తి పొంది ఉన్న బ్రాహ్మణ సంఘం వారు ఒక మహా సభ జరిపి దానిలో ఉళ్ళూర్ ఎస్. పరమేశ్వరయ్యర్‌ని సంఘంనుంచి వెలివేస్తూ తీర్మానించారు. తన సంఘ బహిష్కార వార్త వినగానే మహా కవి నవ్వుతూ అన్న మాట: ''నిన్నటిదాకా నేను బ్రాహ్మణుణ్ణి. ఇవాళిటి నుంచీ నేను మానవుణ్ణి!'

సంఘ బహిష్కారపు అవమానం ఆయన్ని ఏ మాత్రం చికాకు పరచ లేక పోగా, పైపెచ్చు తాను ఎంచుకున్న మార్గంలో ముందుకు సాగడానికి మరింత ప్రోత్సహించింది. తన చిన్ననాటి సహాధ్యాయీ, యావజ్జీవ మిత్రుడూ వి. ఎస్. సుబ్రహ్మణ్యయ్యర్ అధ్యక్షులుగా ఉన్న కేరళ హిందూ మిషన్‌లో సాంఘిక పునరుజ్జీవనాన్ని గూర్చిన ఆయన అభిప్రాయాలు స్ఫుట రూపం దాల్చినయి. ఆ మిషన్‌కి ఉళ్ళూర్ ఉపాధ్యక్షులు. మహాకవి కాపురం ఉంటున్న 'జగతి' ప్రాంతంలోని హరిజనుల నిత్య జీవన పరిస్థితులు మెరుగు పరచే సంక్షేమ కార్యక్రమాలు అమలు జరపడం ఆ సంస్థ ప్రధాన లక్ష్యం. ఆయన కుమారుడు మహాదేవన్ ఆ సంస్థలో మొదటి గౌరవ సంచాలకుడు. తన విశ్రాంత జీవితంలో ఉళ్ళూర్‌కి ఈ

సేవాకార్యక్రమం చాలా ఆనందాన్ని కలిగించింది. ఆ పరిసరాల్లోని హరిజనులు ఇళ్ళలో ఏ పండుగ వచ్చినా వెళ్ళి స్వయంగా దానిలో పాల్గొనడం ఆయనకి అలవాటు.

పరోపకార ప్రవణ మైన తన ప్రకృతిని సంతృప్తి పరచే అలాంటి ఎన్నో సంస్థలతో ఆయనకు సన్నిహిత సంబంధం ఉండేది. అలాంటి సంస్థలు కొన్ని: తిరువాన్కూర్ మానవతా వాద సమాజం, విడుదలైన ఖైదీల పునరావాస సంఘం, అనంత దివ్య జ్ఞాన సమాజం. వీటికి ఆయన ఉపాధ్యక్షులు. తిరువనంత పురం పబ్లిక్ లైబ్రరీ వంటి ఎన్నో సంస్థల్లో ఆయన సభ్యులు. ఆ లైబ్రరీని ఆయనే కన్నబిడ్డ లాగ సాకారు; దాని అభివృద్ధి కోసం ఏ ఒక్క విడి సభ్యుని కంటె ఆయన చేసిన కృషి ఎక్కువ.

నిస్స్వార్థమైన సేవ పట్ల ఆయనకు గల శ్రద్ధ కేవలం దైహికమూ, బౌద్ధి కమూ అయిన బాహ్య వేషం కాదు. ఆయన ఉద్యోగ జీవన కేంద్రానికి సంబం ధించింది అది. ఆయన కవిత్వంలో కనిపించే విశ్వమానవ సౌభ్రాత్రం, విశ్వ మానవ ప్రేమ ఏదో ఒక ఫాషన్‌గా ఆయన కావా లని ఆరోపించుకున్నవి కావు. ఆయన ప్రగాఢ మైన అభిలాషనీ, దృఢమైన విశ్వాసాన్నీ అవి వ్యక్తం చేస్తున్నాయి. కఠిను లైన హిందూ సనాతన వాదులతో హోరాహోరీగా పోరాడడానికి అవసర మైన ధైర్యం చేకూర్చింది ఆయన లోని ఈ 'వసుధైక కుటుంబ' భావనే!

తన ఆత్మకు తృప్తి కలిగించ గల మతం కోసం నిర్విరామంగా అన్వేషణ చేసిన మీదట 'థియోసఫీ' అలాంటి దని ఆయన గుర్తించారు. యువకుడుగా ఉండగానే ఆయన తీవ్రమైన థియోసఫిస్ట్ అయాడు. జీవితాంతం ఆ విశ్వాసం చెక్కు చెదరకుండా నిలిచి ఉంది. భారతీయ ప్రాచీన సంప్రదాయం అమూల్య మైం దని భావిస్తూనే దాని క్షీణ దశ ఒక దారుణ శాపం అని భావించే ఆ మహా కవి సంకీర్ణ వ్యక్తిత్వానికి అనుగుణంగా ఆధునిక మానవుడికి అంగీకార్యంగా ఉండే రీతిగా మత, తత్త్వ, విజ్ఞాన శాస్త్రాలకు చక్కని సమన్వయాన్ని థియోసఫీ సాధిం చింది. విశ్వ జనీన మైన ఆధ్యాత్మిక లక్ష్యాల నిధానంగా ఉన్నంత వరకూ మాత్రమే హిందూ మతాన్ని ఆమోదిస్తూ, అనంతర శతాబ్దాల్లో దాన్ని చుట్టు ముట్టిన సంకు చిత, వికృత కల్పనల్ని థియోసఫీ నిరసిస్తుంది. సి. ఎఫ్. ఆండ్రూస్, అరండేల్, జేమ్స్ కజిన్సులకు ఆయన సన్నిహిత మిత్రులు. ఆనీ బిసెంట్ అంటే ఆయనకు

చాలా గౌరవం![1] అందుచేత ఆయన కావ్యాల్లో వెల్లివిరిసే విశ్వ సౌభ్రాత్రం, సర్వమానవ ప్రేమ ఆయన మీద థియోసఫీ ఉద్యమం ప్రసరింప జేసిన ప్రగాఢ ప్రభావ ఫలితా లనడం సమంజసం.[2]

సాహిత్య పరుడుగా కూడా సాంఘిక సమస్యల్ని పట్టించుకోకుండా 'బహిర్వర్తి' (out sider) గా, ఒంటెత్తుగా ఉండడం ఆయనకి రుచించలేదు. తనని ఒక ఆచార్యుడుగానూ, సంస్కర్తగానూ, తన రచనా వ్యాసంగం మానవ పునరుజ్జీవన పరికరంగానూ ఆయన పరిగణించేవారు. తానొక ఒంటిస్తంభం మేడలో ముడుచుకుని కూర్చోక పోవడమే కాదు: ఆ నాడు మన జాతి నెదుర్కొంటున్న రాజకీయ, సాంఘికాది సమస్యల ప్రగాఢావగాహనని కూడా మహాకవి తన రచనల్లో ప్రకటించారు తాను ఎంచుకున్న కవితా మార్గానికి ఎలాంటి హానీ కలుగకుండా తన ఉపదేశక పాత్రని అద్భుతంగా సమన్వయించ గలగడమే ఆయన కావ్యాలకి స్థాయిత్వాన్ని ఆపాదిస్తూంది.

అందమైన మాటలు కూర్చి అనంతంగా పద్యాలు వ్రాసుకుంటూ పోవడంతో సంతృప్తి పడి ఊరుకునే సాంప్రదాయిక కవి పరిధి కతీతంగా ఆయన చేసిన సేవ మరింత స్ఫుటంగా కనిపించేది - ఇంకోటి ఉంది. దూరదృష్టితో- మలయాళ భాషా, సాహిత్యాల అభివృద్ధికోసం, మలయాళ రచయితల స్థితిగతులు మెరుగు పర్చడం కోసం ఆయన అమలు పరచిన పథకా లెన్నో ఉన్నాయి. ప్రభుత్వ పదవీ నిశ్రేణికలో మీది మెట్లమీద కార్య నిర్వాహకుడుగా అనుభవం ఉన్న ఆయనకి ప్లానింగ్ కొట్టిన పిండి. అందుచేత ఒక సంస్థ పర్యవేక్షణ క్రింద సామూహిక చర్యని ఆయన ప్రతిపాదించడం సహజం! మలయాళ సాహిత్య రంగంలో ఆయన సంఘటన శక్తి మరింతగా పరిణత రూపం దాల్చింది. చిన్న

---

1. 'హృదయ కౌముది' అనే కవితా సంపుటంలోని 'నైరాశ్యత్తిల్ నిన్ను' అనే కవితలోనూ, 'తరంగిణి' సంపుటంలోని 'గానోపహారం' లోనూ ఆయన ఆనీ బెసెంట్‌కి నివాళు లర్పించారు.

2. ఆయన 'ప్రేమ సంగీతం' లోని కొన్ని చరణాలు చూడండి:

"ఒక్కటే మత, మది 'ప్రేమ'; ఉర్వి జీవ
మదియె పున్నమి జాబిల్లి, అమృత వల్లి!"
"పరస్ప రాకృష్టి నర ప్రవృత్తి
అన్యోన్య మౌ ప్రేమయె సద్గుణమ్ము!"

నాటినుంచే, టౌన్ హైస్కూల్ హెడ్‌మాస్టరుగా ఆయన పని చేసే నాటినుంచే ఉళ్ళూర్‌లో నాయకత్వ లక్షణాలు ప్రస్ఫుటం కాసాగినయి. స్కూల్లో సారస్వత సమితిని నడపడంలో ఆయన చూపించిన చాకచక్యం ఆ నాడే విద్యార్థుల ప్రశంస లందుకుంది. బయట టౌన్‌లో సాహిత్య చర్చా గోష్ఠులు, పద్య పఠనం[1] పోటీలు, కవిత్వ రచన పోటీలు,[2] సాహిత్య సాయంత్రాలు వంటి సాముదాయిక కార్యక్రమాలు నిర్వహించే సంస్థల్ని నడపడంలో ఆయన సామర్థ్యం వ్యక్త మయింది. అనంతరం కేరళలోని ప్రధాన సాహిత్య సంస్థ లన్నిటితోనూ ఆయనకి ఘనిష్ఠ సంబంధం ఏర్పడింది. వాటిలో ప్రప్రథమంగా పేర్కొనవలసింది సుమారు రెండు శతాబ్దాల పాటు[3] చురుగ్గా పని చేసిన భాషాపోషిణీసభ. తిరువనంతపురంలో జరిగిన ఆ సభ తాలూకు చతుర్థ వార్షిక సమావేశంలో ఆయన ఆ సభకి కోశాధికారిగా ఎన్నిక అయారు. భవిష్యత్తు వైపు ఆశాభావంతో చూసే 23 ఏళ్ల యువకుడికి నిజంగా అది గుర్తింపే! అయితే - ఆ పదవి వల్ల ఆయనకి కలిగిన గొప్పలాభం- 'కేరళ కాళిదాసు'గా ప్రసిద్ధుడై ఆ నాటి మళయాళ సాహిత్య పీఠాధిపతిగా గౌరవించబడుతున్న కేరళవర్మ వలియ కోయిల్ తంపురాన్‌కి ఆయన చేరువ అయ్యే అవకాశం. వారిద్దరి అనుబంధం యావజ్జీవ సాన్నిహిత్యంగా పరిణమించింది. తానై వరించిన ఆ గురువుగారి పట్ల ఉళ్ళూర్‌కి ప్రగాఢమైన ప్రశంసా భావం, గౌరవం, అనురాగం ఉండేవి. అందుకు ప్రత్యామ్నాయంగా కేరళవర్మ కూడా పరమేశ్వరయ్యర్‌ని అంత ప్రేమగానూ, గౌరవంగానూ చూసేవారు. భాషా పోషిణీ సభ అర్ధాయుష్కంగా అంతరించి పోయిన తరువాత తిరువాన్కూరులో స్థాపితమైన భారతవిలాస సభకికూడా మహాకవి అత్యంత సన్నిహితు లయారు అలాగే - వైక్కమ్ సన్మార్గ పోషిణీ సభకి కూడా ఆయన ప్రోత్సాహం లభించింది. మహాకవి అండ దండలతో వర్ధిల్లిన మరొక సాహిత్య సంస్థ తిరువనంతపురంలోని 'భాషా సాహిత్య మండలమ్'!

---

1. ఇది మలయాళంలో 'అక్షర శ్లోకం' గా ప్రసిద్ధం.

2. ఇది 'కూట్టు కవిత' - నిర్ణీతకాలంలో ఒక విషయానికి సంబంధించిన నానా ముఖాల్ని గురించి సామూహికంగా పద్యరచన చేయవలసి ఉన్న ఈ సాహిత్య వినోదం యువ కవులకు శిక్షణగా ఉపయోగపడుతుంది.

3. 1892-1911 మధ్య కాలంలో.

ఉళ్లూర్ సంఘటన సామర్థ్యాన్ని గురించి చర్చించేటప్పుడు మలయాళ సాహిత్య ప్రణయులకు విధిగా గుర్తు వచ్చే అంశం: 'సమస్త కేరళ సాహిత్య పరిషత్' ('పరిషత్' అనే సంగ్రహ నామంతో ప్రసిద్ధమైంది)[1] తో ఆయన అనుబంధం. కేరళలోని సాహిత్య సంస్థల్లో చిరకాలంగా పని చేస్తున్నదీ, ఎక్కువ ప్రతిష్ఠ గలదీ ఆ పరిషత్తు. మలయాళ సాహిత్యంలో అటు సాంప్రదాయికులూ, ఇటు అభ్యుదయవాదులూ కూడా సమానంగా ఆదరించే చర్చా వేదిక ఆ పరిషత్తు. కొచ్చిన్‌లోని ఎర్నాకులమ్‌లో ప్రధాన కార్యాలయం ఉన్న ఆ పరిషత్తు 1927 లో ఇటప్పళ్ళి లో ప్రారంభించ బడింది. తొలినాటి నుంచీ కూడా ఆ సంస్థకి ఊపిరి ఉళ్లూర్. 1935 నుంచి 1946 దాకా ఏకబిగిని సుమారు 12 ఏళ్ళ పాటు ఆ పరిషత్తుకి ఆయన అధ్యక్షులు. నానాటికి దిగనాసిల్లుతున్న ఆరోగ్యం కారణంగా ఆ అధ్యక్ష పదవిని ఆయన వదులుకున్నారు. 'సాహిత్య పరిషత్ త్రైమాసికమ్' అనే పత్రికకి 1935 నుంచి 1944 దాకా ఆయనే సంపాదకులు. ఆయన సంపాదకత్వంలో మలయాళ భాషా పరిశోధన రంగంలో నాటికి, నేటికి కూడా మరే పత్రికా అందుకోలేని అత్యుచ్చ శిఖరాలను ఆ పత్రిక అందుకుంది. తను సంపాదకుడుగా ఉన్న కాలంలో ఆ పత్రికకి ప్రధాన రచయిత కూడా ఆయనే! పరిషత్తుకి, 'త్రైమాసికమ్' పత్రికకి ఆయన చేసిన సేవ అనల్పమైంది. హృదయ పూర్వకంగా ఆత్మార్పణ బుద్ధితో శారీరక, ఆర్థిక క్లేశాలను కూడా లక్ష్యపెట్టకుండా చేసిన సేవ అది. పరిషత్తు అంటే ఆయనకి గల ప్రగాఢ ప్రేమను ఒక సుప్రసిద్ధ మలయాళ రచయిత ఇలా ఉత్ప్రేక్షించారు: "పరిషత్తు వార్షికోత్సవ స్థలంగా ఎవరెస్టు శిఖరాన్ని నిర్ణయించినా సరే, అందరికంటె ముందుగా ఉళ్లూర్ వెళ్ళి అక్కడ ఉంటారు!" మలయాళ రచయితలకు తమ సామూహిక వ్యక్తిత్వాన్ని ప్రకటించుకోడానికీ, తమ ప్రత్యే కావసరాలు గుర్తించుకోడానికి వీలుగా ఒక ఉత్తమ సాహిత్య వేదిక సమకూర్చడంలో ఆయన సాధించిన అసాధారణ విజయం మలయాళ సాహిత్యంలోని అమర మూర్తుల మందిరంలో ఆయనకు ఒక శాశ్వత స్థానాన్ని సమకూర్చింది.

గణనీయ మైన ఆయన సంఘటన చాతురి మరొక రంగంలో కూడా ఆయన గుర్తింపుకి కారణమైంది. అది - విశ్వ విద్యాలయ నిర్వహణ. మద్రాసు విశ్వ

---

1. ఉళ్లూర్ శత జయంతి ఉత్సవం, పరిషత్తు పంచాశత్ తమ (50 వ) వార్షికోత్సవం 1977లో ఒక సారే కలసి రావడం చిత్రం!

విద్యాలయం వారి 'పార్య ప్రణాళికా' సంఘంతోనూ, ఎం. ఎ. (మలయాళ భాష) పరీక్షక సమితితోనూ, ఇతర అకడమిక్ సంఘాలతోనూ ఉళ్ళూర్‌కి గల సంబంధం ఇంతకు ముందే గమనించాము. తిరువాన్కూరు విశ్వవిద్యాలయం[1] ఏర్పాటు చేసే సందర్భంలోనూ, ఆ విశ్వవిద్యాలయ ప్రారంభ దశలోనూ ఆయన అనుభవం వారికి ఎంతగానో ఉపయోగపడింది. 1937లో తిరువాన్కూరు విశ్వవిద్యాలయ స్థాపన జరిగిన నాటినుంచీ దాని పాలక సంఘాల్లో పలు హోదాల్లో ఆయన పనిచేశారు. 1942 నుంచి 1949 దాకా సెనేట్ సభ్యులుగానూ, ప్రాచ్య విద్యా విభాగానికి 'డీన్' గానూ ఉన్నారు. 1946 నుంచి 1948 దాకా సిండికేటు సభ్యులు కూడా. మలయాళ నిఘంటు నిర్మాణానికీ, మలయాళ విజ్ఞాన సర్వస్వ ప్రకటనికీ ఆయన ప్రతిపాదించిన ప్రణాళికలను చివరికి కేరళ ప్రభుత్వం అంగీకరించింది. పాక్షికంగా కొన్ని సంపుటాలు పూర్తి అయి వెలుగు చూసినయి.

ఇదీ - తేజోవంతమైన ఉళ్ళూర్ వ్యక్తిత్వ వికాస చరిత్ర! నానా ముఖమైన ఆయన ప్రతిభ ఔద్యోగిక కార్య నిర్వహణ, సాంఘిక సేవ, ప్రజా సంస్థల నిర్వహణ, పరిశోధన, పాండిత్యం వంటి వివిధ రంగాల్లో పరివ్యాప్త మైంది, పైకి అన్యోన్యం అసంబద్ధంగా కనిపించే ఈ అంశా లన్నీ అపూర్వంగా సమన్వయం పొంది మహాకవి వ్యక్తిత్వం రూపొందింది. వాల్ట్ విట్మన్‌తో గొంతు కలిపి ఆయన కూడా ఇలా ప్రకటించవచ్చు :

"నేను గొప్పవాణ్ణని నాకు తెలుసు
ఆ గొప్ప రుజువు చేసుకోమని నా ఆత్మని నేను వేధించను
నాలో పరస్పర వైరుధ్యా లున్నా యంటారా ?
మంచిది - ఉంటే ఉండనియ్యండి !
(నేను అపరిమేయుణ్ణి - అపార వైవిధ్యాలు నాలో ఒదిగిపోగలవు.")[2]

---

1. ఒక శాసనం ద్వారా 1957 నుంచీ ఈ విశ్వ విద్యాలయం 'కేరళ విశ్వ విద్యాలయం' అయింది.
2. Song of Myself , 20, 51.

# 5 కవితా ప్రారంభ దశ

కవిలో కవన ప్రతిభ ఆవిష్కృతం అయ్యే ప్రక్రియ ఇప్పటికీ సంవృత మైన రహస్యంగానే భావింపబడుతూంది. అత్యున్నతస్థాయిలో కవి మేధ తాలూకు లక్షణం. పరస్పర విరుద్ధమైన అంశాల వ్యక్తీకరణ. ఉద్వేగాతిశయపు ఉపరితలం నుంచి అది ఉద్భూద్ధం కావచ్చు; లేదా కేవలం బుద్ధి వైశారద్యం లోతులనుంచి ఆవిర్భవించ వచ్చు; లేదా రెండిటి సమ్మేళన రూపంలో అయినా ఆవిష్కృతం కావచ్చు. ఉళ్ళూర్ జన్మతః కవి. బుద్ధి నైశిత్యం, సజీవ భావనా శక్తి, బలమైన ధారణ, సుపరిశీలక మైన ఔత్సుక్యం కలిగి సర్వతో ముఖ మైన చురుకుదనం ప్రదర్శించిన మేధ ఆయనది, దానికి ఫలితంగా - కేవలం కవే కాక, పండితుడూ, పరిశోధకుడూ, విమర్శకుడూ, సంచాలకుడూ - అందరూ అగ్రశేణికి చెందినవారే - ఏకీకృత రూపం దాల్చి, సర్వాంగ సౌష్ఠవ మైన ఆయన అద్భుత వ్యక్తిత్వం ఏర్పడింది. కేరళ రాష్ట్రంలో ఉద్భవించిన బహుముఖ ప్రతిభకి ఆయన ఒక అద్భుత నిదర్శనం!

చాలా చిన్న వయస్సులోనే గణనీయ మైన మేధాశక్తిని ఆయన ప్రదర్శించారు. ఏడేళ్ళకే ఆ బాల మేధావి (Prodigy) మామూలు పాఠ్య ప్రణాళికను మించి చాలా ఎక్కువగా కావ్య, శాస్త్ర గ్రంథాలు అధ్యయనం చేశారు. చంగనాచేరీలో సంస్కృతంలోని మరింత గడ్డు కావ్యాలు చదవడానికి రవివర్మ వద్ద చేసిన శిష్యరికం సంస్కృత సాహిత్యంలో పరాకాష్ఠ అందుకోవా లన్న ఆయన దీక్షని బలపరచింది. పదేళ్ళ వయస్సప్పుడే పద్యాలు ఎంత వేగంగా చదువుతున్నా, ఎక్కడైనా ఛందో భంగం జరిగితే వెంటనే ఆయన గుర్తించేవా రట! పిల్లలు జామకాయలు పుణికి నంత తేలికగా సంస్కృతంలోని అయః పిండాల్లాంటి శ్రీహర్షుని నైషధీయ చరితాన్నీ, మేల్ పుత్తూర్ నారాయణ భట్టతిరి[1] ప్రబంధాల్నీ అవలీలగా ఆయన వ్యాఖ్యానించేవారు. వ్యాఖ్యానించడమే కాదు; అసాధారణ మైన పట్టు

---

1. 16 వ శతాబ్దపు కేరళ దేశపు సంస్కృత పండితుడు, కవి, వైయాకరణుడు. ఆయన వ్రాసిన 'నారాయణీయమ్' అనే శ్రీకృష్ణచరిత్ర ప్రబంధం, 'ప్రక్రియా సర్వస్వమ్' అనే వ్యాకరణ గ్రంథం ప్రసిద్ధాలు.

దలతో వాటిని కంఠపాఠం కూడా చేసేవారు. సహజసిద్ధ మైన ఆయన ధారణా శక్తిని చూసి మహాకవి వల్లత్తోళ్ ఆయన్ని 'జంగమ విజ్ఞాన సర్వసం' అనే వారట! రవివర్మగారి లక్ష్మీపురం దివాణంలోని వాతావరణం ఆయన కవితా తృష్ణకి కూడా ప్రరోచన కలిగించింది. సాహిత్య పోషకు డైన ఆ ప్రభువు కోట తలుపులు కవులకు నిరంతరం తెరుచుకునే ఉండేవి. తరచుగా అక్కడ కవితా గోష్ఠులు జరిగేవి. ఆ నాడు విరివిగా ప్రచారంలో ఉన్న "అక్షరశ్లోకం', 'ఆశు కవిత',[1] కవితా వ్యాఖ్య వంటి సారస్వత వినోద కాలక్షేపా లుండేవి. అలా కవి త్వపు వెల్లువ ఆయన్ని చుట్టు ముట్టడంతో ప్రచలిత కవితా ధోరణుల ననుసరించి పైకి రావడమో, లేదా అధః పాతాళానికి తొక్కివేయబడడమో ఏదో ఒకటి నిర్ణ యించుకో వలసి వచ్చింది. ఆ రోజుల్లోనే ఆయన పద్యాలు వ్రాయడమే కాదు, 'నస్రాణి దీపిక' వంటి పత్రికల్లో ప్రకటించడం కూడా మొదలుపెట్టారు. ఆ పత్రి కాధిపతి ఆయన తండ్రిగారిని రచనలు అర్థించారు. కాని తండ్రి ఆ పనిని తనకు పురమాయించడంతో క్రమం తప్పకుండా ఆ పత్రికకు ఆయన రచనలు పంపుతూ ఉండేవారు. ఇంచుమించు ఆ రోజుల్లోనే 'మళయాళ మనోరమ'[2] పత్రిక వెలు వడడం, ఆ పత్రికకు స్వాగతం చెబుతూ ఉత్సాహ పూరితు డైన ఆ యువకవి ఒక రథ బంధం[3] వ్రాసి దాని ప్రారంభ సంచికకు పంపించడం జరిగింది.

మలయాళ సాహిత్యానికి పుష్టి చేకూర్చా లనే బలమైన ఆకాంక్ష కనుక ఆయనలో ఉండి ఉండక పోతే మలయాళ సాహిత్య రంగానికి ఉళ్ళూర్ దక్కేవారు కారు. తన షష్ట్యబ్ది పూర్తి ఉత్సవ సందర్భంలో తిరువనంతపురంలో జరిగిన అభి నందన సభలో సమ్మానానికి సమాధానం చెబుతూ ఆయన ఇలా అన్నారు: "బాలుడుగా ఉన్నప్పుడే మలయాళ సాహిత్యానికి పుష్టి చేకూర్చా లనే కోరిక, కోరిక కాదు – ఒక విధమైన ఆవేశము, ఆవేశమూ కాదు, ఒక రకమైన పిచ్చి న న్నావహించింది". సంస్కృ తాధ్యయనానికి గాఢంగా అంకితం అయి

---

1. దీనిని మలయాళంలో 'నిమిష కవిత', ద్రుత కవిత' అంటారు.
2. మలయాళ భాషలో వెలువడిన తొలి పత్రికల్లో ఒకటి. 1879 లో కోట్ట యమ్ లోని మణ్ణనమ్ నుంచి వెలువడింది.
3. బంధ కవిత్వానికి ఆ రోజుల్లో ఎంతో గౌరవం! రథం, పద్మం వంటి ఆకా రాల్లో పద్యం ఇమిడ్చి తయారుచేసే ఈ రథ, పద్మ బంధాదులు సాహి త్యంలో చేసే సాము గరిడీలు.

పోయినా, ఆయన మనస్సులో తుఞ్చత్తెఝుత్తచ్చన్, కుఞ్చన్ నంప్యార్‌ల వంటి మలయాళ రచయితల ఉద్ గ్రంథాలు చదివేందుకు కూడా బోలెడు చోటు మిగిలి ఉంది. మలయాళ సాహిత్యాభ్యుదయానికి స్ఫుటమైన దోహదం చెయ్యా లనే ఈ ప్రగాఢ మైన వాంఛే తన అపరిణత రచనలు కూడా మలయాళ పత్రికల్లో ప్రకటిం చేందుకు ప్రోత్సహించింది.

స్కూల్లో చదువుకునే రోజుల్లో అసాధారణ మైన ఆయన చురుకుతనాన్ని వ్యక్తం చేసిన సంఘటన లెన్నో జరిగినయి. నాలుగో తరగతి చదువుతూ ఉండగా ఒక క్లిష్ట మైన మలయాళ పద్యంలో పడిన అచ్చు తప్పు ఆయన టీచర్ దృష్టికి తెచ్చారట. నివ్వెర పోయి ఆ టీచరు తన శిష్యుడు పండితు డనీ, కవి కిశోరం అనీ గుర్తించారు. ఒక మలయాళ పత్రికలో పడిన ఒక క్లిష్ట మైన సమస్యని[1] అందరికీ దిగ్భ్రాంతి కలిగించే విధంగా ఆయన పూరించడంతో కవితా రంగంలో ఆయన కలిగించిన ఆశ మరింతగా బలపడింది. కాలేజిలో ఆయనకు మలయాళం బోధించే ఉపాధ్యాయులు జటిల మైన ప్రబంధ ఘట్టాలకు తాము చేసే వ్యాఖ్యా నాలు పరమేశ్వరన్ విషయంలో అర్థరహితా లని గుర్తించారు. స్కూల్లోనూ, కాలేజీ లోనూ కూడా ఒక వంక తన పాఠాలు శ్రద్ధగా చదువుకుంటూనే, మరో వంక తీరిక వేళల్లో గ్రంథ పఠనంతోనూ, నాటి వివిధ సాహిత్య వినోదాలతోనూ ఆయన గడుపుతూ ఉండేవారు. ఆ యువకుడి తీరని గ్రంథ పఠన తృష్ణని సంతృప్తి పరచేం దుకు ఆయన పట్ల అభిమానం ఉన్న లైబ్రేరియన్ తరచు లైబ్రరీ నిబంధనల్ని ఉల్లంఘించ వలసి వస్తూ ఉండేది. కాలేజి విద్యార్థిగా ఉండగానే తిరువనంతపురం పబ్లిక్ లైబ్రరీలో ఉన్న పుస్తకా లన్నీ ఇంచుమించు ఆయన ఆపోశన పట్టా రని ప్రసిద్ధి! చదివిన పుస్తకాల్లో నుంచి అవసర మైన భాగాలను ఆయన తన నోట్ పుస్తకంలో వ్రాసి పెట్టుకునే వారు. ఆ యేటి కా యేడు అలాంటి నోట్‌పుస్తకాల సంఖ్య పెరిగి పెరిగి, అనంతరం ఆయన సాగించిన పరిశోధన కృషిలో ఆ నోట్ పుస్తకాలు ఎంతగానో ఉపయోగపడినయి.

హైస్కూలు రోజుల్లో షేక్స్పియర్ నాటకాలు చదవడంలో ఆరంభమైన ఆంగ్ల సారస్వతాధ్యయనం కాలేజి రోజుల్లో మరింత గాఢ మైంది. ఆయన అభిరుచి పక్షపాత రహితం కావడంవల్ల వర్డ్స్‌వర్త్, బ్రౌనింగ్, షెల్లీ, కీట్స్, టెన్నిసన్ వంటి ఇంగ్లీషు కవులతో పాటు వాల్ట్ విట్మన్, ఎలా వీలర్, విల్కాక్స్, టి. ఎస్. ఇల్యట్ వంటి అమెరికన్ కవులు కూడా ఆయనకు అభిమాన కవు లయారు.

---

1. సమస్యా పూరణం ఆ రోజుల్లో మరొక సాహిత్య వినోదం.

జాతీయ చైతన్యం వెల్లి విరుస్తున్న ఆ రోజుల్లో చదువుకున్న ఇండియన్లందరిలాగే సరోజినీ నాయుడు వ్రాసిన ఇంగ్లీషు కవిత్వం ఆయన్ని ముగ్ధుణ్ణి చేసింది. అప్పటికే ఇంగ్లీషు పద్యీకరణతో ఆయనకి ఒక ప్రేమ కలాపం ఉండడం, అది ఆయన్ని ఇంగ్లీషు ప్రొఫెసర్ల దృష్టికి తేవడం జరిగింది. ఒక ప్రొఫెసర్ ముద్దుగా ఆయన్ని 'పొయెట్!' (కవీ!) అని పిలిచేవాడు. మరొకాయన ఇంగ్లీషులో పద్యాలు వ్రాయమని ప్రోత్సహిస్తూ ఉండేవాడు. కేరళ వర్మ వలియ కోయిల్ తంపురాన్ వ్రాసిన మలయాళ 'మయూర సందేశ' కావ్యానికి "The Peacock Messenger"[1] అనే పేరుతో ఆయన చేసిన ఇంగ్లీషు అనువాదం స్పష్టంగా నిరూపిస్తున్నట్టు ఇంగ్లీషు ఛందస్సు మీద ఆయన అధికారం సందేహించ రానిదే అయినా, 'ఇండో-ఆంగ్లియన్' కవితగా ప్రసిద్ధ మైన కవితా ప్రక్రియ మాత్రం ఆయనకు రుచించ లేదు.

'The Peacock Messenger' కవితా రంగంలో ప్రశంస లందుకుంది. స్వయంగా తాను కూడా ఇంగ్లీషులో వ్రాస్తున్న కేరళ వర్మ చేసిన ఘనమైన ప్రశంస సంగతి అలా ఉండగా, ఆర్. సి. దత్ లాంటి ఆ నాటి సుప్రసిద్ధ ఇండో-ఆంగ్లియన్ రచయితలు కూడా ఆ అనువాదం మెచ్చుకున్నారు. ఇంగ్లీషులో 'వీర కథా ద్విపద' (Heroic Couplet) అనే ఛందస్సులో కూర్చబడిన ఆ రచనే మలయాళం నుంచి ఇంగ్లీషులోకి చేసిన మొట్టమొదటి అనువాదం. తన 'మున్నుడి'లో అనువాదకుడు సవినయంగా ఆశించినట్టు అది 'మూల రచన హృదయాన్ని' అందించడానికి ప్రయత్నించింది. పరిస్థితి ఉత్సాహకరంగానే ఉన్నా తన అనువాదం 'ఇంగ్లీషు పాఠకుడి అభిరుచి'కి సరిపడేది కాదేమో అన్న అనువాదకుని అనుమానం సరి అయిందే! ఆ అనువాదంలోని ఈ క్రింది పద్యం నా మాటని రుజువు చేస్తుంది:

"Rain-clouds aloft a sable lustre shed
And the bird danced with all his feathers spread
He was then minded of his partner fair
And of her dark, profuse and glossy hair"

(వాన మబ్బులు పైన నల్లగా కమ్ముకున్నయి
నాట్యం సాగించిం దా పక్షి పింఛం పూర్తిగా విప్పి

---

1. మొదట ఇది Indian Review లో వచ్చింది. తర్వాత 1905 లో మద్రాసులోని జి. ఏ. నటేశన్ అండ్ కో వారు పుస్తకంగా ప్రకటించారు.

అంతలో గుర్తొచ్చింది (ప్రియురాలు
నల్లగా, ఒత్తుగా మెరిసే కురులతో!)

ఏ మాట కా మాట చూస్తే అనువాదం బాగానే ఉన్నట్టు అనిపిస్తుంది. కాని, మొత్తంమీద కలిగించే ప్రతిస్పందం తగినంత బలంగా లేదు. మూలంలో మణిప్రవాళ భాష[1] లో చక్కని దేశీయ రూపకాలతో పద్యం హాయిగా నడుస్తుంది. అనువాదంలో ప్రధాన భావం అతి సామాన్యంగానూ, నిర్జీవంగానూ, అనుద్విగ్నం గానూ తయారైంది బహుశః అనువాదాల ప్రయోజనం పట్ల విరక్తి ఏర్పడడం వల్ల నేమో తరువాత మళ్ళీ అలాంటి పనికి ఆయన పూనుకోలేదు. ఈ కారణం వల్లనే కావచ్చును - ఆ నాటి కవుల్లో, ముఖ్యంగా మహాకవి త్రయంలో ఈయనే అందరి కంటె తక్కువ అనువాదాలు చేసిన వారు.

'The Pea-cock messenger' తో పాటు ఆయన చేసిన ఇతర అనువాదాల్ని గురించి కూడా ఈ సందర్భంలోనే ప్రస్తావించడం ఉచితం. షేక్స్పియర్ వ్రాసిన Twelfth Night నాటకాన్ని 'ప్రచ్ఛన్న పోతకమ్' అనే పేర మలయాళం లోకి అనువదించడం కాలేజి రోజుల్లో ఆయన చేసిన ఔత్సాహిక ప్రయత్నం. తన చిన్ననాటి గురువు చంగనాచేరి రవివర్మ దాన్ని అభినందించడం, తన శిష్యుడికి సాహిత్య రంగంలో ఉజ్జ్వల మైన భవిష్యత్తు ఉందని జోస్యం చెప్పడం జరిగింది. సంస్కృతంలో మురారి వ్రాసిన 'ప్రసన్న రాఘవమ్' లోని కొన్ని అంకాల్ని మలయాళంలోకి అనువదించే ప్రయత్నం కూడా మహాకవి చేశారు.

భారతీ యాలంకారికులు విధించినట్టు – తన కవితా శక్తులకు పదును పెట్టుకోడం కోసం కాలేజీ రోజుల్లో ఆయన నిరంతరాభ్యాసం కొనసాగించారు. నాలుగు గంటల వ్యవధిలో 'అక్షయ పాత్రమ్' అనే 100 పద్యాల కావ్యం వ్రాయడం ఒక యువ కవి కవితా సాధనలో చెప్పుకోవలసిన ఘనకార్యం. 'సముద్ర శతకం' అనే మరో శతకం కూడా ఆ ప్రకారం వ్రాయా లని ఆయన మొదలుపెట్టారు. కాని అది పూర్తి కాలేదు. కవితా శక్తి వాటిలో కొంత లోపించినా అంత చిన్న వయస్సులో అలా పద్యాలు వ్రాయ గలగడమే ఘనం!

'కవిత్వం ఒక అంటువ్యాధి లాంటిది' అనే మాట సాహిత్య చరిత్రలో నిరూఢ మైన సత్యం. కవుల బృందం ఒకటి తల ఎత్తితే సమాన ధర్మం గల ఇతర

1. మలయాళ పదాలూ, సంస్కృత పదాలూ కలగలుపుగా వాడే భాష. 18వ శతాబ్దం దాకా కవిత్వానికి ప్రధానంగా ఈ భాషే వాడేవారు.

బృందాలకూ, వ్యక్తులకూ ఎప్పుడూ అది ప్రేరణ కలిగిస్తుంది. 19 వ శతాబ్దం చివరా, 20 వ శతాబ్దం ఆరంభంలోనూ కేరళలో కవితా రచనలు కుప్పలు తెప్పలుగా రావడానికి కారణం: ఉత్తర మలబారులోని కటత్తనాడు మొదలుకొని కొచ్చిన్‌లోని కొటుజ్ఞల్లూర్, మధ్య తిరువాన్కూరులో మవేలిక్కర, చంగనాచేరిలతో సహా దక్షిణాన తిరువనంతపురం దాకా కేరళలోని వివిధ ప్రాంతాల్లో కవుల బృందాలు ఏర్పడి చురుకుగా కవితా వ్యాసంగానికి పూనుకొవడం. కాలేజిలో చదువుకునే రోజుల్లో రామ్ కురుప్ప్ బాయిల్ వంటి ఉపాధ్యాయుల ప్రోత్సాహం వల్లనే కాక, ఒటువిల్ కుఞ్ఞి కృష్ణ మెనోన్, కె. రామకృష్ణ పిళ్ల వంటి కవుల సహవాసం వల్ల కూడా పరమేశ్వరన్ కవితావేశానికి ప్రచోదన కలిగింది. కుఞ్ఞి కృష్ణ మేనోన్ సంపాదకత్వాన వెలువడుతున్న 'రామానుజన్' అనే పత్రికకు వీళ్లంతా పద్యాలు పంపుతూ ఉండేవారు. తన 'పెంబ్రోక్' రోజుల్ని స్మరిస్తూ జాన్సన్ అన్నట్లు ఉళ్ళూర్ కూడా "అది ఒక పాటలు పాడే పిట్టల గూడు" అని చెప్పుకోవచ్చు!

మరో చెప్పుకో దగిన ప్రేరణ: ఆ నాటి ఇద్దరు సుప్రసిద్ధ కవులతో - పన్తళమ్ కేరళవర్మతోనూ, కేరళవర్మ వలియ కోయిల్ తంపురాన్‌తోనూ ఆయనకు ఏర్పడిన సన్నిహిత మైన అనుబంధం. వారిలో ప్రథముడు అర్ధాయుష్కంగా చనిపోవడం ఆయనకు ఎంతో సంతాపం కలిగించింది. రెండో కవిని ఆయన దైవ సమానంగా చూస్తూ, 'కేరళవర్మ దేవుడు' అంటూ అతి నమ్రతతో ఆయన్ని ఆరాధిస్తూ ఉండేవారు. ఆ ఇరువురు సాంప్రదాయిక కవుల (classicists) పరిధిలో ఉన్నంతవరకూ ఆయన సాంప్రదాయిక కవితా మార్గంలోనే పరాకాష్ఠ అందుకోవా లని గట్టిగా కృషి చేశారు. అయితే—చదివిన ఇంగ్లీషు చదువూ, తన చుట్టూ వస్తున్న ఆ నాటి పరిణామాలూ, క్రమంగా ఆయన జీర్ణించుకుంటూ వచ్చిన ఆధునికతా ఆయనలో స్థిరపడిన ఆ సాంప్రదాయికతను కొంతవరకు ప్రభావితం చేయక పోలేదు.

కాలేజీ రోజుల అనంతరం ఉళ్లూర్ నానా విషయాల మీద వివిధ పత్రికల్లో ఖండ కావ్యాలు ప్రకటిస్తూ వచ్చారు. ఆయనలో ఒక కొత్త గొంతుక, పూర్తిగా సంప్రదాయ విధేయం కాని గొంతుక విచ్చుకోడానికి అదే మొదలు. అలా ఆయన వ్రాసిన ఖండ కావ్యాల్లో ఒకటి 'మొట్టు సూచి' (గుండు సూది). ఉన్నత వీథుల్లో విహరించే సాంప్రదాయిక కవి గుండుసూది లాంటి సర్వ సాధారణ విషయాన్ని కవితా వస్తువుగా స్వీకరించడమే ఈ పద్యపు విలక్షణతను చాటుతూంది.

చేశారు. ఇంతకు ముందు మనం చూసినట్టు ఆధునికత యొక్క బాహిర రేఖలు ఆయన్ని కొంత ఆకర్షించినా, ప్రాచీన భూతాల చేత అప్పటికి ఆయన ఆవహించ బడే ఉన్నారు. సామూహిక కవిత[1], పద్య లేఖలూ, ఇంకా కవితా శక్తిని పరీక్షించేందుకూ, పెంపొందించేందుకూ ఉద్దిష్టమైన పోటీలూ మొదలైన ఆ నాటి సుప్రసిద్ధ కవితా వినోదా లన్నిటిలోనూ హృదయపూర్వకంగా ఆయన పాల్గొంటూనే ఉన్నారు.

ఉళ్ళూర్ కూడా పాల్గొనిన అలాంటి సామూహిక కవితా పోటీల్లో వ్రాయబడిన పద్యాలు 'కదన కౌముది'[2], 'భాషా పోషిణి'[3] వంటి సాహిత్య పత్రికల్లో ప్రకటించబడుతూ ఉండేవి. అలాంటి రచనల్లో కొన్ని చేర్చి అనంతర కాలంలో 'అరుణోదయం' అనే సంకలనం ప్రకటించ బడింది చాలామంది ఆ నాటి రచయితల్లాగ ఉళ్ళూర్ కూడా పన్తళమ్, వల్లత్తోళ్ మొదలైన కవులకు పద్య రూపంలోనే ఉత్తరాలు వ్రాసేవారు పన్తళమ్, ఒటువిల్, కె. పి. కురుప్పన్, కుట్టిపురత్ కేశవన్ నాయర్ మొదలైన పదముగ్గురు ప్రసిద్ధ కవులు పాల్గొన్న అలాంటి ఒక కవితా రచన పోటీలో న్యాయ నిర్ణేతగా వ్యవహరించిన కుఞ్ఞి కుట్టన్ తంపురాన్[4] ఉళ్ళూర్‌ని విజేతగా ప్రకటించారు.

---

1. ఇది మలయాళంలో 'కూట్టు కవిత'. చాలామంది కవులు కలిసి కావ్యాలు వ్రాసే పోటీ.

2. పద్య పత్రిక; వార్తలు, సమీక్షలు, చివరికి ప్రకటనలు కూడా దీనిలో పద్య రూపంలోనే ఉండేవి. 1905 లో స్థాపించ బడింది.

3. 1893 లో 'భాషాపోషిణి సభ' యాజమాన్యాన కోట్టయమ్‌లో వెలసిన ఉత్తమ సాహిత్యాభిరుచి గల పత్రిక.

4. కొటుఙ్ఙల్లూర్ కుఞ్ఞి కుట్టన్ తంపురాన్ (1864–1913) పద్య రచనతో అందె వేసిన చేయి. మహా భారతం అంతటినీ ఒక్క చేతిమీద మూడేళ్లలో అనువదించిన దిట్ట!

# 6. 'మహాకావ్యం' నుంచి 'భావగీతం' దాకా

ఏక కాలంలో పండితుడూ, కవీ కూడా కావా లని ఉళ్ళూర్ చేసిన ఆరంభ కృషిని పూర్వరంగంగా గ్రహించి మలయాళ భాషలో కవిగా ఆయన క్రమ పరిణామాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి. ఆ పూర్వరంగంలో మూడు విలక్షణ మైన అంశాలు కనిపిస్తయి ప్ర పథమంగానూ, ప్రధానంగానూ మన దృష్టి నాకట్టుకునే అంశం: ఉళ్ళూర్ పాండిత్యం సామాన్య మైంది కాదు. సంస్కృత కావ్యాల్లోనూ, శాస్త్రాల్లోనూ ఇంచుమించు సాటిలేని పాండిత్యం ఆయనది. రెండో అంశం: సాంప్రదాయిక కవితా మార్గంలో సుశిక్షితు డైన వ్యక్తి ఆయన. తరతరాలుగా వచ్చే సాంప్రదాయిక సాహిత్య ప్రక్రియల్నీ, పద్ధతుల్నీ తు, చ, తప్పకుండా పాటించడానికీ, శబ్దార్థ సంయోజన నైపుణికీ ఆ మార్గం అమిత ప్రాధాన్యం ఇస్తుంది. ఇక-అంతర్నిహితంగా ఉండి ఆ రోజుల్లో అంతగా గుర్తించబడని మూడో అంశం: సాహిత్యంలో నవ్య ధోరణుల పట్ల సులువుగా ఆకర్షించబడే లక్షణం, దేశం అంతటా వీస్తున్న సరిక్రొత్త గాలులకు సునాయాసంగా అలవాటు పడి పోగల స్వభావం. ఆయనలోని ఈ స్వభావానికి నిదర్శనంగా 'నేర్చ' అనే కావ్యాన్ని క్రిందటి అధ్యాయంలో మనం గమనించాము. మలయాళ కవిత్వంలో సంస్కృత పదాల్ని పూర్తిగా పరిహరించి కేవలం దేశ్య పదాలతోనే కావ్య రచన చెయ్యా లనే ఆ నాటి ఫాషన్‌కి అనుగుణంగా చేసిన రచన అది. సంస్కృతంలో చెప్పుకోదగ్గ పండితుడు అయి ఉండి కూడా సంస్కృతేతర పదాలతో కావ్యం వ్రాసే ప్రయత్నం చెయ్యడం ఆ రోజుల్లో సాహిత్య సంబంధమైన ఒక ఫీట్‌గా భావించబడి ఉండవచ్చు. కాని, సాహిత్య విషయాల్లో ఎంత తేలికగా ఆయన మనస్సు సరిపుచ్చుకో గలరో ముఖ్యంగా అది నిరూపిస్తుంది. 'వంచీశ గీతి' రచన నాటి నుంచీ ఆయన్ని ఉత్తేజితం చేస్తూ వచ్చిన 'ఆధునికత'కి స్వాగతం చెప్పడానికి కరడుగట్టిన ఆయన పాండిత్యం ప్రతిబంధకం కాక పోవడం మలయాళ కవిత్వం చేసుకున్న అదృష్టం. 'వంచీశ గీతి' ఉపోద్ఘాతం వల్ల కవిత్వంలో కొత్త పుంతలు త్రొక్కవలసి ఉన్న తన పాత్రని గూర్చిన అవగాహన ఆ నాటికే ఆయనకు ఉందని విస్పష్టం అవుతూంది. మొదటి రెండు అంశాలూ-అనగా, సంప్రదాయ సిద్ధ మైన పాండిత్యం, ప్రాచీన కవితా మార్గంలో శిక్షణ మాత్రమే ఆధునిక మలయాళ కవిత్రయంలో ఆయనకు స్థానం సంపా

దించి పెట్టగలిగేవి కావు. పాండిత్య ప్రకర్షతోనూ, అనుకరణలతోనూ కూడిన సంస్కృత ప్రభావ భరితాలైన చంపూ, మహాకావ్య రచనోద్యమాల్ని ఒక వంకా, వెణ్మణి సంప్రదాయకపు ల్లాగా అశ్లీల శృంగార రచనలతో వినోదం కలిగింప జూచే క్షీణతా లక్షణాన్ని మరో వంకా ఎదుర్కొంటూ నూతన శకం మలయాళ కవిత్వాన్ని చాలా ముందుకు తీసుకు పోయింది. ఒక నూతన ప్రస్థాన కర్తగా ఆయనలో కనిపించే గొప్ప సుగుణం: సాహిత్యంలో మారుతూన్న పరిస్థితుల కనుగుణంగా మనస్సు సరిపుచ్చుకో గలగడం! దాని వల్లనే క్రమేణ మలయాళ సాహిత్యోద్ధర్తలలో ఆయన ఒకరు కాగలిగారు.

ఉళ్ళూర్ రచించిన చెప్పుకోదగ్గ మొదటి కావ్యం 'ఉమా కేరళమ్.' సంస్కృత సంప్రదాయ పద్ధతిలో, వివిధ సంస్కృత ఛందస్సుల్లో కూర్చిన 2, 022 పద్యాలు గల 19 సర్గల మహాకావ్యం అది. ప్రభుత్వంలో ఆయన సహాయ కార్యదర్శి అయిన కొత్తల్లో 1913 లో అది ప్రచురించ బడింది. మలయాళ కవుల్లో చాలామంది 'మహా కావ్య' వ్యామోహంతో సదమద మవుతున్న రోజు లవి. మలయాళ సాహిత్యంలో కాల్పనిక యుగ వైతాళికుడుగా భావించబడుతున్న వళ్ళత్తోళ్ నారాయణ మేనోన్ కూడా ఆ రోజుల్లో 'చైత్ర యోగమ్' అనే ఒక మహాకావ్యం వ్రాశారు. ఇక విద్వత్కవి ఉళ్ళూర్ తన మొదటి ప్రముఖ కావ్యంగా జటిలమైన సాంప్రదాయిక నియమాలను పాటించే మహా కావ్యం వ్రాయడం కంటె ఔచిత్యం వేరే ఏ ముంటుంది? సాంప్రదాయిక మార్గంలో ఆయన పొందిన కఠోర శిక్షణ వల్ల పెంపొందిన ఆయన సృజన శక్తు లన్నీ వ్యయం అయిపోతే గాని నూతన కవితా రూపాలకోసం ఆయన అన్వేషించరు గద! వర్ణన వైదగ్ధ్యంలోనూ, అలంకార విన్యాసంలోనూ సంస్కృతాలంకారికులు విధించిన నిష్ఠుర నియమాలను పాటించడంలో ఈ మహాకావ్యంలో ఉళ్ళూర్ ప్రదర్శించిన ఒడుపు సంస్కృతంలో ఆ ప్రక్రియలో ఆరితేరిన హేమాహేమీలను కూడా తల వంచుకునేట్టు చేస్తూంది. అంత సుదీర్ఘ మైన సాంప్రదాయిక కావ్యంలో అక్కడక్కడ నీరసమైన భాగాలు ఎదు రవడం తప్పనిసరి అయినా, మహా కావ్యాలు తమ ఇతివృత్తాలను పురాణాలలోనించే స్వీకరిస్తున్న ఆ రోజుల్లో సంప్రదాయ విరుద్ధంగా తిరువాన్కూరులో సంస్థాన చరిత్రలోనించి తన ఇతి వృత్తాన్ని ఎంచుకోడం సాహసికమైన వినూత్న ప్రయోగం. ఈ నూతన విధానం వల్ల ఏ ఇతర మలయాళ మహా కావ్యంలోనూ కనిపించని దేశభక్తి ప్రబోధం అనే నూతన లక్షణం ఈ కావ్యాన్ని ఆస్వాద్య తరం చేసింది. పరమేశ్వర అయ్యర్

రచనలలో నాయక మణి అని అది అభివర్ణిత మైంది. కేరళవర్మ వలియ కోయిల్ తంపురాన్ దాన్ని "మలయాళంలో ఇంతవరకూ వచ్చిన కావ్యాల్లో సర్వోత్తమ" మైన దని భావిస్తూ, "అంత భావ సంపన్నం, అలంకార శోభితం అయిన కావ్యం మరోటి మనకు ఉందా?" అని ఆశంకించారు.

17 వ శతాబ్దిలో తిరువాన్కూరు మహారాజు ఆదిత్య వర్మ కాలం నాటి ఆ ఇతివృత్తంలో సహజంగా కనిపించే కరుణ రసమే ఆ కావ్యాకర్షణకు ప్రధాన కారణం. 'తిరువాన్కూరు సంస్థానపు మాన్యువల్' తయారు చేసిన నాగమయ్య, 'తిరువాన్కూరు చరిత్ర' వ్రాసిన శంకున్ని మేనోన్ మొదలైన వారు విరివిగా ప్రజల్లో ప్రచారం చేసి ఉన్న కథ అది. పై గ్రంథాల్లోని కథనే కచ్చితంగా తన కావ్యంలో ఉళ్ళూర్ అనుసరించారు. ఆ కావ్యానికి ఉపోద్ఘాతంలో కేరళవర్మ ఇచ్చిన కథా సారాంశం ఇది :

> "మలబారు శకం 9 వ శతాబ్దం మధ్య భాగంలో వేనాడ్ పాలించిన మహారాజు ఆదిత్యవర్మ బలహీనుడూ, అసమర్థుడూ. ఆయన కుమార్తె కళ్యాణి చాలా అందగత్తె; మంత్రి రవివర్మ తంపాన్ యువకుడు. కళ్యాణి, రవివర్మ పరస్పరం ప్రేమించుకున్నారు. వారి వివాహానికి మహారాజు కూడా అంగీకరించాడు. అయితే - నిజమైన ప్రేమ మార్గం ఎప్పుడూ సుగమం కాదు గద! తిరువాన్కూరు చరిత్రలో 'ఎట్టు వీటిల్ పిళ్ళమార్'లు అనబడే సామంతులు వీరుడూ, విశ్వసనీయుడూ అయిన ఆ మంత్రిమీద మహారాజు మనస్సులో అనుమాన బీజాలు నాట సాగారు. వారిలో ఒకడు దివాణానికి నిప్పంటిస్తూ ఉండగా చూసి రవివర్మ అతణ్ణి సంహరించాడు. అతి నేర్పుగా పన్నిన కుట్రతో ఆ పిళ్ళమార్‌లు ఆ గృహ దాహ కాండకు మూలకారణం మంత్రే అని మహారాజుని నమ్మించి అతనికి దేశ బహిష్కార శిక్ష విధించేట్టు చేస్తారు. ఆ విధంగా తమ కోరిక నెరవేరడంతో సామంతులు మహారాజుకి విషం పెట్టి చంపుతారు. వారిలో అతి క్రూరుడైన రామన మఠం అనే సామంతుడు మహారాజు అనంతరం గద్దె ఎక్కిన ఉమయమ్మ రాణి బిడ్డల్ని అయిదుగురు పసికందుల్ని హతమారుస్తాడు. ఈ లోగా దివాణానికి నిప్పంటించిన సామంతుని మేనల్లుడు కళ్యాణిని ప్రేమిస్తాడు. తన ప్రేమ నిరాకరించ బడడంతో ఆమెను ఎత్తుకు పోవాలని యత్నిస్తాడు. తిరువాన్కూరు మీద దండెత్తి వచ్చిన ఒక మొగల్ సర్దారు అది చూస్తాడు ఆదే సమయానికి తన ప్రియురాల్ని కాపాడుకోడానికి

మంత్రి రవివర్మ కూడా అక్కడికి వస్తాడు. మొగల్ సర్దారు ఆ సామంతుణ్ణి వధించి రాజకుమార్తెని ఎత్తుకుపోతాడు. బ్రిటిష్ మలబార్‌లోని కోట్టయమ్ యువరాజు కేరళవర్మ సహాయం అర్థించడం కోసం రాణి రవివర్మను పంపుతుంది. అతడు తిరువాన్కూరు వచ్చి దైవ సాహాయ్యంతో చిత్రంగా మొగల్ సర్దారుని జయిస్తాడు. ఆ సర్దారు రాజకుమార్తె మానం హరింప యత్నించగా ఆమె అతణ్ణి సంహరిస్తుంది. రాముడు మరాన్ని వేటాడి అంత మొందిస్తారు. దేశంలో తిరిగి శాంతి నెలకొంటుంది; మంత్రికి, రాజకుమార్తెకి వివాహం జరుగుతుంది. మంత్రి సలహామీద రాణి ఇంగ్లీషు వారికి 'అంచెంకో' లో కోట నిర్మించుకునేందుకు అనుమతి ఇస్తుంది. ఆ శుభ సంఘటనతో కావ్యం సుఖాంత మవుతుంది.''

బి. కె. వేలుపిళ్ల వంటి చరిత్ర రచయితలు సాగించిన అనంతర పరిశోధనలు ఈ కథ చారిత్రకతను త్రోసిపుచ్చిన మాట నిజమే! అయినా — ఆ పరిశోధనల ఫలితాల వల్ల ఈ మహాకావ్య కళా సౌందర్యానికి ఎలాంటి హానీ కలుగ లేదు. ఉదాత్తంగా, గంభీరంగా, శోభాయమానంగా నడుస్తూ పాఠకుల్ని కదిలించే కావ్యం ఇది. అయితే — మహా కావ్యానికి సహజంగా ఉండే అవలక్షణా లైన అనుచితమైన దీర్ఘ వర్ణనలూ, దురవగాహ మైన పదబంధాలూ, కృతక మైన శాబ్దిక చమత్కారాలూ దాని కవితా సౌందర్యానికి కొంతవరకు భంజకాలు కాక పోలేదు.

ఉళ్ళూర్ కవితా జీవితంలో 'ఉమా కేరళమ్' రచనతో మొదటి ఘట్టం ముగిసింది. తర్వాత ఒక దశాబ్ది పాటు ప్రాచీన మలయాళ సాహిత్య పరిశోధనల్లో కంఠ దఘ్నంగా ఆయన నిమగ్ను లయారు. 1918 లో ప్రచురించిన 'మంగళ మంజరి'ని మినహాయిస్తే ఆ కాలంలో కవిత్వం వైపు దృష్టి మళ్ళించే తీరిక ఆయనకు చిక్కలేదు 'మంగళ మంజరి' రాజప్రశస్తి కావ్యం; 'వంచీశ గీతి' కోవకి చెందింది; తిరువాన్కూరు మహారాజు శ్రీ మూలం తిరునాళ్ రామవర్మ యశో వైభవాన్ని వర్ణించేది. తీసుకున్న వస్తువుకి అనుగుణంగా ఈ కావ్యం మూస సంప్రదాయబద్ధం కావడం తప్పని సరి అయినా, ఉళ్ళూర్ స్వతంత్ర కల్పనలూ, అలంకార రచనలో వినూత్నతా చెదురు మదురుగా ఈ కావ్యంలో కూడా కనిపిస్తాయి.

ఆయన కవితా జీవితంలోని రెండో దశ ఆయన (తాత్కాలిక) ప్రధాన కార్యదర్శి, దివాన్ పేష్కార్ పదవులు నిర్వహించే కాలంతో సరిపోతుంది. పైకి చిత్రంగా కనిపించినా, ఉద్యోగ నిశ్రేణిక మీద మీది మీది మెట్లు అధిరోహిస్తున్న

కొద్దీ ఆయన పద్యశైలి మరింత మాధుర్యం అలవరించుకుంటూ వచ్చింది. 1924 లో ఆయన 'కిరణావళి' ప్రచురించారు. పదిహేను ఖండ కావ్యాల సంపుటి ఇది. ముందు ముందు ఆయన కవితలో సంపూర్ణంగా వికసించనున్న భావ కవితా, కాల్పనిక కవితా చ్ఛాయలు మొదటిసారిగా దీనిలో మనకు కనిపిస్తాయి. దీనిని వెన్నంటి మరి రెండు ఖండకావ్య సంపుటాలు - 'తారహారం', 'తరంగిణి'-వచ్చినయి. 1913 - 1924 మధ్యకాలంలో తన కవితా శైలిలో కాలానుగుణంగా మార్పులు చేసుకో వలసిన అవసరాన్ని గుర్తించి ఉళ్ళూర్ తీవ్రంగా మథనపడినట్టు ఈ కావ్య సంపుటాలు సాక్ష్య మిస్తున్నయి. విషయంలోనూ, విధానంలోనూ కూడా ఈ పద్యాలు ఒక నూతన ప్రస్థానాన్ని స్పష్టంగా ప్రతిఫలిస్తున్నయి. కోర దగిన పరిణామం వాటిలో కనిపిస్తుంది. శైలీ గత మైన అతిశయోక్తి నుంచీ, విపుల వర్ణనాసక్తి నుంచీ విమోచన ప్రక్రియకి ఈ పద్యాల్లో నాందీ ప్రస్తావన జరిగింది. సాంప్రదాయిక మైన సనాతన కవిత్వపు ఉన్నత శిఖరాల నుంచి దిగి వచ్చి, కాల్పనికతా, భావకవితా మైదానాలకు మారడం ఆయనకు మిక్కిలి బాధాకరం అయి ఉండవచ్చు. ఛందస్సుల ఎన్నికలో కూడా సంస్కృతపు ఛందస్సులు మాని, దేశీయ చ్ఛందస్సుల పట్ల ఆదరం చూపడానికి కూడా ప్రాతిపదిక ఈ రచనల్లో మనకు కనిపిస్తుంది.

ఉళ్ళూర్ తొలి కవితా సంపుటం 'కిరణావళి' లో మంచీ, చెడూ, అన్ని రకాల పద్యాలూ చేరి ఉన్నా, ఆయన పద్యాల్లో మణిపూసలు అని చెప్పదగిన మూడు ఖండికలు అందులో కనిపిస్తయి : 1 కపీర్‌దాస్, 2. హీరా, 3. విచార ధార. ఈసంపుటంలోని 'ఉద్బోధనమ్', 'కన్యాకుమారియిలే సూర్యోదయమ్' కూడా భావనలోనూ, రచనలోనూ చారుత్వం కలవి. మొదటి దానిలోని నైతికావేశం, రెండో దానిలోని భావనా శక్తి గణనీయాలు. వెనుకటి శైలిలో కనిపించే శబ్ద వ్యామోహం క్రమంగా సన్నగిల సాగింది. అయితే - ఇంకా ఆ వ్యామోహం తాలూకు చిన్నెలు కొన్ని పద్యాల్లో కనిపిస్తూ ఉండడం చూస్తే, 'మహా కావ్య' చ్ఛాయలు ఆయన్ని ఇంకా వెన్నంటుతూనే ఉన్నట్టు కనిపిస్తుంది. ఉదా : 'దివ్య సాంత్వనమ్', 'కపిల వస్తువిలె కర్మయోగి'.

రెండో సంపుటం 'తార హారమ్' లో కాల్పనికత తాలూకు సజీవ చైతన్యం, భావ కవిత తాలూకు భావ పుష్టి మరింత స్ఫుటంగా కనిపిస్తున్నా, కవితా సిద్ధిలో మొదటి సంపుటం కంటె దీని స్థాయి తక్కువ. ఈ సంపుటంలో 'పెరియట్టి'

నోటు[1] (పెరియార్ మీది గీతం) 'ఒరుమళ్ళత్తుళ్ళి' (ఒక వాన బొట్టు) గొప్ప గీతాలు. కల్పనలు మరీ ఎక్కువగా ఉన్నా యనీ, సంయమం లోపించిం దనీ ఈ పద్యాలు విమర్శించబడినయి. కొంతవరకు ఆ అభిప్రాయంతో మనం ఏకీభవించినా, వీటిలో రెండోది మలయాళ భాషలో వచ్చిన గొప్ప గీతాలలో ఒకటి అని మనం మరచిపోకూడదు.

మూడో కవితా సంపుటం 'తరంగిణి' లో కవితా కళలో ఉళ్ళూర్ పరాకోటి నందుకో గలిగా రని నిరాక్షేపణగా చెప్పవచ్చును. ఈ సంపుటిలోని పద్యాలు చాలావరకూ భావ బంధురాలూ, ఆవేశ పూరితాలూ. కవిలోని శక్తులు పరిపక్వం చెంది, రూప, విషయాలకు చక్కని సామరస్యం ఏర్పడి కవితావేశం పొంగి పొరలి రూపొందిన పద్యాలు ఇవి. బహుశః - మహాకావ్యంలో భావన పల్చన అయినందుకు అనుతాపంతో అందుకు పరిహారంగా ఇమిడికతోనూ, ఆవేశభరితం గానూ ఈ ఖండకావ్యాలు మహాకవి వ్రాశాడా అనిపిస్తుంది. దేశభక్తి ప్రబోధంతో పాఠకుల్ని నైతి కాచరణకు ప్రేరేపించే పద్యాలు ఈ సంపుటిలో సర్వోత్కృష్టమైనవి. ఉదా: 'గాథాంజలి', 'అన్నుమ్ - ఇన్నుమ్' (నాడు – నేడు), 'బాలాంకురమ్', 'సుఖమ్, సుఖమ్!'

మహా కళాకారుడు సర్ జోషువా రేనాల్డ్స్‌ని గురించి ఒక ధీమంతుడు అన్నట్టు ఉళ్ళూర్ కూడా 'వైవిధ్య నిధి.' అదే సంవత్సరం (1929) వెలువడిన 'కర్ణ భూషణమ్', 'పింగళ' అనే రెండు పెద్ద కావ్యాలు తరిగిపోని ఆయన వైవిధ్యాన్ని మరొకమారు ధ్రువపరచినయి. ప్రాచీన భారతీయ పురాణ గాథలనుంచి ఇతివృత్తం గ్రహించిన కావ్యాలు ఇవి. కీట్స్, బైరన్ వంటి ఆంగ్ల కాల్పనిక కవులు వాడుకలోకి తెచ్చిన సుదీర్ఘమైన కథాకావ్య ప్రక్రియపట్ల ఆకర్షించ బడిన కుమరన్ ఆశాన్, వళ్ళత్తోళ్‌లు అలాంటి రచనలద్వారా మలయాళ భాషలో కాల్పనిక యుగానికి నాంది పలికారు. ఆ ఉద్యమ యజ్ఞంలో ఉళ్ళూర్ అర్పించిన సమిధలు 'కర్ణ భూషణమ్,' 'పింగళ.' తక్కిన ఇద్దరు మహా కవులూ కూడా సంస్కృత సాహిత్యంలోనూ, దర్శనాల్లోనూ తగినంత ప్రవేశం గలవారే అయినా, ఉళ్ళూర్‌కి ప్రాచీన భారతీయ విజ్ఞానం ఒక తపస్సు లాంటిది. ఈ రెండు రచనల మీదా దాని ముద్ర పరిపూర్ణంగా కనిపిస్తుంది. శ్రావ్యమైన

1. 'పెరియార్' కేరళలోని పెద్ద నదుల్లో రెండోది. ఆ నది ఒడ్డునే ఆది శంకరుల జన్మస్థానం అయిన 'కాలడి' గ్రామం ఉంది.

'మంజరి' అనే ద్రావిడచ్ఛందస్సులో కూర్చబడిన ఈ రెండు కావ్యాలూ సంస్కృత సాహిత్యంలో ఉజ్జ్వలంగా పోషించబడిన కొన్ని ఉదాత్త గుణాల ప్రాశస్త్యాన్ని ప్రతిపాదిస్తున్నాయి

మహా భారతంలో సుప్రసిద్ధమైన కథని – జన్మతః తనని అజయ్యునిగా చేసిన సహజ కవచ కుండలాలను కర్ణుడు నిస్సంకోచంగా దానంచేసి వేయడానికి తీర్మానించుకున్న ఆత్మ బలిదాన గాథని - చెబుతుంది 'కర్ణ భూషణమ్.' కవి సంకల్పించిన సన్నివేశం నాటకీయ మైంది. దాతృత్వానికీ, ఔదార్యానికి పేరు మోసిన కర్ణుడికి మహా భారత యుద్ధ ప్రారంభదినం వేకువ జామున మారు వేషంలో అతని మందిరానికి వచ్చిన అతని తండ్రి సూర్యుడు యావచ్ఛక్తి యుక్తులతో నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తాడు. కర్ణుడికి విషమ పరీక్ష ఎదు రవుతుంది. తనని దయాభిక్ష అర్థించవచ్చిన ఏ అర్థికి ఆశాభంగం కలిగించ రాదనే తన జీవిత ధ్యేయంనుంచి ఒక్క అంగుళం కూడా అతడు వెనుకకు తగ్గడు. వాదంలో అన్ని విధాలా ఓడిపోయిన సూర్యుడు చివరికి స్వస్వరూపం చూపిస్తాడు. తన సహజ కవచ కుండలాలను ఏ అర్థికి దానం చేయవ ద్దనీ, ముఖ్యంగా తనతో యుద్ధంలో అర్జునుడు ఓడిపోకుండా ఉండేందుకు అతని తండ్రి దేవేంద్రుడు మారు వేషంలో వచ్చి అర్థిస్తే ఎంతమాత్రం దానం చేయవ ద్దనీ హెచ్చరించడానికే తాను వచ్చి నట్టు విస్పష్టంగా చెబుతాడు. ఆత్మరక్షణ అనే బలమైన యుక్తిని ప్రతిపాదించే ఆ వాదం కూడా చివరికి కర్ణుడి ఔదార్యాన్నీ, దాతృత్వ గుణాన్నీ చలింపజేయ లేక పోయింది. తన కుమారుడి గొప్పదనానికి నివ్వెరపోయి, రాయబారంలో విఫలుడైనా, తన కుమారుడి ఘనతకు గర్విస్తూ సూర్యుడు వెనుదిరుగుతాడు.

'పింగళ' కథ భాగవతంలో నుంచి గ్రహించింది. 'పింగళ' అనే వేశ్యకి ఆకస్మికంగా వైరాగ్యోదయం అయిన ఒక చిన్న కథ చుట్టూ అల్లబడిన కావ్యం ఇది. ఒక రాత్రి తాను నిరీక్షిస్తున్న మామూలు విటులు ఎంతకూ రాకపోయే సరికి - రిక్తమైన శృంగార క్రీడల్లో జీవిత మంతా వృథా చేసుకున్న ఆ వేశ్యని ఆమె అంతరాత్మ నిలదీసింది. ఆ నిర్వేదానికి ఫలితంగా హఠాత్తుగా ఆమెకి దివ్య ప్రేమ అర్థ మవుతుంది; భగవద్ భక్తురాలుగా మారిపోతుంది.

మన హృదయ మందిరాల్లో సుస్థిరంగా ప్రతిష్ఠితా లైన రెండు ఉదాత్త మానవ ధర్మాలను ఈ రెండు కావ్యాలూ ప్రతిపాదిస్తున్నాయి. ఒకటి : అంతరాత్మ ఆదేశాలను పాటించడంకోసం తన ఐహిక అస్తిత్వాన్ని కూడా లక్ష్యం చెయ్యని

మానవుని స్థైర్యగుణం. రెండు: ఎంత నికృష్టుడైనా, ఎంతగా పతితుడైనా విశ్వాస బలంతో మానవుడు తనని తాను ఉద్ధరించుకునేందుకు గల విస్పష్టమైన అవకాశం ఈ సార్వజనీన ధర్మాలను హృద్యంగా ప్రతిపాదించడమే కాకుండా ఈ కావ్యాలు జాతీయాభిమానాన్ని పునః ప్రజ్వలితం చేసి, సనాతన జాతీయాదర్శాల కనుగుణంగా జీవించవలసి ఉన్న అవసరాన్ని కూడా దేశీయులకు ప్రబోధిస్తున్నాయి. 'కర్ణ భూషణమ్' అవతారికలో వాచ్యం అయిన కవి ప్రధానాశయం ఇదే! ఆ అవతారిక ఇలా పూర్తి అవుతుంది: 'ప్రాచీన భారతీయుల ఉదాత్తాశయాలు నిరంతరంగా వర్ధిల్లుగాక! వ్యాస మహర్షి కవితా వైభవం మ్రోల తిరిగి తిరిగి నేను ప్రణమిల్లుతున్నాను. వందే మాతరమ్!'' [1]

ఈ రెండు కావ్యాలూ వ్రాసిన తరువాత వాటిని మించిన భావకావ్యం ఉళ్ళూర్ మరి వ్రాయలేదు. ఈ రెండిటిలోనూ 'కర్ణ భూషణమ్' మేల్తరమైన దని ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు. ఉళ్ళూర్ కవితా జీవితంలోని ఈ రెండవ దశలో పైన పేర్కొన్న మూడు కవితా సంపుటాలూ, రెండు భావ కావ్యాలూ వెలువడినందువల్ల ఈ దశే మిక్కిలి ఉత్పాదక మైన దశగా భావించబడుతూంది 1933 లో ఆయన పదవీ విరమణ చేయడంతో ముగిసిన ఈ దశ అనంతరం కవిత్వం దృష్ట్యా సామాన్యమైన మూడు కావ్యాలు మాత్రమే ఆయన వెలువరించారు: 1. 'అరుణోదయమ్' - ఇంతకు ముందే దీనిని గురించిన ప్రస్తావన వచ్చింది. ఉళ్ళూర్ కూడా ఎక్కువగా పాల్గొన్న సామూహిక కవిత (కూట్టు కవిత)ల సంకలనం ఇది. గ్రంథ నామమే సూచిస్తున్నట్లుగా ''మలయాళ కవిత్వంలో నూతన శకోదయానికి స్వాగతం పలికిన రచనలు ఇవి'' అని ఆ గ్రంథానికి తాను వ్రాసిన మున్నుడిలో ఆయన పేర్కొన్నారు. 'చిత్రోదయమ్' వంచీశ గీతి కోవకు చెందిన ప్రభుస్తుతి కావ్యం. శ్రీ చిత్తిర తిరునాళ్ బాలరామ వర్మ అనే ప్రభువును కీర్తించేది.

19·2 లో ప్రకటిత మైన 'చిత్రశాల' – పలు విమర్శలకు గురి అయి ఎక్కువ ప్రచారం పొందిన మిస్ కేతరిన్ మేయో వ్రాసిన 'మదర్ ఇండియా' కి

---

1. 'అంబ' (1947) అనే వచన నాటకంలో మళ్ళీ మహాకవి భారతం వైపు దృష్టి మళ్ళించారు. షేక్స్‌పియర్, డి. ఎల్. రాయ్‌ల ప్రభావంతో వ్రాసినట్టు చెప్పుకున్న ఆ నాటకం 'నాటకీయ కావ్యం' (dramatic poem) అని వర్ణించబడింది.

సమాధానంగా వ్రాసిన రచన కావడంవల్ల ఆ కావ్యానికి తాత్కాలిక ప్రశస్తి ఎక్కువగా వచ్చింది. కవిత్వం దృష్ట్యా అది నిస్సందేహంగా తేలికరకపు కావ్యం. మిస్ మేయో వ్రాసిన 'మదర్ ఇండియా' గాంధీజీ హృదయంగమంగా వర్ణించినట్టు "మురుగు కాల్వల ఇన్స్పెక్టర్ రిపోర్టు"[1] తప్ప వేరేమీ కాదు. అయినా ఆమెకు గాంధీజీ అంటే ప్రగాఢమైన గౌరవం. ఆమె ప్రతిపాదించిన యుక్తులు చాలా వరకు గాంధీజీ స్వయంగా చేసిన ప్రకటనల నాధారంగా చేసుకుని ప్రతిపాదించినవే! తన 'యథార్థాల' (facts) విషయమై ఆమెకు గట్టి నమ్మకం. ఆమె ఇలా వ్రాసింది: "వాటిని తేలికగా త్రోసివేయ వచ్చును. కాని, అవి అయథార్థాలు అని మాత్రం ఎవ్వరూ రుజువు చెయ్యలేరు. ఇవే కాక - ఈ పరిశీలనలో స్పృశింప బడని ఇతర యథార్థాలూ, ఇతర గణ సంఖ్యలూ, ఇతర దృక్కోణాలూ ఉండవచ్చు ననే విషయంలో నాకు పేచీ లేదు."[2]

మన జాతిని అప్రతిష్ఠ పాలు చేసిన ఆమెను ఒక రాజకీయవేత్తో, ఆర్థిక శాస్త్ర నిపుణుడో ఎదుర్కొన్నట్టు ఒక కవి ఎదుర్కోడానికి వీలులేదు. అందుచేత - మహాకవి మరో పంథా తొక్కారు. భారతీయులు ఎప్పుడూ బానిస మనస్తత్త్వంతోనే, స్త్రీలపట్ల ఎలాంటి నిజమైన గౌరవం లేకుండానే ఉన్న ఒక నికృష్ట జాతి అని ఆమె చేసిన ఆరోపణను ఖండించడానికి భారత దేశపు ఉజ్జ్వల చరిత్రలోనుంచి వేరొక భూతార్థ సముదాయాన్నీ, మరొక దృక్కోణాన్నీ ఆయన ఎంచుకున్నారు. సంస్కృత విద్వాంసుడూ, భావకవీ అయిన ఉళ్ళూర్‌కి బహుశః భారత దేశపు వర్తమానం కంటె కూడా భూతకాలమే మరింత ఎక్కువగా తెలుసు! భారత దేశ చరిత్రలోని ఏ ఇతర అంశం కంటె కూడా ఎక్కువ బలంగా ఈ నాటికీ నిరక్షరాస్యులైన భారతీయుల్ని కూడా ప్రభావితుల్ని చేస్తూన్న ఉదాత్త జీవితాలూ, ఆశయాలూ గల దేదీప్యమానమైన వీర భారత నారులను ఆయన ఎన్నుకున్నారు. భారత దేశపు ప్రాక్తనవైభవాన్ని ఆదర్శప్రాయంగా చిత్రించడం ఒక కళ. అంతకు ముందు వ్రాసిన 'అన్నుమ్ - ఇన్నుమ్' (నాడు - నేడు), 'శివ గీత,' కర్ణ భూషణమ్' వంటి కావ్యాల్లో తిరిగి తిరిగి సాధిక చేసి ఉండడం వల్ల ఆ కళలో ఆయన బాగా ఆరితేరారు. 'చిత్రశాల'లో ఉళ్ళూర్‌లోని కవిని సంస్కృత విద్వాంసుడు తన పాండిత్య భారంతో ఉక్కిరి బిక్కిరి చెయ్యడంతో తాను గ్రహిం

---

1. 'యంగ్ ఇండియా' - 25-9-1927.

2 'మదర్ ఇండియా - రెండవ ముద్రణ, పుట 363.

చిన పౌరాణిక సన్నివేశాల్లో వినూతన కాల్పనిక దృష్టిని ప్రదర్శించే అవకాశం ఆయనకు లేకుండా పోయింది. అయితే - భారత మాత (Mother India) మిస్ మేయో తనకు ఆపాదించిన కళంకానికి భిన్నురాలై ఆవేశించగా వ్యాస మహర్షి వచ్చి, అమెరికా దేశానికి సుప్రసిద్ధ భారతీయ పౌరాణిక మహిళల చిత్తరువులను ప్రదర్శిస్తున్నట్టు చేసిన కల్పన - కొంత కృతక మైనా — ప్రతిభావంత మైనది.

ఉళ్ళూర్ కవితా జీవితంలో చివరిదీ, మూడవదీ అయిన దశలో వెలువడిన కవితా సంపుటా లన్నింటిలోకి ఆయన పదవీ విరమణ చేసిన వెంటనే ప్రకటిత మైన 'మణి మంజూష'[1] నిస్సందేహంగా మంచి రచన. ఈ సంకలనంలోని పద్యాల్లో అగ్రస్థానం పొందదగిన ఖండకావ్యం 'ప్రేమ సంగీతం'. మలయాళ భాషలోని అత్యుత్తమ భావ గీతాల్లో అది ఒకటి అనడం నిర్వివాదం! విశ్వ జనీన ప్రేమ, మానవ సౌభ్రాత్రాలను గురించి మలయాళ, సంస్కృత పదాల మధుర సమ్మేళనతో, తన ముద్ర కనిపించె విలక్షణ మైన శైలితో కూర్చిన ఆ ఖండ కావ్యంలో శబ్దార్థ సమన్వయం, సామరస్యం అపూర్వ మైన, అత్యుచ్చస్థాయి నందుకున్నాయి. మానవ సమైక్యాన్ని ప్రస్తుతించే 'ఐక్యగాథ' శాస్త్రీయ పరిశోధనల్లో అద్భుత ప్రగతి సాధించి మానవుడు భవిష్యత్తులో చంద్రగ్రహం దర్శించ గల డనే జోస్యంతో కూడిన 'భావనా గీతి' వంటి ఇతర ఖండ కావ్యాలు కూడా ఈ కావ్య సంపుటి శోభకి వన్నె పెడుతున్నాయి. అటు తరువాత అయిదు కవితా సంకలనాలు వెలువడినయి: 1 హృదయ కౌముది (1935), 2. రత్నమాల (1938), 3. అమృత ధార (1938), 4. కల్పశాఖి (1943), 5. తప్త హృదయమ్ (1948). ఈ సంకలనాల్లో కూడా కవిత్వంలో ఆయన అంతకు ముందు సాధించి ఉన్న ఉచ్చస్థాయిని అందుకో గలిగిన ఖండకావ్యాలు కొన్ని ఉన్నాయి.

ఈ దశలో వ్రాసిన దీర్ఘ కావ్యాల్లో, 'దీపావళి', 'చైత్ర ప్రభవమ్', 'శరణోపహారమ్', 'మిథ్యాపవాదమ్' మొదలైన వాటిలో - ముందు తరాలవారు స్మరించే కావ్యం 'భక్తి దీపిక'. సంస్కృతంలోని సుభాషితాల పద్ధతిలో నీత్యుద్బోధకాలుగా అప్పు డప్పుడు వ్రాసిన ప్రాస్తావిక పద్యాల సంకలనం 'దీపావళి'. ఈ రచనలో ఉళ్ళూర్‌లోని ప్రగాఢమైన నైతిక దృష్టి ఇతర కృతుల్లోకంటె ఎక్కు

1. ఈ సంకలనంలోని పద్యాలు చాలావరకు ఉళ్లూర్ పదవీ విరమణ చేయ డానికి ముందే వెలువడినందువల్ల న్యాయానికి దీన్ని రెండో దశకి చెందిన కావ్యంగా పరిగణించవలసి ఉంది.

వగా ప్రతి బింబిస్తూంది. 'చైత్ర ప్రభవమ్' చిత్తిర తిరునాళ్ మహారాజా చేసిన చరిత్రాత్మక మైన హరిజన దేవాలయ ప్రవే శానుమతి ప్రకటనను ప్రస్తుతించే కావ్యం. ఈ మహాకవి కలంనుంచి వెలువడిన కొద్ది భక్తి కావ్యాల్లో 'శరణాగతి' ఒకటి దీనిలో సంభావితు డైన దైవం శబరిమలలోని 'శాస్త.' బుద్ధుణ్ణి అప్రతిష్ఠ పాలు చేయజూచిన ప్రతికక్షుల యత్నాలు విఫలమై, బుద్ధుని నిజమైన ఘనత ప్రదర్శితం కావడాన్ని వర్ణించే కావ్యం 'మిథ్యాపవాదమ్'. బుద్ధుణ్ణి ఇతి వృత్తంగా గ్రహించడం మహాకవికి చాలా ఇష్టం!

తాను పదవీ విరమణ చేసిన వెంటనే వెలువడిన 'భక్తి దీపిక' బలమైన అర్థవ్యక్తి, ఆవేశ స్వచ్ఛతా గల దీర్ఘ కావ్యం. అనంతరం శంకరాచార్య స్వామికి అగ్ర శిష్యుడై పద్మ పాదాచార్యులుగా విఖ్యాతి గన్న సనందనుని జీవిత గాథ ఈ కావ్యానికి ఇతివృత్తం. ముగింపు అద్భుత మైంది. సనందనుడు తన వేదాధ్య యనంతో సాధించలేక పోయిన సిద్ధిని 'చాత్తాన్' అనే ఒక అవర్ణుడు అకృత్రిమ మైన భక్తితోనూ, సహజమైన శక్తితోనూ అనాయాసంగా ఆయనకు సమకూరు స్తాడు. ఇలాంటి చెణుకులు కొన్ని ఉన్నా, ఈ కావ్యంలో నిజమైన ప్రాశస్త్యం కొరవడింది విసుగు పుట్టించేటంత ఎక్కువగా - ముఖ్యంగా ఉత్తరార్ధంలో - మాటి మాటికి భగవద్గీతా సందేశం కొంతసేపు భక్తుడైన సనందనుని నోటా, మరి కొంత సేపు భగవానుడైన నరసింహస్వామి నోటా ఉపన్యసించబడుతుంది. ఈ దార్శనిక దృష్టి ప్రాధాన్యానికి పరిహారంగా కొంతవరకు సనందనుని వ్యక్తిగత మైన ప్రేమదృష్టి, విశ్వ సౌభ్రాత్రం పనిచేస్తయి. ఈ కావ్యపు కళా రూపాన్ని కొంతవరకు అవి నిలబెట్ట గలిగినయి. అయితే - దార్శనిక చర్చల భారాన్ని బల వంతంగా మోయవలసివచ్చి, నిర్మితి సౌష్ఠవం దెబ్బతిన్న దనే తప్పు, కళా దృష్ట్యా- ఇతివృత్త భావనలో గాని, వ్యక్తీకరణలో గాని విఫల రచన అని దీనిని త్రోసి పుచ్చడానికి వీలులేదు.

# 7. కవితా పరిపాకం

కళాత్మక రచనల్లో సంకీర్ణత అనంతంగా ఉండడం వల్ల పండిత ప్రకాండులు చేసే ఎలాంటి వర్గీకరణ ప్రయత్నాలకూ అవి లొంగవు. అందుకు కారణం కవుల వ్యక్తిగత భేదాల వల్ల అసంఖ్యాకంగా వర్గాలు ఏర్పాటు చేయవలసి రావడం. ప్రతి కవీ నానా విధ రత్నాలు పొదిగిన-రంగులో, ఆకృతిలో, నిర్మితిలో తీవ్ర వైవిధ్యం ప్రదర్శించే-ఒక కిమ్మీర పదార్థం. నానా రీతుల కదంబం అని చెప్పదగిన ఉళ్ళూర్‌ని కాల్పనిక కవి అనో, సాంప్రదాయిక కవి అనో ముద్రవేయ జూచే విమర్శకుల ప్రయత్నం అంత సులువు కాదు. కాళిదాసు, షేక్స్‌పియర్, గెథే లాంటి నిజమైన మహాకవు లందరూ పారిభాషిక వర్గీకరణ ప్రయత్నాల్ని వమ్ము చేసిన వారే! తాము కాల్పనిక కవుల మని కంఠోక్తిగా చెప్పుకున్న షెల్లీ, కీట్స్, వర్డ్స్‌వర్త్, బైరన్ వంటి వారి పద్యాల్లో కూడా సాంప్రదాయిక కవితా లక్షణాలు కొన్ని స్పష్టంగా కనిపిస్తయి. నిజానికి - సాంప్రదాయికత, కాల్పనికత అనేవి రెండు మానవ దృక్పథాలే తప్ప, విభిన్న సాహిత్య రీతులు కావు. దృక్పథం వ్యక్తిగతమైన మనో వైఖరిని సూచిస్తుంది. ఒక కవిని గూర్చిన పరిశీలనలో అతనిలోని విభిన్న ధోరణుల నేకీకరించే విలక్షణమైన దృక్పథాన్ని గుర్తించడం ముఖ్యం. ఒక కవిని ఒకానొక ప్రత్యేక కవితోద్యమ సభ్యుడుగా అంగీకరించడంవల్ల అతని కవితా వ్యక్తిత్వ రహస్యం మనకు అవగాహన కాదు.

సాంప్రదాయిక ప్రవృత్తిని పెంపొందించేందుకు అనుకూల మైన వాతావరణంలో ఉళ్ళూర్ పుట్టి పెరిగారు. పుట్టిన కులం, సంక్రమించిన ఔరస ధర్మం, చదువుకున్న చదువు, చేసిన సాహితీ స్నేహాలు, పొందిన కవితా శిక్షణ, చేసుకున్న అలవాట్లు – ఇలా ఆయన జీవితంలోనూ, పెంపకంలోనూ ఎన్నో అంశాలు ఆయనను సంప్రదాయ మార్గం వైపుకి బలంగా ఆకర్షించినయి. అయితే – మానవ జీవితానికి సంబంధించిన తర్కం ఎప్పుడూ సరళంగా సాగదు. అంతర్గతంగా ఉన్న సాంప్రదాయిక దృక్పథానికి విరుద్ధమైన లక్షణాలు కొన్ని స్వతస్సిద్ధంగానే ఆయనలో నెలకొని ఉన్నాయి. విశ్వజనీన ప్రేమకూ, సర్వమానవ సౌభ్రాత్రానికీ తలుపులు తెరిచి స్వాగతం పలికే సహజమైన పర హిత కాంక్షా స్వభావం ఉళ్ళూర్‌లో ఉన్నట్టు ఇంతకు ముందే మనం గమనించాము అదీ కాక, తమ కేరళ దేశం అన్నా, మలయాళ భాష అన్నా, తమ సాహిత్యం అన్నా వల్లమాలిన

ప్రేమ ఆయనకి. మాతృదేశం పట్లా, దేశీయమైన సనాతన సంస్కృతి పట్లా గల ఆకర్షణకు కూడా ఆయన దాసోఽహం అన్నారు. సాంప్రదాయిక మైన మహా కావ్యాల్లో అరుదుగా కనిపించే తీవ్రమైన ఆత్మార్పణ భావంతో 'ఉమా కేరళమ్' లో ప్రగాఢమైన కవి స్వీయ భావాలనే ప్రతి ధ్వనిస్తూ ఒక దేశ భక్తుడు మాతృదేశాన్ని ఉద్దేశించి భక్తి భరితంగా 'ఎన్నటికి నేను ఈ దేశంలోనే తిరిగి తిరిగి జన్మింతును గాక!' అని ఈ క్రింది విధంగా ప్రార్థించడం మనకు కనిపిస్తుంది :

"ధరణి పునర్జన్మ తప్పద యేని
జన్మింతు గాక నీ చల్లని యొడినె!
నీ పదపీఠి సన్నిధిలోనె శాంతి
ఒగి ముక్తి గనుదాక ఓ దేశ మాత!
పరదేశమున నేను బ్రదుకలే నమ్మ!"

సంప్రదాయ ప్రవణము, దృఢము అయిన మనోధర్మాన్ని నేరుగా సవాలు చేసే కాల్పనిక మనోధర్మాలు కొన్నిటిని పక్కపక్కనే ఈ కావ్యంలో మనం చూస్తాము. సుదీర్ఘ కాలం సాగిన మానసిక సంఘర్షణల, సర్దుబాట్ల అనంతరం ఈ విరుద్ధ మనోధర్మాల మధ్య సమన్వయం ఏర్పడడం తప్పనిసరి అయింది. ఉళ్ళూర్ కవితా జీవితంలో ఆంతరమైన ఈ సర్దుబాటు ఏ రూపం ధరించిందీ ఇప్పుడు మనం చూద్దాం!

ప్రధానంగా మహాకావ్యం రూపంలో ఉండే సాంప్రదాయిక భారతీయ రచన లన్నీ దండి, విశ్వనాథ కవిరాజు సుప్రసిద్ధమైన తమ అలంకార గ్రంథాల్లో విధిం చిన రచనా నియమాలనే పాటించినయి. వస్తువుకి సంబంధించినంతవరకు పౌరాణి కేతి వృత్తాలనూ, రాజుల ఘనతనే ఎప్పుడూ ఉగ్గడించే కథలనూ గ్రహించే ఆచారమే ఎలాంటి మార్పూ లేకుండా కొనసాగుతూ వచ్చింది. బహుళ వర్ణనలతో కూడి అనేక సర్గలలో కొనసాగె కథనం, ఆరభటీ వృత్తితో నడిచే శైలీ, అలం కారాలతో, అన్యాపదేశాలతో నిండిన భాషా – ఇవి మహాకావ్య స్వరూపాన్ని నిర్ణ యించే లక్షణాలు. సంస్కృత సాహిత్య చరిత్రలో స్వర్ణయుగం, క్షీణయుగం కూడా గడిచిన తర్వాత, చాలా ఆలస్యంగా ఆరంభమైన ప్రాంతీయ భాషా సాహిత్యాల్లో సంస్కృత మహాకవులు మాఘుడు, భారవి, శ్రీహర్షుడు మొదలైన వారి రచనల

ననుకరిస్తూ వ్రాసిన కావ్యాలు 'నవ-సంప్రదాయ' (neo - classical) సాహిత్యం పేరుతో వెలుగు చూసినయి.

ఈ సాంప్రదాయిక మైన పూర్వ రంగంతో వెలసిన ఉళ్ళూర్ 'ఉమా కేరళమ్' నిస్సందేహంగా ఒక 'నవ-సంప్రదాయ' మలయాళ మహాకావ్యం ఈ కారణం వల్లనే ఆ మహాకావ్యానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో కేరళవర్మ ఈ కావ్యాన్ని ఇలా ప్రశంసించారు: "మూర్తికల్పనా విస్పష్టతలో, భావనా వైభవంలో, జిలుగు పనిలోని హృదయంగమత్వంలో పరమేశ్వరయ్యర్ వ్రాసిన సుదీర్ఘమైన సర్గలు గల ఈ మహాకావ్యాన్ని సంస్కృత సాహిత్యంలో సువిస్తృతమైన శ్రీహర్షుని 'నైషధీయ చరితమ్' తో సరిపోల్చడం అనుచితం కాదు; అలా సరిపోల్చినప్పుడు దానికి ఈ కావ్యం ఏ విషయంలోనూ తీసిపోదు." అయితే–సంస్కృతాలంకారికులు విధించిన నియమాలను తు, చ తప్పకుండా పాటిస్తూ ఈ కావ్యంలో పుష్కలంగా ఉన్న పలు మెలికలు తిరుగుతూ, విసుగు పుట్టిస్తూ సుదీర్ఘంగా సాగే ఋతు, నగర సముద్ర, సూర్యోదయ, సూర్యాస్తమయ, యుద్ధ, విరహాది వర్ణనల్ని ఆధునిక కాల్పనిక కవితా ప్రియులు హాస్యాస్పదాలుగా పేర్కొంటున్నారు. ఉళ్ళూర్ సమకాలికుడైన వివేచన దృష్టి గల ఒక పాఠకుడు సూత్రప్రాయంగా పేర్కొన్నట్టు "ఉమా కేరళమ్ అంత సుదీర్ఘం కాకపోతే మరింత ఆస్వాద్యతరంగా ఉండేది"[1] ఈ కావ్యానికి చెప్పే మరొక అభ్యంతరం ఏమిటంటే—దీనిలోని క్లిష్ట సంస్కృత పదాలూ, సుదీర్ఘ సమాసాలూ సామాన్య పాఠకుణ్ణి బెదరగొట్టి, కావ్యం చదువకుండా తరిమి వేస్తున్నయి-అని. మృత్యు ముఖంలో ఉన్న ఒక పాత్రచేత 'విందు'కి, 'యుద్ధరంగాని'కి మధ్య శ్లేషని సాధింపజేస్తూ ఈ కవి ప్రదర్శించిన శబ్ద వైచిత్ర్యం ఈ కావ్యంలో ఈ విధంగా కనిపించే అనౌచిత్యాలకు ఒక తార్కాణం![2]

---

1. ఓ. ఎమ్. తామస్ 'Under the knife' (ద్వితీయ ముద్రణం), పుట. 132
2. అయిదో సర్గలో ఒక విందు సందర్భంలో ఆదిత్యవర్మ మహారాజుకి శత్రువులు విషం పెట్టినప్పుడు ఆ రాజు వరుసగా మూడు పద్యాల్లో పరస్పర సంబంధం లేని రెండేసి అర్థాలు గల మాటలు వాడుతూ శ్లేషతో మాట్లాడుతాడు ఉదాహరణకి – నీరు, మొండెం అని రెండర్థాలు ఉన్న 'కబంధ' శబ్దం సహాయంతో ఈ 'విందు యుద్ధరంగం కాదు గదా ?' అని శ్లేషిస్తాడు. అలాంటి మరి పన్నెండు శ్లేషలు కూర్చ బడిన ఆ సందర్భం పాఠకుణ్ణి ఎంతగా హడల గొట్టగలదో ఊహించుకో వచ్చును. ఆ శ్లేషల్లో ఆ విందుని చెరువు, ఒక సుందరి మెడ, కావ్యం మొదలైనవాటితో ఆయన పోలుస్తారు.

కాని అక్కడక్కడ కొన్ని చమత్కారాలు చేసి, సజీవమైన ఆధునికయుగం తాలూకు మానవత్వ లక్షణాలు ప్రవేశపెట్టి కావ్యంలోని అనూచానమైన 'నవ-సంప్రదాయ' వాతావరణాన్ని కొంత వరకు మార్చివేయడంలో ఆయన కృతకృత్యులు కాగలిగారు. ఈ విధమైన, సూక్ష్మమైన కళాత్మక స్వర్ణయోగ ప్రక్రియతో పఠన యోగ్యతా, శాశ్వతత్వం గల ఏకైక మలయాళ మహాకావ్యంగా ఆ కావ్యాన్ని ఆయన తీర్చి దిద్దగలిగారు.

మహాకవి ఈ కవితా పరిపాకాన్ని ఎలా సాధించారు? సాంప్రదాయిక కావ్యాలు దేవతల చుట్టూ, లేదా శృంగార, వీర రసనాయకులైన మహారాజుల సాహస గాథల చుట్టూ సాధారణంగా పరిభ్రమిస్తూ ఉంటయి వర్జిల్ మహాకవి తన 'ఇనీయిడ్' కావ్యంలో నాయక పాత్రకి, లాటియమ్ యొక్క, రోమన్ జాతి యొక్క భవితవ్యానికి అవినాభావ సంబంధం కల్పించినట్టు మన మహాకవి నాయకుడైన రాజుమీద నుంచి దేశంమీదికి దృష్టి మళ్ళించి మాతృదేశాన్ని ప్రధాన లక్ష్యం చేశారు.

భారవి, మాఘుడు మొదలైన కవుల ఒరవడిలో మంగళప్రదంగా 'శ్రీ'కారంతో[1] తన కావ్యాన్ని ప్రారంభించి నప్పటికీ, వెంటనే కాల్పనిక మహాకవులు షిల్లర్, స్కాట్‌ల ధోరణిలో కేరళ వైభవ వర్ణనకి పూనుకుంటారు. గతంలో సంప్రదాయ బలంవల్ల ఆయన రాజస్తుతి కావ్యాలు వ్రాయవలసి వచ్చినా, 'ఉమా కేరళమ్'లో మాత్రం నాయకుడైన రాజుకి, మాతృదేశ వైభవానికి అభేదాధ్యవసాయం సాధించడానికి మహాకవి పూనుకున్నారు. ఉమయమ్మా రాణి మొగల్ సైన్యాల్ని ఓడించిన సందర్భంలో రాజవంశ ప్రశస్తిని గాక గ్రామీణ స్త్రీలు కేరళ దేశ స్తుతి గీతాలు గానం చేయడంలో ఈ పరిణామం స్పష్టంగా గోచరిస్తూంది. కవి స్తోత్ర విషయంలో వచ్చిన ఈ మార్పు కేరళ వైభవాన్ని ప్రస్తుతించే 29 పద్యాల్లో బాహాటంగా కనిపిస్తూంది. స్వాప్నిక మైన, స్పందన శీల మైన వాతావరణంతో కూడిన ఈ పంక్తుల్లో సున్నితమైన, మృదువైన దేశభక్తి భావ చ్ఛాయలు కనిపిస్తయి. ఉజ్జ్వల మైన భావగీతి ధోరణిని ఈ క్రింది పంక్తుల్లో గుర్తించవచ్చు :

---

1. భారవి కృత కిరాతార్జునీయమూ, మాఘ కవి విరచిత శిశుపాల వధా శుభప్రదమైన 'శ్రీ'కారంతోనే ఆరంభ మవుతయి. అది మంగళ ప్రదం.

"ప్రాగ్దిశ మహోన్నత నగమ్ము, పశ్చిమమున
నిరుపమా నాంబురాశి - రెంటికిని నడుమ
సిరుల వాగుల కలిమి భాసిల్లు 'వంచి!'
భరత మాత కటి నిబద్ధ వార్ధి మేఖ
లను పొదిగిన మనోజ్ఞమౌ రత్న మీవు!
నింగి నంటు నిభృత ధరణీరుహాల
చల్లనౌ నీ మహాటవుల్ తొల్లి కాళి
దాస మేఘ దూత క్రమింప దగిన బాట!"

ఇలాంటి భావావేశం, ఆత్మీయతా భావం కవి మనస్సుని ఆవహించి నప్పుడు ఆయన పదజాలం మరింత మధురంగా సరళంగా సాగుతుంది. ఆయన కల్పనలు ఆలంకారికులు నిర్వచించిన అలంకారాలు కావు. అంతశ్చేతన నుంచి వెలువడిన అతి మృదుల మైన గుసగుసలు!

ఎనిమిదో సర్గలో నిర్దాక్షిణ్యంగా తన కుమారులు వధింపబడినందుకు రాణి చేసే విలాపంలో భాషాగత మైన లాలిత్యానికీ, భావ ఝుటితి స్ఫూర్తికి మరికొన్ని ఉదాహరణలు కనిపిస్తాయి. సాంప్రదాయికతకీ, కాల్పనికతకీ మధ్య కని పించే ప్రధాన భేదం పడికట్టు విధానానికీ, సహజమైన మార్దవానికీ మధ్య గల భేదమే కనుక అయితే, ఆడంబరమైన సాంప్రదాయిక మహాకవి ధోరణినుంచి విడి వడి, రెక్కలపై తేలిపోయే కాల్పనిక గాయకుడుగా పరిణమించడానికి మొట్ట మొదటి సారిగా 'ఉమా కేరళమ్' లోనే ఉళ్ళూర్ తీవ్రంగా ప్రయత్నించారు. నిదానంగా సాగిన సాహసికమైన ఈ కాయకల్ప ప్రక్రియలో బహుశః తనకి తెలియకుండానే మలయాళ సాహిత్యం ఆధునికతా గేహాళి చేరుకునే లోపుగా ఏ ఏ దశల నధిగమించిందో ఆ దశ లన్నిటినీ ఆయన జీవించినట్టు కనిపిస్తుంది. కవితా ప్రయోగాలను ఎంత శ్రద్ధగా ఆయన కొనసాగించిందీ, వాటిలో ఎలాంటి ఘన విజయాలను ఆయన సాధించిందీ ఆయన అనంతర రచనలు విశదం చేస్తున్నాయి.

ఉళ్లూర్ వ్రాసిన పెద్ద కావ్యాల్లో 'కర్ణ భూషణమ్' కధా కావ్యమే! అయినా, నాటకీయత, భావావేశం, కాల్పనికత మొదలైన వివిధాంశాలతో నానా వర్ణ రంజితమై ఆ కావ్యం చవు లూరిస్తూంది. అది ఆయన కవితా ప్రతిభకు చేకూరిన గొప్ప విజయం. కొందరు విమర్శకులు అంటున్నట్టు కేవలం కవియొక్క పురాణ పాండి

త్యాని ప్రదర్శించేందుకు ఉద్దిష్టమైన ఒక పురాణ కథా పునః కథనం కాదు అది. ఆ కావ్యం 'మున్నుడి'లో కవే వివరించి ఉన్నట్టు - వంగ సాహిత్యంలో జరిగిన అలాంటి ప్రయోగాల వల్ల ఉత్తేజితుడై ఒక ప్రాచీన గాథను ఒక నిర్దిష్ట ప్రయోజనాన్ని ఉద్దేశించి తిరిగి చెప్పడానికి దానిలో ఆయన పూనుకున్నారు. మహాభారత వీరుడైన కర్ణుని శీవి వల్లా, ఔదార్యం వల్లా ఉద్భూతం అయ్యే అద్భుత రసావేశంతో పాఠకుల్ని చకితుల్ని చేసే కావ్యం అది. అనాథగా పుట్టి, సూత పుత్రుడుగా పెరిగి, రాజధర్మం నుంచి వెలివేయబడినా, రాజధర్మాల్లో రాజవంశంలో పుట్టి పెరిగిన రాజకుమారు లందరినీ ఆయన తలదన్నాడు. ఇందువల్ల కలిగే అద్భుతమే ఈ కావ్యంలో అంగిరసం. ప్రాచీన భారత దేశ వైభవం పట్ల కనిపించే గౌరవంలో వ్యంగ్యంగానూ, మాతృదేశపు ఘనత వెల్లడిచేస్తూ జీవించిన కర్ణుని త్యాగం పట్ల ప్రశంసా భావంలో వాచ్యంగానూ ఈ రసం వ్యక్తం అవుతూంది. ఒక వ్యక్తి తన జాతీయ పురాణ గాథల ద్వారా ఆత్మలాభం పొందడం, తన జీవితంలో తాను చేసిన మహా త్యాగానికి ఆ గాథల వల్ల ఉత్తేజితుడు కావడం సాంప్రదాయిక కవితా సహజమైన లక్షణం కాదు. అది కాల్పనిక కవితా విశిష్ట ధోరణే! కాల్పనిక వ్యక్తి పైకి ఆత్మని కోల్పోతున్నట్టు కనిపిస్తూ ఆత్మలాభం పొందుతాడు. జీమూత వాహనుడు, దధీచి, శిబి వంటి వదాన్యుల ఉత్తేజక గాథలతో కూడిన గత కాలీన వైభవ స్మృతులు కర్ణుణ్ణి ముంచెత్తి తల్లక్రిందులు చేస్తాయి. అప్పు డతనికి జ్ఞానోదయం అవుతుంది - వెనుకటి ఆదర్శప్రాయులైన మహామహు లందించిన వారసత్వాన్ని మరింత సంపన్నం చేయడంలో తానొక సాధనం కావలసి ఉంది అని. స్వజాతీయ పూర్వవైభవం వెలుగులో అలా అతడికి ఆత్మ సంవేదన కలుగుతుంది. ఆ సందర్భంలో ఆశా భావంతో కర్ణుడు ఇలా ఉద్ఘాటిస్తాడు :

"అమరుల వనమ్ము నందనోద్యాన మికను
ముండ్ల దుబ్బులు పెరిగి సొంపు చెడలేదు!
తరుణ సింహ వసతి పర్వత గుహ ఇకను
ఎలుకల బొరియగ పరిణమింపలేదు!"

గతకాలం నుంచి పొందే ఉత్తేజనం, వర్తమాన కాలంలో ఎదురయ్యే బాధ్యతలూ - రెండూ ఏకమైనప్పుడే వ్యక్తి తన అంతర్నిహిత శక్తుల్ని సంపూర్ణంగా సాక్షాత్కరించుకో గలుగుతాడు.

'పింగళి' కూడా జాతీయ సంప్రదాయం పూర్వ రంగంగా ఆత్మావగాహన చేసికొన యత్నించే సమస్యకి సంబంధించిన కావ్యమే! అయితే — ఒక తేడా ఉంది. ఈ కావ్యంలో ఆత్మ సంవేదన కోసం ఆరాట పడే వ్యక్తి పాప కూపంలో పడి ఉన్న ఒక సాధారణ వేశ్య; క్షత్రియ యోధుడు కాదు. పురుషులతో తాను అనుభవించే కామభోగాలు గాని, వా రిచ్చే ధన ధాన్యాదులు గాని తన హృదయాంతరం లోని శూన్యాన్ని పూరింప జాల వని నాయిక గుర్తిస్తుంది పాప ప్రాయశ్చిత్తం ద్వారా ఆమె సాధించిన ఈ అవగాహన ఇటు మృత్యువునీ, అటు అమరత్వాన్నీ కూడా చేకూర్చే ఉజ్జ్వల భావికి దారి తీస్తుంది. విటుల రాకకోసం చూసి చూసి ప్రాణం విసిగి ఉన్న క్షణంలో ఉన్నట్టుండి రాములవారి పటం కింద పడే నాటకీయ సంఘటన కల్పించిన కవి భావన ఈ సన్నివేశానికి జాతీయ పూర్వ రంగాన్ని కల్పించింది. ఆ అనుకోని సంఘటన - భారతీయ సాహిత్యంలో ప్రతిపాదించబడిన ఆదర్శ స్త్రీ మూర్తి, పరమ పతివ్రతా అయిన సీత కథని ఆమెకి గుర్తు చేస్తుంది, తర్వాత కవి తన కాల్పనిక భావనతో రోజూ మన చుట్టూ జరిగే ఎన్నో పరిణామాలను వర్ణించి, కథకి విశ్వజనీన మైన పూర్వరంగం కూడా కల్పిస్తారు :

"గడ్డి రేకు తుది మంచు బిందు వది
ఉదయ భాను కిరణాల కౌగిలిని
ఇంద్ర ధనువు వలె ఇంపు నింపులే!
కాని, నిముస మటు మెరసి అంతలో
గాలిలోన అది కలసి పోదటే ?
ఓసి నా తనువు సొగస! ఎరుగవే?"

అయితే - 'కర్ణ భూషణమ్' నుంచి 'పింగళి' దాకా వచ్చే సరికి ఉమర్ తన కవితా లక్ష్యంగా నిర్ణయించుకున్న కాల్పనిక కవితా పరిపాక ప్రక్రియ కొంత దెబ్బతిన్నట్టు కనిపిస్తుంది. వస్తువుని ఎంచుకోడంలోనూ, శైలిని మలుచుకోడంలోనూ 'పింగళి' కావ్యంలో ఎలాంటి లోపం లేదు. కాని, ఔచిత్యం, సౌష్ఠవం అనే ఆలంకారిక లక్షణాలు దీనిలో కొరవడినయి. కావ్యంలో సగం భాగం నాయిక తాను గడిపిన నికృష్ట జీవితాన్ని సవిమర్శకంగా పర్యాలోచన చేసుకోడం, నూతన జీవితం గడపా లని సంకల్పించుకోడం - వీటితోనే సరిపోతుంది. ఇందులో ఆత్మ విచారానికి కొంత ప్రాధాన్యం కన్పిస్తున్నా, పునరుక్తులతో, నిరర్థక వాక్యాలతో,

విసుగుపుట్టించే వర్ణనలతో, ప్రాచీన భారత వైభవాన్ని గురించి కవి చేసే ఆడంబరమైన ఉపన్యాసాలతో ఈ కావ్యంలో ఆమె పశ్చాత్తాపం మరీ సుదీర్ఘంగా సాగింది. మహాకావ్య కర్తలు నమ్మిన 'పుణ్యై ర్యశో లభ్యతే' అనే సూక్తిని ఉళ్లూర్ మళ్ళీ గుర్తు చేసుకున్నట్టు ఈ కావ్యం సూచిస్తూంది.

కథాత్మకమైన చిన్న చిన్న కాల్పనిక కావ్యాల్లో ఉళ్లూర్ సాధించిన సిద్ధి విస్మయావహం. హీర, కపీర్‌దాసన్, అంపలక్కుళమ్ (గుడి కోనేరు), అయిత్తమ్ (అస్పృశ్యత), కళ్లనై పునర్జన్మమ్ (చోరుని పునర్జన్మ), మాఱు (తప్పుకో!), ప్రాయోపవేశమ్ మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. చరిత్రనుంచీ, పుక్కిటి పురాణాల నుంచీ, సమకాలీన సాంఘిక సన్నివేశాలనుంచీ గ్రహించిన ఇతివృత్తాన్ని వాటిలోని నాటకీయావకాశాలనూ, భావావేశ లక్షణాన్నీ దృష్టిలో ఉంచుకుని ఈ కావ్యాల్లో ఆయన ప్రతిపాదించారు. ఇలాంటి కావ్యాలకి ప్రతినిధి అనదగిన 'హీర' వీటిలోని గుణాల్నీ, దోషాల్నీ కూడా ప్రకటిస్తూంది. రాణిగారి బిడ్డని కాపాడే యత్నంలో ఒక నర్సు సాహసంగా ఆత్మబలిదానం చేయడం ఇందులోని ఇతివృత్తం. నాటక పద్ధతిలో ఆరంభమై, విషాద భరితంగా నడుస్తూ, అనుకోని కొస మెరుపుతో ఈ కావ్యం ముగుస్తుంది.

'కర్ణ భూషణమ్'లో ఉళ్లూర్ సాధించిన ఘన విజయం పునశ్చరితం కావడం మళ్ళీ ఆయన ఖండ కావ్యాల్లో కనిపిస్తుంది. ఒక విమర్శకుడు అన్నట్టు - "అల్పాక్షరాలలో అనల్పార్థ భరితాలు" [1] ఈ ఖండికలు. అలాంటి పద్యాల్లో మణిపూసల్లాంటివి: ఐక్యగాథ, ప్రేమ సంగీతమ్, భావనా గతి, విచార ధార, తుంపపూవు, బాలాంకురమ్, ఒరు మఴత్తుళ్ళి, అన్నుమ్-ఇన్నుమ్, సుఖమ్, సుఖమ్, పూంపాట్టయోడు (సీతాకోక చిలుకతో). కాల్పనిక కవిత అనే బహు వర్ణ రంజితమైన ఇంద్ర ధనుస్సులాంటి శోభ ఉళ్లూర్ కవితాకాశంలో ఈ ఖండ కావ్యాల్లోనే ఎక్కువగా అభివ్యక్తం అవుతూంది. మత్తేభ మంద గమనం పూర్తిగా పోయి, నిర్నిబంధమైన విహంగ యానం వాటిలో కనిపిస్తూంది.

నిడివి, వస్తువు, కల్పనలు, పదజాలం విషయంలో ఉళ్లూర్ కావ్య పరంపరలో 'ఐక్య గాథ' నిరుపమాన మైంది. కాల్పనిక కవిత దిక్కుగా సాగించిన

---

1. ఏ. డి. హరిశర్మ, ఎం. ఓ. జోసెఫ్ లు మలయాళ భాషలో వ్రాసిన మహాకవి జీవిత చరిత్రకి ఆచార్య డి. పద్మనాభన్ ఉన్ని వ్రాసిన ఇంగ్లీషు ఉపోద్ఘాతంలో ఈ మాట అన్నారు: "They hold infinite riches in little space."

ప్రస్థానంలో ఆయన చేరుకో గలిగిన కడపటి మైలురాయి అది. తన చుట్టూ ఉన్న ప్రకృతి తాలూకు శ్రవ్యాశ్రవ్య మైన గుసగుసలనుంచి విశ్వ సమానతా సందేశాన్ని కవి మనకు వినిపిస్తారు - మధురమైన, సంక్షిప్తమైన, ఘుటికా ప్రాయమైన ఈ కావ్యంలో! 'ప్రేమ సంగీతమ్' అనే ఖండికకూ 'విశ్వప్రేమే' విషయ మైనా ఇంతకంటె ఉదాత్త స్థాయిలో అది సాగింది. అమీబా నుంచి సుదూర తార దాకా ఉన్న లయాత్మకమైన ఈ అద్భుత సృష్టి నంతటినీ తనలో ఇముడ్చుకునే గేయ రూపం దాల్చిన దర్శనం అది. కాల్పనికమైన మేధకి ఉండే అనంత మైన సారళ్యం ఆ ఖండిక ప్రతి పాదంలోనూ స్పందిస్తూంది. ప్రేమ సాక్షాత్కార పారవశ్యంతో విశ్వ సృష్టిలోని విరుద్ధ ధ్రువాలను ఆలింగనం చేసుకున్న కావ్యం అది. ఉళ్లూర్ భావ గీతాలలో అది ప్రశస్త మైన దని విమర్శకులు ఏకగ్రీవంగా అంగీకరించారు.

జూల్స్ వెర్న్ (ఫ్రెంచ్ నవలా రచయిత, 1828-1905) లాగ భవిష్యత్తు తెర చించి చూడడానికి నిర్నిరోధంగా యత్నించే మానవ మేధ యొక్క భావనా యథేచ్ఛా విహారం 'భావనా గతి' లో కనిపిస్తుంది. ఆ విహార ఫలితంగా పరమాణువు మొదలు మహా విశ్వం దాకా గల సర్వ రహస్యాలూ కవి మనో నేత్రం ముందు సాక్షాత్కరించినయి అత్యాశ్చర్యకర మైన ఈ మహా విశ్వపు అనంతత్వాన్ని ఇంత సజీవంగా ప్రతిపాదించిన కావ్యం మలయాళ సాహిత్యంలో మరొకటి లేదు. మానవుడు ఒక నాడు చంద్ర మండలం మీద పాదం మోపుతాడు అని జోస్యం చెప్ప గలిగిన కవి భావనా శక్తిలో ఈ కావ్యపు మౌలికతని మనం గుర్తించవచ్చు!

కుల తత్త్వం ఇతి వృత్తంగా వెలువడిన ఉత్తమ మలయాళ కావ్యాల్లో ఉళ్లూర్ 'విచారధార' ఒకటి. ఒక తల్లి తమ వైపు వస్తున్న ఒక హరిజనస్త్రీని తన బిడ్డకి వర్ణించి చెప్పినట్టూ, తత్ఫలితంగా కృత్రిమమైన కుల మత భేదాలు పరిహరించా లనే మరపురాని పాఠం ఆ బిడ్డ నేర్చుకున్నట్టూ చేసిన కల్పన నాటకీయంగానూ, ఆసక్తి జనకంగానూ ఉంది.

బ్రహ్మాండమైన పొగడ్తలూ, తీవ్రమైన తెగడ్తలూ కూడా అందుకున్న మలయాళ కావ్యాల్లో 'ఒరుమళ్తుళ్ళి' ఒకటి. 61 పద్యాల్లో ఒక వాన చినుకుని సంబోధిస్తూ చెప్పిన ఖండ కావ్యం అది. ఆర్భాటంగా కూర్చిన అలంకారాలతో వాన చినుకు కుంభవృష్టిలోకి తరిమి వేయబడిం దని ఈ కావ్యాన్ని గూర్చి సాధారణంగా చేసే ఆక్షేపణ. కల్పవృక్షపు మొగ్గగా, అమృతపు బొట్టుగా వాన చినుకుని

ఉత్ప్రేక్షిస్తూ ఆర్భాటంగా ఈ కావ్య రచన సాగిం దని విమర్శకులు దీన్ని గర్హించారు. కాని, సాంప్రదాయిక కవితా మార్గాన్ని దుయ్య పట్టడానికే అల వాటు పడ్డ ఈ విమర్శకులు దురదృష్ట వశాత్తు కావ్యంలోని వాస్తవిక మైన 'కాల్ప నిక' హృదయం దర్శించలేక పోయారు. కావ్యం ఆరంభంలో ఉత్ప్రేక్షా బహు ళంగా సాగింది 'అవతారికా' భాగం మాత్రమే! ముసురు వాతావరణాన్ని సూచిస్తున్న ఆ భాగం ప్రధాన కావ్యానికి కేవలం పూర్వరంగం మాత్రమే! వాన చినుకుని సుఖమయ మైన తన అమృత శయ్యనుంచి లాగి అపరిచితమైన భూమి మీదికి విసరివేసి నందుకు కవి దుఃఖపడుతున్న ఈ కావ్యంలో అంతర్లీనంగా కని పించే కరుణ భాగాన్ని విమర్శకులు గుర్తించలేక పోయారు. నిరంతరాయంగా వియోగ దృశ్యాలే చుట్టూ ఎదురయ్యే ఈ జగత్తులో కాల్పనిక కవి హృదయంలో రగిలే ఆరని వేదన ఇది. ఈ వేదననే హృదయంగమంగా ఇలా చిత్రిస్తారు రవీంద్రులు:

"అద్భుతము! విభుని విర
హార్తియే వ్యక్తమగు
నహ రహము భువన భువనముల!

క్ష్మాధ రారణ్యముల
సాగ రాకాశముల
గందు మదె వేయి చందముల!

నిశి తార కానిమిష
నీర వాలోకముల
నీకై నిరీక్షించు నదియె!

వర్షాంబువులు పత్ర
పల్లవములకు వినుచు
భావగీ తాలాప మదియె!"[1]

ఉళ్లూర్ ఈ కావ్యంలో రవీంద్రుని భావనకి ఎంత దరి దాపులకు వచ్చారు? తల్లి అయిన మేఘం ఒడినుంచి వాన చినుకు జారిపడే ఘట్టం వర్ణించి, తన బిడ్డ కోసం మేఘం ఆకాశంలో తల్లడిల్లి పోతున్నట్టూ, మెరుపుల్లో ఆ తల్లి చేతి గాజులే మెరుస్తున్నట్టూ చేసిన వర్ణనలో కరుణ రసం పరాకాష్ఠను పొందింది:

1. గీతాంజలి – 84 వ గీతం – తెలుగు సేత: బి. వి. సింగరాచార్య.

"మెరుపు గాజుల తోడి నీ కరము లెత్తి
సాగె దెచటికి ఓసి ఆషాఢ జలద!
బిడ్డ లెల్ల పోయిరి - దోచివేసె నిన్ను
కాల మను గజదొంగ సమూలముగను!"

అయితే - లోకంలో దుఃఖం కలకాలం నిలువదు. ఎంత చిన్న త్యాగమైనా ఫలితం లేకుండా వృథా పోదు. వియోగ క్షణంలో దుఃఖ భారంతో విలవిల్లాడి పోయినా, తాను ఆత్మహాని చెందడంవల్ల భూమికి సారం, మనిషికి సస్య సమృద్ధీ కలిగి, తన జీవితం చరితార్థం అయినట్టు త్వరలోనే ఆ వాన చినుకు గుర్తిస్తుంది.

ఇటీవలి ఒక విప్లవ కవి ధోరణిలో ప్రేమ ద్వారానే సర్వ జన సుఖం సాధించగల మనీ, ఏకాంతంగా తపస్సు చెయ్యడంవల్ల మనిషికి శాశ్వత నిర్వాణం కలుగుతుం దనే ప్రాచీన భావన తప్పనీ వినూతన సందేశాన్ని చాటే కావ్యం 'సుఖమ్, సుఖమ్'. దైన్యంతో తన చుట్టూ ఎందరో జనం చేసే ఆక్రందనలు పట్టించుకోకుండా వారికి దూరంగా తన ఆశ్రమంలో ముక్కు మూసుకుని ధ్యానం చేసే తపస్వి అంటే ఆయనకి గల తీవ్రమైన ఆగ్రహాన్ని ఈ క్రింది పంక్తులు ప్రతి ధ్వనిస్తున్నయి :

"లెక్క లేనన్ని జీవులు దిక్కులేక
నరక సదృశమౌ బ్రదుకుల నవయు చుండ
ఏమి బాముకో దలచె నా ఋషివరుండు -
తన కొకనికె ముక్తిని గోరి తపము చేసి?"

ద్రుత గతిలో నడిచే ఒక సంస్కృత చ్ఛందస్సులో సాగిన ఈ పద్యం తుపాకి గుండులాగ పేలి పాఠకుని మనస్సుని త్రచ్చి, భావనా తరంగాలు వ్యాపింప జేస్తుంది.

పై పద్యంలోని విప్లవ స్ఫులింగాలు 'అన్నుమ్ - ఇన్నుమ్' అనే ఖండికలో మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తయి, తన ప్రాచీన వైభవంతో పోల్చి చూస్తే ఆధునిక భారతదేశం ఎంత నికృష్టమైన హీనస్థితికి దిగజారి పోయిందీ వ్యంగ్యంగా పరిహసించే భావ గీతం ఇది. గత వైభవ స్మృతి అనే ఈ ఇతివృత్తం మహాకవికి చాలా ఇష్టమైంది, తిరిగి తిరిగి ఆయన రచనల్లో కనిపించేది. ధారాళమైన నడక, తీవ్రమైన ధార! 'తుంప పూవు' అన్యాపదేశంగా నిరాడంబరమైన మనిషి జీవితంలోని అందాన్నీ, స్వచ్ఛతనీ నిరూపిస్తుంది. కాని, అలాంటి జీవితం సాధారణంగా

ప్రజలచేత ఉదాసీనంగా చూడబడుతూందే అని కవి కించపడతాడు. మరొక అన్యాపదేశ కావ్యం 'బాలాంకురమ్'. నిరాడంబరంగా ఆరంభమయ్యే జీవితం క్రమంగా మానవ సేవవల్ల ఎలా పరిణతి సాధించేదీ ఈ కావ్యం చిత్రిస్తూంది.

సంక్షిప్తత, నిరాడంబరత, ఆశు లక్షణం, మాధుర్యం, శ్రావ్యత అనే లక్షణాలలో 'ఐక్యగాథ'తో పోటీపడగల ఖండ కావ్యం 'పూంపాట్టయోడు'. ఆంగ్ల కాల్పనిక మహాకవుల సత్సంప్రదాయంలో ఉళ్ళూర్ అందమైన ప్రాకృతిక జీవి సీతాకోక చిలకను సంబోధించి, కాల్పనికతా లక్ష్యాలైన మాధుర్యం, కాంతి దానికి ఆపాదిస్తారు. క్షణిక జీవితంలో సాధించే ఆనందం, సౌందర్యం పరాకాష్ఠ చెందిన ఆ సీతాకోక చిలుకతో పోల్చి చూస్తే భూలోకంలోని ఎంత శక్తిమంతులైనా తీసికట్టే! ఆ కావ్యంలో నుంచి మచ్చుకి రెండు పద్యాలు:

"గాలి ఓడ పైన గగనాన విహరింతు
వస్మదీయ హృదిని హర్ష మొదవ
బ్రదుకు ఖేల నీకు భాగ్యశాలివి నీవు
ఆయు వొక్క రోజె అయిననేమి?

పచ్చని పొదరిండ్ల పాన్పుపై శయనించి
కను మరుగయినావొ క్షణము సేపు
అఖిల సాక్షి రవియు ఆకాశ మార్గాన
నిన్ను కనక అట్టె నిలిచి చూచు!"

జననం, శిక్షణ సాంప్రదాయిక మార్గానికి చెందినా స్వతస్సిద్ధమైన జీవకారుణ్య ప్రవృత్తివల్లా, తన కాలం నాటి ఆవశ్యకతలకు ఆవేశంతో ప్రతి స్పందించగల సామర్థ్యంవల్లా తన ప్రతిభ నాచ్ఛాదించిన సాంప్రదాయికత అనే పెంకును చీల్చుకుని సర్వాంగ సౌష్ఠవ మైన మలయాళ కాల్పనిక కవిగా రూపొందిన ఉళ్ళూర్ జీవిత సంఘర్షణల్నీ, ఆయన సాధించిన అంతిమ విజయాన్నీ మన మనో నేత్రం ముందు ఇంతవరకూ సందర్శించాము. ఆయన సాంప్రదాయిక దృక్పథం, శైలీ కాల్పనికతా ప్రీతివల్ల సరళీకరించ బడడం నిజంగా అద్భుతమైన విషయం. తత్పర్యవసానంగా ఆయనలో పొడసూపిన సాంప్రదాయక - కాల్పనిక లక్షణాల సమరస సమ్మేళనం కొత్త అందాలను సంతరించుకుంది. విశ్వకర్మ తన కుమార్తెను సూర్యుడి కిచ్చి పెండ్లి చేసినప్పుడు తన కూతురు భర్తతో సుఖంగా కాపురం చెయ్యడానికి వీలుగా ఆయన సూర్యుడి ఉష్ణతను చాలావరకు తగ్గించినట్టు పురా

ణాలలో ఒక కథ చెబుతూంది. అలాగే - ఉళ్ళూర్ కాల్పనిక కవితా సుందరిని వరించడం కోసం తన సాంప్రదాయిక కవితా ప్రాగల్భ్యాన్ని కావాలని తగ్గించుకున్నాడని చెప్ప వచ్చును. ఒక ఏనుగుకి రెక్కలు మొలిచి ఆకాశంలో నిర్నిరోధంగా కాల్పనిక విహారానికి పూనుకున్న ఈ దృశ్యం చూసిన విచక్షణ గల పాఠకులు ఆశ్చర్య చకితు లవుతారు.

# 8. తత్త్వం - దర్శనం

తత్త్వ శాస్త్రానికి నిర్వచనం: "అస్తిత్వ ప్రాథమిక సూత్రాలను గురించీ, ఉపలబ్ధం అయ్యే జ్ఞాన స్వభావాన్ని గురించీ చర్చించే శాస్త్రం" అని. కాని, సాహిత్య విమర్శలో ఈ పదం వాడుక చేసినప్పుడు దానికి ఈ పారిభాషిక నిర్వచనం వర్తించదు. తన కవితా మాధ్యమం ద్వారా తర్క సహంగా కవి స్పష్టంగా ప్రతిపాదించ లేని, అతని హృదయం అట్టడుగు పొరల్లో స్వతస్సిద్ధం (a priori) గా నాటుకుపోయి ఉన్న విశ్వాసాల స్వభావాన్నే ఆలంకారికంగా కవి తాత్త్విక దృక్పథం అని వ్యవహరిస్తున్నాము. దీనినే 'కవి మతం' అని కూడా అనవచ్చు-రవీంద్రుడు వాడినట్టు[1]! కవి తన కర్మాగారంలో సృష్టి కార్యంలో నిమగ్నుడై ఉన్నప్పుడు ఏ వ్యవస్థిత, తాత్త్విక దృక్పథం గాని, మతం గాని అతని చేతిలో చెక్కు చెదరకుండా నిలిచి ఉండలేవు. నిజమైన కవి వ్యవస్థిత తత్త్వ శాస్త్రాన్ని దానిపట్ల ఏ మాత్రం గౌరవం చూపించకుండా ఎదిరిస్తాడు. అప్పుడు తన వ్యక్తిగత అంతర్దర్శనాలే అతనికి మార్గ నిర్దేశకాలు, పర్యవసానంగా తన కవిత్వం ద్వారా తత్త్వ శాస్త్రానికి స్వయంగా నూతన పుష్టి చేకూరుస్తాడు. అందుకే విశ్వ విద్యాలయాల తత్త్వ శాస్త్రం కవిత్వాన్ని సృష్టించడం గాని, దాని మీద తన ప్రభావం నెరపడం గాని చేయలే దని కొంద రంటారు. కాని, కవికి గల తాత్త్విక భావాలమీద వ్యక్తి గత అంతర్దృష్టి ప్రభావమే నిజానికి కవిత్వాన్ని సృష్టిస్తుంది. సాంప్రదాయిక తత్త్వశాస్త్ర భారంతో క్రుంగిపోయే కవి శక్తి మంతుడైతే కృతక తత్త్వవేత్త కాగలుగుతాడు. శక్తి లోపిస్తే కృతక కవి అవుతాడు.

1. **'Creative Unity'** (సృజన ఏకత) అనే సంపుటిలో ఒక వ్యాసం **The Poet's Religion** (కవి మతం) అని.

ఉళ్ళూర్ ఆర్జించిన పాండిత్యం – ముఖ్యంగా ప్రాచీన భారతీయ శాస్త్రాల్లో సహజంగానే భారతీయ దర్శనాలో ఏ అద్వైతాన్నో, అలాంటి మరో సిద్ధాంతాన్నో ఆయన సమర్థించి ఉంటా రని మనం ఊహించడానికి అవకాశం ఇస్తుంది. అయితే — తన 'గత స్మృతులు' [1] నెమరు వేసుకుంటూ తనని అమితంగా ముగ్ధుణ్ణి చేసిన గ్రంథం వ్యాస కృత మహా భారతం అనీ, దానిలోని తాత్త్విక దృక్పథం తనకి సంపూర్ణమైన సంతృప్తి కలిగించ గలిగిం దనీ ఆయన కంఠోక్తిగా చెప్పారు. పది సంవత్సరాల వయస్సులో తన లేత మనస్సుమీద ఎళుత్తచ్చన్ అనువాదం ద్వారా భారతం ప్రభావం ఎలా పడిందీ, అభిమన్యు వధ ఘట్టం చదివి నప్పుడూ, ఆ తరు వాతి ధర్మజ విలాప ఘట్టం చదివినప్పుడూ తను ఎలా వలవల ఏడ్చిందీ ఆయన వర్ణించారు. 'భారత గాయత్రి' అనీ, 'విదుర వాక్యమ్' అనీ ప్రసిద్ధ మైన కొన్ని భాగాలను కూడా ఆయన దానిలో ఉదాహరించారు. అయితే-ముఖ్యంగా శ్రీకృష్ణుడు ఉపదేశించిన భగవద్గీతలోని ప్రధాన తాత్త్విక దర్శనమే మహాకవి మనస్సును ఎక్కువగా ఆకట్టుకుంది. మానవుడు ఇతరులకు సౌఖ్య సంతోషాల్ని కూర్చే తన విహిత ధర్మాన్ని ప్రాణాలను కూడా లెక్కచేయకుండా అవశ్యం అనుష్ఠించా లనే గీత ప్రధాన సందేశం. భారతీయుల సాంప్రదాయిక విజ్ఞాన ఫల మైన ఈ తాత్త్విక దృక్పథాన్నే మహాకవి తన 'భక్తి దీపిక'లో ఈ విధంగా ప్రకటించారు.

"నరులకు నిరంత రాలంబనమ్ము గీత
నొసగితిని దివ్య సందేశ మొకటి తొల్లి
నిర్మమత నాచరింపుము నీ స్వధర్మ
మరయకు జయాపజయమ్ము; లవని నరుడు
మడియు దాక స్వ ధర్మమ్ము మానరాదు!"

బరువైన తాత్త్వికోపన్యాసానికి అనుకూలమైన సందర్భం ఇది. కథా వికృతి దృష్ట్యా అలాంటి ప్రసంగం ఇక్కడ తప్పనిసరి గనుక కవికి తాత్త్విక చర్చలమీద ప్రీతి ఎక్కువ అనే ఆరోపణ న్యాయంకాదు. నృసింహస్వామి తన ఇతర అవ తారాల్లోని ఘన కార్యాల్ని స్మరించే సందర్భం ఇది. సుదీర్ఘంగా సాగిన ఈ ఘట్టంలో తాత్త్విక చర్చవల్ల కలిగే విసుగుదల కవితాత్మకు భంజకమే! అయితే- కవి నీరసంగా సాగే ఈ తాత్త్వికోపన్యాసంలో సుకుమారమైన విశ్వజనీన ప్రేమ,

---

1. చూ. 'స్మరణ మాధురి' లోని 'The Book that attracted me most' అనే వ్యాసం.

సాభ్రాత్రాలతో కూడిన తన స్వీయ దర్శనాన్ని ప్రవేశపెట్టి కవితా ధర్మానికి పుష్టి కలిగిస్తారు. ఆకాశంలో అసంఖ్యాక మైన నక్షత్రాల ప్రేమతోనే ప్రజ్వలిస్తున్నా యని అన్నప్పుడు కవి మార్మిక కవితా స్థాయికి ఎగరడం కనిపిస్తుంది. సృజనాత్మకమైన ఆ భావనా పారవశ్యం రచనను దానిలో వర్ణితమైన ఆకాశ వీథి అంత దీప్తిమంతంగానూ నిలిపి ఉంచుతుంది.

కవియొక్క స్వీయ దర్శనం వల్ల తత్త్వశాస్త్ర చర్చకి ఎలా జీవకళ వస్తుందో నిరూపించబడింది. తత్త్వ శాస్త్రం గ్రంథోదాహరణల మీద ఆధారపడుతుంది; అది ఆనుమానిక మైంది. అందువల్ల అది నిర్జీవం, వ్యక్తిత్వ రహితం. అలా కాకుండా దర్శనం సజీవ మైంది; వ్యక్తిత్వం కలది. దేశభక్తి, గాంధీజీ వంటి జాతీయ నాయకుల పట్ల ప్రపత్తి, భారత దేశపు అజరామర మైన సంస్కృతి సంప్రదాయా లంటే అచంచలమైన గౌరవం, హరిజనుల వంటి అధో వర్గాలంటే ఎనలేని ప్రేమ, తోటి భారతీయుల అలసతా నిద్రాళుతల పట్ల అసంతృప్తి, సాంఘిక పురోగతి విషయమై అమితాసక్తి, యుద్ధా లన్నా, సైరంకుశత్వం అన్నా వైముఖ్యం, సమకాలీన సమస్యల పట్ల నిస్పందిగ్ధంగా తన అభిప్రాయాలు ప్రకటించడానికి దారితీసిన కుల మతాతీత మైన మానవతా దృష్టి - ఇలాంటి ఎన్నెన్నో అంశాలతో కూడింది- ఉళ్ళూర్ మహాకవి జీవన దర్శనం ఆయన మనస్సులోని తాత్త్విక విశ్వాసాల్లో ఈ అంశా లన్నీ పెనవేసుకుని పోయి, ఏకీకృత మైన, స్వతంత్ర మైన, తన అనుభూతుల మీదనే ఆధారపడిన ఒక నూతన దర్శనం ఆయనలో రూపొందింది. జోసెఫ్ ముండస్సేరి [1] లాంటి వెనుకటి విమర్శకులు ఆయన విద్వత్త పట్ల, తత్త్వ శాస్త్ర పాండిత్యం పట్ల గల వైముఖ్యంతో ఉళ్ళూర్ కవియొక్క ఈ ఏకీకృత కవితా దర్శనాన్ని గుర్తించ లేకపోయారు. ఉళ్ళూర్ కవికి జీవితంతో, ప్రపంచంతో ఐంద్రియికానుబంధం లేదనీ, మిల్టన్ కవి లాగ పుస్తకా లనే సులోచనాల ద్వారా ఆయన జీవితాన్ని దర్శించా రనీ అనడం వట్టి అపవాదు. హిందూ తాత్త్విక దృష్టికీ, ఉళ్ళూర్ దర్శనానికి సూర్యుడికీ, అగ్నికీ ఉన్నంత తేడా ఉంది. అగ్ని మానవ కల్పితం; సూర్యుడు దూరస్థుడు, వ్యక్తిత్వ రహితుడు.

ఉళ్ళూర్ వ్రాసిన మంచి కావ్యాల్లో కర్మ సిద్ధాంత సందేశాన్ని కళా రహి

---

1. ప్రొఫెసర్ జోసెఫ్ ముండస్సేరి (1903 - 1977) మలయాళ కవిత్వ అగ్ర విమర్శకుల్లో ఒకరు. ఆయన ఉళ్ళూర్‌లో కవితా ప్రతిభ మృగ్యం అన్నారు. చూ. మాట్టొలి (ప్రతి ధ్వని), అంతరీక్షమ్ మొదలైన విమర్శక రచనలు.

తంగా విసుగు పుట్టేట్టు చిలుక పలుకుల్లాగ ఆయన ఏకరువు పెట్టలేదు. సాహసిక కార్యాచరణ ప్రాతిపదికగా గల వీర రసాన్నీ, కర్మ వీర దర్శనాన్నీ ఆయన ప్రతి పాదించారు. కవి తాలూకు సజీవమైన ఆత్మలోని వేర్వేరు పాయలు పెనగొనడం వల్ల ఏర్పడి, ఆయన కవితా ప్రతిభ గారడీతో ఏకీభావం పొందిన రూపం అది. అంతే గాని గ్రంథ పఠనం వల్ల రూపొందింది కాదు.

'కర్ణ భూషణమ్', 'పింగళ' వంటి కావ్యాలు ప్రధానంగా పౌరాణికేతి వృత్తం కలవే అయినా, ఉళ్లూర్ ఆ పౌరాణిక తాత్త్విక భావాల్లో మునిగిపోకుండా తన వ్యక్తి గత అంతర్దృష్టితో కావ్యాలను దీప్తిమంతం చేయడం మెచ్చుకోదగింది ఉళ్లూర్ సృష్టించిన కర్ణుడు సహజ సిద్ధ మైన తన కవచ కుండలాల్ని విధి బలా త్కారం వల్ల దానం చేసివేసే ఆదర్శ ప్రాయు డైన దాతగా చిత్రించబడిన పౌరా ణిక వీరుడు కాడు. మానవ సేవ ద్వారా ఆత్మ విముక్తి సాధించుకొన్న సాహసి. తన హృదయ స్పందనాల్లో 'ఇతరుల కోసమే నువు జీవించు!' అనే భగవంతుని నీరవ సందేశం అతడు వినగలిగాడు.

ఈ విధంగా జగద్ధితానికి అంకితం కావడమే గ్రంథస్థ తాత్త్విక భావాల నుంచి విముక్తి కలిగించి, స్వతంత్ర దర్శనం గల కవిగా ఆయనను మలచింది 'సుఖమ్ సుఖమ్' లో ఈ కర్మ దర్శనం మరింత స్ఫుటంగా కనిపిస్తుంది స్వార్థ పర మైన కార్యాచరణ కంటె ఇతరుల కష్టాలను తగ్గించేందుకు నిస్స్వార్థంగా కృషి చెయ్యడమే జీవితానికి సంతృప్తినీ, చారితార్థ్యాన్నీ కలిగించగల వని ఆ కావ్యంలో ఆయన ప్రతిపాదిస్తారు. తత్ఫలితంగా ప్రకాశవంత మైన ఒక ఉదాత్త స్థాయి ఆయన అందుకుంటారు. అక్కడనుంచి చూసి, దరిద్రుల్ని ధనికులూ, అవర్ణుల్ని సవర్ణులూ, అబలలను సబలులూ, ప్రాచ్యాన్ని పాశ్చాత్య దేశాలూ కొల్లగొట్టని, అధు నిక మానవు డింకా అందుకోని, స్వేచ్ఛల ఇంద్ర ధనుస్సు లాంటి ఒక నూత నోష స్సును ఆయన దర్శిస్తారు:

"ధనికు లేమొ నిర్ధనుల, ఉత్తమ కులీను
లధము వర్ణుల, మగవార లాడువారి,
ప్రాచ్య దేశాల పాశ్చాత్య పాలకులును
అణచి ఉంచి జులుము సేయు నట్టి ఘోర
మైన పీడకల గతించె అవని కిపుడు!"

వైదిక మంత్ర ద్రష్టకు 'ఒకే గూడు'[1] గానూ, రవీంద్రునికి "స్వేచ్ఛా స్వర్గం" గానూ కనిపించిన ఏక మానవ జాతి ఉళ్ళూర్ కవికి 'ప్రభువు నాటిన ద్రాక్షతోట' గా దర్శన మిస్తుంది :

"జగతి గల సర్వ మానవ జాతి నిజము
ప్రభుని మంది రారామాన ద్రాక్ష కోన!"

మిస్ మేయో దారుణంగా విమర్శించిన భారతీయ మహిళను సమర్థించ డానికి అంత ఉత్సాహంగా ముందుకు వచ్చిన మహాకవే ఆధునిక కాలంలో భారత దేశంలో కనిపించే స్తబ్ధతనీ, నిర్వీర్యతనీ తీవ్రంగా విమర్శించడానికి వెనుకాడ లేదు. మానవ కల్పితా లైన దారిద్ర్య, దైన్యాల్ని భరించ లేని ఈ కవి మ్రోయించిన భేరీ ధ్వనులు 'అన్నమ్ - ఇన్నమ్' లోని ఈ క్రింది పంక్తుల్లో ప్రతి ధ్వనిస్తున్నాయి :

"భరత దేశీయులార! ప్రాగ్ వైభ వోచ్చ
శిఖరముల నుండి పతనమ్ము చెందినామొ -
ఘన తమో వృత దారు ణాఖాతములకు?
చదువు లేక, వృత్తులు లేక, బ్రదుకు లేక
వేల ఇక్కట్లు భయముల పాల జిక్కి
ఐకమత్యమ్ము కొరవడి అణగి పోవు
స్వేచ్ఛ లేని అభాగ్యుల మిపుడు మనము!
దాక పొట్టలు గల గాడిదలము మనము!
నిజ గృహానికి నిశ్శంక నిప్పు బెట్టు
దైవ దూరులము మన మందరము నేడు!
పూర్వ మొకపుడు పురుషోత్తములము కామొ?"

'ప్రేమ సంగీతమ్' లాంటి ఖండ కావ్యాల్లో దిక్చక్రా లన్నీ ఏకమై కలిసి పోయి, ప్రేమతో, విజ్ఞానంతో, నిరంతరాయ మైన కర్మ దీక్షతో వర్ధిల్లే ఒక ఉజ్జ్వల జగత్తును ఆయన సందర్శిస్తారు. ప్రేమను గూర్చిన ఈ కావ్యంలోని ఉదాత్త మైన స్వర మాధురిలో భిన్న భిన్నము లైన భక్తి, జ్ఞాన, కర్మలు మూడూ అద్భుతంగా సమన్వయం పొందినయి. వాటి ప్రతి ధ్వనులు మన హృదయాల్లో ఎన్నటికీ

1. "యత్ర విశ్వమ్ భవ త్యేక నీడమ్" - యజుర్వేదమ్.

మాసిపోవు; విశ్వ జనీన ప్రేమలో ఆయన తలమున్కలుగా నిమగ్నుడు కావడం వల్ల తోటి మహాకవులు ఆశాన్, వళ్లత్తోళ్ లను మురిపించిన కాల్పనిక ప్రేమ ఆయనను ఆకర్షించ లేక పోయింది. ఈ క్రింది పద్యాల్లో ఉళ్లూర్ కవి కవితా ప్రధాన సందేశాన్ని మనం గుర్తించవచ్చును:

"ఓయి స్వామి! భక్త్యేక వశ్యుడవు నీవు
కాన ఎవడు విశ్వ ప్రేమ కజ్జలమ్ము
కనుల దిద్దని వాడు నిన్ కాననేర్చు?
పరుని సుఖమె నాకు సుఖమ్ము పరుని దుఃఖ
మే మదీయ దుఃఖము - వాడు, నేను, నీవు
అందరము ఒక్క రూపమే నందు; నేను,
నా తనువు, ఆత్మ నీవి; అన్య జన సేవ
కివి ఉపకరించును గాత రేయిం బవళ్లు!"

స్వకీయమైన దర్శనం లేకుండా, తాత్త్విక దృక్పథాన్ని అరువు తెచ్చుకున్న వాడు ఉళ్ళూర్ అనడం కేవలం మిథ్యాపవాదం అనీ, సవిమర్శక పరిశీలనకు నిలువ బోదనీ ఇంతవరకు నిరూపించబడింది, తన శాస్త్ర పాండిత్యపు శృంఖలల నుంచి తన కవితా ప్రతిభకు విముక్తి కలిగించడంలో ఆయన సాధించిన ఘన విజయం ఆయన కవిత్వంలో కనిపిస్తుంది. అంతటి ప్రతిభాశాలి కాని మరొక కవి అయితే ఆ పాండిత్య భారం క్రింద పూర్తిగా అణగారి పోయి ఉండే వాడు!

# 9. సాటిలేని పండితుడు

సుప్రసిద్ధ హాస్య రచయిత మూర్కోత్ కుమారన్ చతుర్ముఖ బ్రహ్మగా పరమేశ్వరయ్యర్‌ని వర్ణించడంలో ఎలాంటి వ్యంగ్యాన్నీ ఉద్దేశించలేదు. ఆ నాలుగు తలల్నీ పైకెత్తుకునే ఉళ్ళూర్ జీవించారు. ఆ తలలు : 1. ఉద్యోగ పదవి, 2. కవిత్వం, 3. వచన రచన, 4. పాండిత్యం. ఈ నాలుగు తలల్లో ఏది అన్నిటికంటె ఉన్నత మైంది? చాలా మంది అనుకుంటారు – ఆయన జన్మతః పండితుడూ, అభ్యాసం వల్ల కవీ అయిన వాడు అని. దినిలో పూర్వార్ధాన్ని మనం అంగీకరించినా, ఉత్తరార్ధం అపోహ అని చెప్పవలసి ఉంది. జన్మతః సిద్ధించే పాండిత్య, కవితా ప్రతిభలు రెండూ పరస్పర విరుద్ధమైనవి కావు. పాండిత్య ప్రవృత్తి లాగా కవితా ప్రతిభ కూడా ఆయనకు ప్రకృతి దత్తమైన వరమే! పూర్వ శతాబ్దాల్లో ఆయన జన్మించి ఉంటే తేలికగా నమ్మే స్వభావం గల ఆ నాటి జనం దేవగురువైన బృహస్పతి అపరావతారంగా ఆయన్ని పరిగణించి ఉండే వారు. మహాకవి వళ్ళత్తోళ్ - పుస్తకాల సముద్రం మీద యోగ సమాధిలో శయనించి ఉన్న శ్రీ మహా విష్ణువుతో ఆయన్ని సరిపోల్చారు. ఆయన సమకాలికుల్లో ఆయన్ని గురించి చెప్పవలసి వచ్చే సరికి రూపకాలంకార ప్రయోగానికి దిగే ప్రవృత్తి మిక్కిలి అర్థవంత మైంది. ఆయన ప్రదర్శించిన రాక్షసమైన పాండిత్యం సాధారణ మానవ స్థాయికి అందేది కాదని భావింపబడింది. ఉళ్ళూర్ కవికి సమకాలికుల్లో మరో మహా పండితుడు టి. కె. కృష్ణ మేనోన్ కూడా తన స్వీయ చరిత్రలో ఉళ్ళూర్ ప్రస్తావన వచ్చినప్పుడు మానవాతీత పరిభాషలో ఆయన్ని వర్ణించారు : "సముద్ర దేవత అయిన ప్రోటీయస్ లాగ - కూలంకషమైన పాండిత్యంతో, అద్భుతమైన ధారణా శక్తితో, మానవాతీత మైన ఉత్పత్తి రాశితో - నానా రూపాలను తనలో ఇముడ్చుకున్న మనీషి ఉళ్ళూర్.[1]" మలయాళ సాహిత్యాన్ని ఆపోశన పట్టిన అగస్త్యుడైన కేరళవర్మ వలియ తంపురాన్ ఉమా కేరళమ్ కావ్యానికి తాను వ్రాసిన ఉపోద్ఘాతంలో అందరి కంటె గొప్పగా ఆయన్ని ఇలా ప్రశంసించారు : "పరమేశ్వరయ్యర్‌లో కనిపించే చాలా మెచ్చుకో దగిన రెండు అంశాలు - ఆయన విజ్ఞాన పరిధి, ఆశ్చర్యకర మైన ఆయన ధారణా శక్తి. వివిధ రంగాల్లో ఆయన

---

1. ఇంగ్లీషులో వ్రాసిన స్వీయ చరిత్ర : 'The Days that were' - పుట 645 (ఎర్నాకులమ్, 1949).

సాధించిన మూల గ్రంథ పరిచయం నిజంగా అద్భుత మైంది. ఇక-స్పష్టాస్పష్టమై స్థాలి త్యావకాశాలు ఎక్కువగా ఉన్న ప్రాచీన మలబారు చరిత్ర, ప్రాచీన మలయాళ సాహిత్య చరిత్ర రంగాల్లో ఆయన పరమ ప్రామాణికుడు అని విద్వాంసు లందరూ ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు."

నిర్విరామ మైన తన ఉద్యోగ కాలంలో ఆయన ఒక్కరే వ్రాసిన, ఇతరులతో కలిసి వ్రాసిన రిపోర్టులను గురించి ఇంతకు ముందే వివరించ బడింది. వాటిలో చాలా భాగం ఇంగ్లీషులో వ్రాసిన సమగ్ర, సంక్షిప్త రచనలు "మ. ఘ. వ శ్రీ మూలం తిరునాళ్ మహారాజా ఆఫ్ తిరువాన్కూర్. నమోదైన కొన్ని అభిప్రాయాలు", 'తిరువాన్కూరు సంస్థానంలో రాజాలనూ, నాయకులనూ గూర్చిన సంగ్రహ కథనం', 'దివాన్ బహదూర్ ఎం కృష్ణన్ నాయర్ - తిరువాన్కూర్ పాలనలో ఆయన దక్షత' వంటి కొద్ది రిపోర్టులు మాత్రమే ప్రచురించబడినయి. '31 ఏళ్లలో తిరువాన్కూర్ సంస్థానాభివృద్ధి', 'తిరువాన్కూర్ మహారాజాల వంశ వృక్షం' వంటి రిపోర్టులు ప్రచురించబడక పోవడం దురదృష్టం! 'ప్రాచీన భారత దేశంలో రాజనీతి సిద్ధాంతాలు', 'తిరువాన్కూర్‌లో విదేశీ మిషనరీల నెలవులు - వారి కార్యకలాపాలు', 'అత్తింగళ్, తిరువాన్కూరు రాజకుంటుంబాలలోని రాణీలు' వంటి కొన్ని ప్రచురణ కాని రిపోర్టులు గ్రంథాలుగా బైండ్ చేయబడి ఉన్నాయి. ఇవి కాక-ఉళ్ళూర్ వివిధ పత్రికల్లో ప్రకటించిన 70 ఇంగ్లీషు వ్యాసాలు ఉన్నాయి. 'కాళిదాసుని రఘువంశం' (మద్రాసు రివ్యూ - 1903 - 1904), 'ఆంగ్లో - ఇండియన్ కవితలో విస్మృతాధ్యాయం (ఇండియన్ రివ్యూ, 1924), 'హిందూ దృక్పథం' (ఆర్యన్ పథ్. 1939) మొదలైన కొన్ని వ్యాసాల శీర్షికలు విజ్ఞాన సర్వస్వ సదృశ మైన ఆయన మేధా శక్తి విస్తృతిని విశదం చేస్తున్నాయి ప్రకటితం కాని ఇంగ్లీషు వ్యాసాలు కూడా - 'కేరళలోని ప్రాచీన ఓడ రేవులు', 'రవీంద్రనాథ్ ఠాకుర్' వంటివి ఎన్నో లభించినయి.

చిన్న తనంలోనే తాను సాధించిన సంస్కృత, మలయాళ, తమిళ, ఆంగ్ల భాషా పాండిత్యం అంతా వినియోగించి చరిత్ర, సాహిత్య రంగాల్లో ఆయన చేసిన తీవ్ర పరిశోధనల తొలి ఫలితాలు ఆయన హైస్కూలు టీచర్‌గా పనిచేస్తున్న రోజులల్లోనే వివిధ పత్రికల ద్వారా వెలుగులోకి వచ్చినయి. 'తిరువాన్కూర్‌లో డచ్చివారు' (మలబారు క్వార్టర్లీ రివ్యూ, 1904), 'తిరువాన్కూరు - విజయనగరం' (మద్రాసు క్రైస్తవ కళాశాల పత్రిక, 1904) వంటి ఆయన వ్యాసాలు ప్రొఫెసర్

వి. రంగాచార్య, ఫాదర్ హీరాస్ వంటి సుప్రసిద్ధ చరిత్ర వేత్తల ఆదరానికి పాత్ర ములై దక్షిణ భారత విద్వాంసుల్లో అగ్రశ్రేణిలో ఆయనకు స్థానం సమకూర్చి నయి.

ఔద్యోగిక విధులను పాటిస్తూ కూడా అప్పుడప్పుడు ఆయన కొనసాగించిన పరిశోధన ఫలితాలు 'భాషాపోషిణి' లాంటి పత్రికల్లోనూ, ప్రత్యేక గ్రంథాలుగానూ వెలువడినయి 'రామ చరితమ్', 'రామకథా పాట్టు', 'కణ్ణశ్శ రామాయణమ్'[1] వంటి ప్రాచీన రచనల ప్రచురణ ద్వారా చెరుశ్శేరి[2] కంటె పూర్వపు మలయాళ సాహిత్య స్వరూపాన్ని మలయాళీలు గ్రహించడానికి ఆయన తోడ్పడ్డారు. 'ప్రాచీన మలయాళం - మచ్చు తునుకలు', 'మధ్యయుగ మలయాళం - మచ్చు తునకలు' అనే పేరుతో పాండిత్య స్ఫోరకమైన ఉపోద్ఘాతాలతో 1915, 1916 లలో వరుసగా ఆయన ప్రకటించిన రెండు సంకలన గ్రంథాలు నేటికీ విద్వాంసుల మన్నన లందుకొంటున్నయి. ఈ ప్రచురణల వల్ల విద్వాంసులకు పరిశోధనలో ఒక క్రొత్త పుంత తెరిచినట్లయింది. తన ఔద్యోగిక వ్యావృత్తులవల్ల అవి అసమగ్రాలు అయినందుకు ఆయన చింతించారు. అన్య కార్య నిమగ్నులు కాకుండా ఉంటే నిశ్చయంగా అంతకంటె బాగా ఆ సంకలనాలు రూపొంది ఉండేది.

అనంతరం మలయాళ లిఖిత గ్రంథ ప్రచురణ కోసం తిరువాన్కూర్ ప్రభుత్వం రూపొందించిన పథకంతో అయనకు సంబంధం ఏర్పడింది. మహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రి సంస్కృత లిఖిత గ్రంథాల ప్రచురణకు క్యూరేటరుగా ఉన్న కాలంలో మలయాళ లిఖిత గ్రంథ ప్రచురణ విషయంలో తగినంత శ్రద్ధ చూపటం లేదని ప్రజలనుంచి విమర్శ వచ్చింది. తత్ఫలితంగా 1924 లో మలయాళ లిఖిత గ్రంథాల ప్రచురణ బాధ్యతను ఉళ్ళూర్‌కి వప్పగించడం జరిగింది. ఆయన అప్పుడు (ఆక్టింగ్) చీఫ్ సెక్రటరీగా పని చేస్తున్నా రనే సంగతి మనం గుర్తుంచుకోవాలి. దాదా పొక ఏడాది పాటు మాత్రమే ఆయన క్యూరేటర్‌గా ఉన్నారు. అంతలో ఆయనను దివాన్ పేష్కార్‌గా ప్రమోషన్‌మీద కొల్లం

1. ఈ మూడు గ్రంథాలనూ వరుసగా చీరామన్, అయ్యప్పిళ్ళి ఆశాన్, కణ్ణప్ప (నిరణమ్ రామ) పణిక్కర్‌లు రచించారు.

2. 'కృష్ణగాథ' రచించిన చెరుశ్శేరి నంపూత్తిరి 15వ శతాబ్ది పూర్వార్ధంలో ఉత్తర మలబార్ లోని చిరక్కాల్‌లో కోలాత్తిరి వంశపు రాజైన ఉదయ వర్మ వద్ద ఆస్థాన కవి.

(Quilon) బదిలీ చేశారు. అవకాశం లభించిన ఆ స్వల్ప వ్యవధానంలోనే 'శ్రీ మూలం మలయాళమ్ సిరీస్' అనే గ్రంథమాల పేరుతో అపురూపమైన మలయాళ గ్రంథాలను తొమ్మిదింటిని పరిశీలనాత్మకమైన ఉపోద్ఘాతాలతో ఆయన ప్రచురించగలిగా రంటే నమ్మ శక్యం కాదు. ఆ క్యూరేటర్ కార్యాలయంలో వటక్కుంకూర్ రాజ రాజ వర్మరాజా, ఇ. వి రామన్ నంపూతిరి వంటి మహా విద్వాంసులు పండితులుగా పని చేశారు. ఉళ్ళూర్ హయాంలో పని చేసినంత ఉత్సాహంగానూ, నిర్విరామంగానూ ఆ కార్యాలయం మరెప్పుడూ పని చేసి ఉండలే దని వటక్కుంకూర్ సగర్వంగా స్మరిస్తారు. సచివాలయంలో ఆయన ఆఫీసు బల్ల ఎప్పుడు చూసినా ఆఫీసు ఫైళ్ళతో పాటు తాళపత్ర గ్రంథాల దొంతరలలో నిండి ఉండేది. అమాయకుడైన సచివాలయంలోని ఒక సీనియర్ ఆఫీసరు ఆ గ్రంథాలను చూసి జాతకా లని అపోహ పడ్డట్టు కూడా చెప్పుకునే వారు. తన క్లిష్టమైన పని చెయ్యడంలో విసుగూ విరామం లేని ఉళ్ళూర్ నానావిధా లైన తన బాధ్యతల మధ్య వీలు చేసుకుని ఆ గ్రంథాల ప్రూఫులు కూడా ఆయనే స్వయంగా చదివేవా రట!

సమస్త కేరళ సాహిత్య పరిషత్తుకి ఇంచుమించు అది ఏర్పడిన నాటి నుంచీ ఒక దశాబ్దం పైచిలుకు ఆయన అధ్యక్షులై, 'పరిషత్ త్రైమాసికమ్' అనే ఉదాత్త సాహిత్య పరిశోధన పత్రికకు సంపాదకత్వ బాధ్యత వహించారు. 1935 నుంచి 1947 దాకా ఆ పత్రికకి ఆయనే సంపాదకులు సాహిత్య పరిషత్తుతో పాటుగా 'త్రైమాసికమ్' పత్రికకి కూడా ఆయనే జీవం. అంతకు ముందు గాని, అటు తర్వాత గాని ఆ పత్రికతో దీటు రాగల పత్రిక మలయాళంలో రాలేదు. ఆ పత్రిక ద్వారా ఎన్నెన్నో విస్మృతి పాలైన రచనల్నీ, అపురూపమైన వ్రాతప్రతుల్నీ ఆయన వెలుగులోకి తెచ్చారు. 'త్రైమాసికమ్' పత్రికకి తాను సంపాదకుడుగా ఉన్న కాలంలో ఉళ్ళూర్ అరవై పైచిలుకు పరిశోధక వ్యాసాలనూ, టీకతో సహా ఇరవై అపురూప గ్రంథాలనూ ప్రకటించారు. గ్రంథ సమీక్షకు ఆయన ఎక్కువగా పూనుకోలేదు. అయినా 'త్రైమాసికమ్' లో ఆయన గ్రంథ సమీక్షలు కొన్ని కనిపిస్తున్నాయి. అవి కేవలం గ్రంథ స్థూల పరిచయాలు కావు. అద్భుత పాండిత్యంతో కూడిన సునితమైన విమర్శలు. ప్రొఫెసర్ ఎల్. వి. రామస్వామి అయ్యర్ వ్రాసిన 'మలయాళ పదాల పరిణామం' (The Evolution of Malayalam Morphology), 'లీలావతీ తిలకమ్‌లో వ్యాకరణాంశాలు', శిరోమణి పి. కృష్ణన్ నాయర్ వ్రాసిన 'కావ్యజీవిత వృత్తి' వంటి ఉద్గ్రంథా

లనే ఆయన సమీక్షించారు. అంతకంటె క్రింది స్థాయికి ఆయన దిగలేదు 'త్రైమాసికమ్' ప్రతి సంచికలోనూ ఇతరుల రచనలతో పాటుగా వివిధ విషయాలకు సంబంధించిన నాలుగయిదు రచనలు ఉళ్ళూర్‌వి ఉండేవి. 1936 లో 'కొచ్చిన్ మలయాళ అభివృద్ధి సంఘానికి' ఆయన అధ్యక్షులుగా ఉన్నారు. అనేక చంపువులు, కౌటిల్యుని అర్థశాస్త్రమ్, దూతవాక్యమ్ ఒక ప్రాచీన మలయాళ వచన గ్రంథంతోసహా మణిపూస ల్లాంటి ప్రాచీన గ్రంథాలెన్నో వెలుగులోకి తెచ్చిన ఆయన హయాము చిరస్మరణీయ మైంది. ఆయన పరిష్కరించి, ప్రకటించిన గ్రంథాలు ఎనిమిది దాకా ఉన్నాయి. వాటిలో ఎాన్‌తానమ్ తమిళ రచనలు, శతముఖ రామాయణమ్, గిరిజా కల్యాణమ్, నాట్య సంగ్రహమ్, పటప్పాట్టు, వ్యవహార మాల మొదలైనవి ఉన్నాయి. ఒక డజన్ పైచిలుకు సంస్కృత గ్రంథాలను కూడా ఆయన పరిష్కరించారు.

పరిశోధనకి ఫీల్డ్‌వర్క్ అవసరం అయినప్పుడు వ్యయప్రయాసల కోర్చి, వివిధ ప్రదేశాలు పర్యటించడానికి ఉళ్ళూర్ వెనుకాడలేదు. తైర్థికుడి భక్తి శ్రద్ధలతో విషయ సేకరణ కోసం కేరళలో ఈ కొస నుంచి ఆ కొసదాకా ఆయన పర్యటించారు. 1935 లో చిరక్కాల్ రాజప్రసాద సందర్శనం మహాకవికి 'స్వస్థల పున రాగమనం' (Return of the native) గా పరిణమించి ఉండాలి! ఆ సందర్భంలో ఉళ్ళూర్‌తో కలిసి గడిపిన కొద్ది దినాల్లో తాను పొందిన సుఖ సంతోషాలను వటక్కుంకూర్ స్మరిస్తారు.

తొమ్మిదవ ఆలిండియా ఓరియెంటల్ కాన్ఫరెన్స్ 1937 డిసెంబరు నెలలో తిరువనంతపురంలో జరిగినప్పుడు దానిలో ఉళ్ళూర్ ప్రధాన భూమిక నిర్వహించారు. సంస్కృత కావ్య సాహిత్య విభాగానికి సంబంధించిన 15 వ విభాగంలో అప్పుడు కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో సంస్కృతం ప్రొఫెసర్‌గా ఉన్న డాక్టర్ ఎఫ్. డబ్ల్యు. తామస్ అధ్యక్షతక్రింద ఆయన 'సెయింట్ విల్వమంగళ్' అనే పేపరు చదివారు. ఆధునిక భారతీయ భాషలకు సంబంధించిన 13వ విభాగానికి ఉళ్ళూరే అధ్యక్షత వహించి, 'మలయాళమ్ - ఇతర ద్రావిడ భాషలు' అనే పేపరు చదివారు. రెండింటిలోనూ భావ వైశద్యం, పాండిత్య ప్రకర్ష వ్యక్తం అయినయి. ముఖ్యంగా రెండో పేపరులో భారతదేశానికి హిందీని[1] జాతీయ

---

1. చూ. "Proceedings and Transactions of the Ninth All India Oriental Conference" — పుటలు 471-480: 1233-1260.

భాషగా ఆహ్వానించడంలో వ్యక్తమైన ఆయన విశాల దృక్పథం గణనీయం! పాశ్చాత్య దేశాలనుంచి వచ్చిన ప్రతినిధులు ఆ వ్యాసాలను విశేషంగా మెచ్చుకున్నారు. జర్మనీలో 'మాక్స్ మ్యుల్లర్ స్టడీ సెంటర్'కి విజిటింగ్ ప్రొఫెసర్‌గా రమ్మని ఆయనను ఆహ్వానించారు. ఆయన జర్మన్‌భాష అధ్యయనం చెయ్యడం కూడా మొదలు పెట్టారు. అంతలో అనుకోకుండా రెండో ప్రపంచ యుద్ధం ఆరంభమై ఉండకపోతే ఆయన జర్మనీ వెళ్ళి ఉండేవారు!

ఉళ్ళూర్ విమర్శక వ్యాసాలు మొత్తం 66 'విజ్ఞాన దీపిక' అనే నాలుగు సంపుటాలుగా వెలువడినయి. నానా విషయాలను గురించిన, ముఖ్యంగా సంస్కృత, మలయాళ సాహిత్యాలకు సంబంధించిన పరిశోధక, విమర్శక, జీవిత చరిత్రాత్మకమైన వ్యాసాలతో కూడిన ఆ సంపుటాలు ఒక విజ్ఞాన సర్వస్వంగా వర్ణించ దగ్గవి. నీలకంఠ దీక్షితులు, సాయనుడు, గంగాదేవి వంటి సంస్కృత కవి పండితులను గూర్చిన వ్యాసాలు కొన్ని; 'అగ్ని పురాణం', 'భారతీయ అలంకార శాస్త్రం', 'కవి సమయాలు'. సంస్కృత భాష' వంటి సంస్కృత భాషా, సాహిత్య విషయాలకు సంబంధించినవి కొన్ని; ఉణ్ణాయి వారియర్, శీవొళ్ళి నంపూత్తిరి, కుఞ్ఞికుట్టన్ తంపురాన్ వంటి మలయాళ కవులను గూర్చినవి కొన్ని, 'మలయాళ చంపూ కావ్యాలు', 'పూన్తనమ్ వ్రాసిన అప్రసిద్ధ కావ్యాలు', 'గ్రంథరూపం దాల్చిన ఆట్ట కథలు' వంటి మలయాళ సాహిత్య విషయాలకు సంబంధించినవి మరికొన్ని. మధురా విజయ కర్త్రి అయిన సంస్కృత కవయిత్రి గంగాదేవి మీది వ్యాసం వంటి కొన్ని వ్యాసాల్లో అయినా కనీసం ఆయన నూతన నాంశాలు వెలుగులోకి తెచ్చారు. అమిత పాండిత్య ప్రకర్షతోనూ, అడుగడుగునా గొంతు పట్టుకునే సంస్కృతోదాహరణలతోనూ జటిలంగా ఉండే ఆ వ్యాసాల శైలి సాధారణ పాఠకుల్ని అదరగొట్టే మాట నిజం! ఆయన విమర్శలు సాహిత్యానికి ప్రజా ధారణ సాధించలేవనిపించేటంత బరువుగానూ, ప్రౌఢంగానూ సాగిందా శైలి. అయితే, ఆ శైలిని చూసి బెదరిపోని శ్రద్ధాళువులైన సాహిత్య జిజ్ఞాసువులకు మాత్రం భావి పరిశోధనల్ని ప్రోత్సహించే అమూల్య నిధానాలు అవి. సాధారణ పాఠకుణ్ణి తన రచనల జోలికి రావద్దని నిషేధించిన హర్షుని సూత్రం[1] అవలంబించారు ఆయన సంస్కృత శ్లోకాల్ని అనంతంగా ఏకరువు పెట్టి, కేరళలోని సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసులైన పునశ్శేరి నంపి నీలకంఠ శర్మ, వటక్కుంకూర్, రాజ

1. 'మాస్మిన్ ఖలః ఖేలతు' – నైషధమ్.

రాజ వర్మ రాజా వంటి వారిని కూడా ఆయన నిర్విణ్ణుల్ని చేయ్యగలిగా రంటే ఆశ్చర్యం లేదు.

పాండిత్యంలోనే కాక వక్తృత్వంలో కూడా ఆయన సువిఖ్యాతులు. ''మలయాళ భాషలో వక్తగా ఆయనకు దీటు వచ్చేవా రెవరూ లేరు'' అని కేరళ వర్మ చేసిన ప్రశంసలో ఆయన వక్తృత్వాన్ని గురించిన సమకాలీనుల అంచనా వ్యక్త మవుతుంది. ఆయన ఆశుధారా ఉపన్యాసాలు కూడా కూచుని వ్రాసిన వ్యాసాలంత బరువుగానూ, పాండిత్య స్ఫోరకాలుగానూ ఉండేవి 1927లో జరిగిన కేరళ సాహిత్య పరిషత్ ప్రథమ వార్షికోత్సవంలో ద్వితీయ సమావేశాని కధ్యక్షత వహిస్తూ ఆయన చేసిన ప్రసంగంలో ఆనందవర్ధనుడు, విశ్వనాథుడు, దండి, రాజశేఖరుడు, నీలకంఠ దీక్షితులు, భోజుడు మొదలైన ప్రామాణికుల రచనలనుంచి అరవై పైచిలుకు శ్లోకాలు ఆయన ఉదాహరించారు. 'జంగమ విజ్ఞాన సర్వస్వం' అని మహాకవి వళ్లత్తోళ్ అంతటి వాడు అన్నా డంటే దానిలో అతిశయోక్తి ఏమీ లేదు.

'కవి అయిన వాడు తప్పనిసరిగా విమర్శకుడు కూడా అయి ఉండాలి' అని ప్రతిపాదించే పాశ్చాత్య సంప్రదాయాన్ని సమర్థించే వారికి ఆధునిక మలయాళ కవిత్రయం ఆ సూత్రానికి సన్నిహితంగా ఉండడం ఆనందాన్ని కలిగిస్తుంది. ఆ ముగ్గురూ విమర్శకులుగా కూడా పరిగణించ బడడానికి తగినన్ని విమర్శక రచనలు చేసిన వారే! అయితే — వారి విమర్శనల్లో స్ఫుటంగా కొన్ని లోపాలు కనిపిస్తయి. తక్కిన ఇద్దరికంటె ఉళ్లూర్ విమర్శక రంగ పరిధి మరింత విస్తృత మైంది. కవిత్వంతో పాటు ఆయన విమర్శక రచనలమీద కూడా ఉళ్లూర్ పాండిత్యం కొంతవరకు నీళ్ళు చల్లింది. సాహిత్య గ్రంథ విమర్శకి, ముఖ్యంగా ఒక ప్రాచీన కావ్య విమర్శకి పూనుకున్నప్పుడు అప్రయత్నంగానే అతి హడావిడిగా ఆయన తన పండితుడి ఉడుపులు ధరించి, దానిలో పూర్తిగా మునిగిపోతారు. పరిశీలకుడుగా తేదీలు, జీవిత చరిత్రలు, సాంఘి కార్థిక పరిస్థితులు సాహిత్య రూపాలు, ప్రక్రియలు మొదలైన వాటి భూతార్థాల విషయంలో చాలా కచ్చితంగా ఉంటా రనే ప్రసిద్ధి ఉంది. కాని, ఈ వివరా లన్నీ ఎదురుగా ఉన్నా కావ్య హృదయాన్ని దర్శించలేక పోవడం జరుగవచ్చు! ఆయన విమర్శనలో మరొక తీవ్ర లోపం ఉదాహరణలు అమితంగా గుప్పించడం. కేవలం దృష్టాంత ప్రాయంగా ఉండవలసిన ఆ ఉదాహరణలు చర్చనీయ గ్రంథ భాగాలలో కలిసి

పోయి శ్రద్ధాళువైన పాఠకుడి రస గ్రహణకి ప్రతిబంధకా లవుతున్నాయి. కవిత్వంలో కంటె విమర్శలో ఆయన మరింత 'నవ-పౌరాణిక' (Neo - Classical) దృష్టి ప్రదర్శించిన మాట నిజం! చారిత్రక వర్ణన ప్రలోభానికి గురి కానంత వరకూ విమర్శకుడుగా ఆయన స్పష్టంగా శాసకత్వ ధోరణి అవలంబిస్తారు. విజ్ఞాన దీపికలో ఆయన మలయాళ కవిత్వాన్ని గురించి వ్రాసిన వ్యాసం ఇందుకు తార్కాణం.

సూక్ష్మంగా పరిశీలిస్తే - ఉళ్ళూర్‌లో కొన్ని లక్షణాలు విమర్శకుడుగా ఆయన మీద మనకి ప్రీతి కలిగించేవి ఉన్నాయి. విమర్శకుడుగా ఆయన అమిత ఔదార్యం చూపిస్తారు ఇతర సాహిత్య విషయా లన్నిటిలో లాగానే ఈ అంశం లోనూ ఆయన గురుదేవుడు కేరళవర్మ వలియ కోయిల్ తంపురానే ఆయనకు మార్గ దర్శకుడు. ఆ గురువుగారు సాహిత్య రంగంలో చాలా ప్రాథమికా లయిన పసి రచనల్ని కూడా ప్రోత్సహిస్తూ ఉండేవారు పటక్కుంకూర్ చక్కగా నుడివి నట్లు – 'మంచి వాళ్ళు ఎప్పుడూ ఇతరుల్లోని మంచినే చెబుతారు' అనే సంస్కృత సూక్తి విమర్శ విషయంలో ఉళ్ళూర్ మతాన్ని స్పష్టం చేస్తూంది. సాహితీ ప్రమాణాల కంటె సానుభూతి ప్రాతిపదిక మీదనే ఉళ్ళూర్ సాహిత్య విమర్శ ఎక్కువగా సాగిం దనడం స్పష్టం!

అయితే - రాగ ద్వేష విరహిత మైన సాహితీ మూల్య నిర్ణయానికి పూను కుని, అనర్హంగా ప్రతిష్ఠ ఆర్జించిన వారి గుట్టు బయట పెట్టడం ఆయనకి తప్పని సరి అయిన సందర్భాలు కూడా కొన్ని లేక పోలేదు.

ఇంగ్లీషు చదువు ద్వారా విచ్చుకున్న పాశ్చాత్య విమర్శక నేత్రం ఆయన సాహిత్య విమర్శ కొనసాగించే సమయంలో చాలావరకూ నిరుపయోగ కరంగానే ఉండి పోయింది. అయితే - కాళిదాసు రఘువంశంలోని ఒక శ్లోకంలో గల ఔచిత్యాన్ని గురించి సాగిన చర్చ వంటి కొద్ది సందర్భాల్లో ఆ కన్ను పూర్తిగా ఉప యోగ పడింది. సంస్కృత మహాకవి కాళిదాసుకి ఏ చిన్న లోపాన్ని ఆపాదించినా సహించలేని ఎందరో విద్వాంసుల్ని ధైర్యంగా ఎదుర్కొని కాళిదాసుని ఆ శ్లోకం అనౌచిత్య దూషితమే అని ఉళ్ళూర్ వాదించారు. భారతీయ సంప్రదాయంపట్ల అంత గౌరవం గల ఉళ్ళూరే కాళిదాస మహాకవి ప్రయోగం పాశ్చాత్య విమర్శ కుల చెవికి కంటకంగా ఉంటుంది అని చాటి అంత పాషండత ప్రదర్శించా రంటే నమ్మ శక్యం కాని విషయం! తన వాదాన్ని ఆయన చాలా సమంజసంగా "Even the great Homer nods" (హోమర్ మహాకవి కూడా తల ఊపే

విషయం ఇది) అనే కొటేషన్‌తో ముగించారు. ఆధునిక మలయాళ కవిత్వాన్ని గూర్చిన మరొక చర్చలో కేరళ రచయితలు సంస్కృత సాహిత్యానికి గుడ్డిగా దాస్యం చేయడాన్ని తీవ్రంగా నిరసిస్తూ, పాశ్చాత్య దృష్టాంతాలనుంచి కూడా ఉత్తేజం పొందవలసిం దని వాళ్లని ఆయన ఉద్బోధించారు. కొన్ని సందర్భాల్లో విమర్శకుడు చేయవలసిన పని గ్రంథకర్తని వీపు తట్టి వదలివేయడమే అనే మాట మరచిపోయి, గ్రంథంలో దోషా లన్నీ సమగ్రంగా ఏకరువు పెట్టి దాన్ని తుండె తుండేలుగా ఖండించడం కూడా జరిగింది. అయితే ఆ గ్రంథకర్తలు మరీ తీవ్ర భావాలు ప్రకటించిన సందర్భాల్లోనే అలాంటి ఖండనకి ఆయన పూనుకున్నారు. కుట్టి కృష్ణ మారార్ తన 'సాహిత్య భూషణమ్'లో ప్రాచీన సంస్కృ తాలంకారి కుల్ని నిందించినందుకు ఉళ్లూర్ అతణ్ణి తీవ్రంగా మందలించారు.

ఉళ్లూర్ ఆధునిక దృష్టి తన స్వంత విమర్శక రచనల్లో కంటె ఇతరుల గ్రంథాలకు ఆయన వ్రాసిన ఉపోద్ఘాతాల్లో[1] మరింత ఎక్కువగా కనిపిస్తుం దనే వాడుక ఒకటి ఉంది. విప్లవాత్మక మైన ఇతివృత్తంతో కుమరన్ ఆశాన్ వ్రాసిన 'చండాల భిక్షుకి' అనే కావ్యాన్ని పరిచయం చేస్తూ, చాలా సానుభూతితోనూ, అవగాహనతోనూ ఇతివృత్తపు విప్లవాత్మక స్వభావాన్నీ, ఆ కావ్య ప్రాశస్త్యాన్నీ ఆయన వివరించారు. ప్రశంసించడానికి ఆయన ఎంచుకున్న రచనల వైవిధ్యం చూస్తే ఆయన అభిరుచి ఎంత విశ్వజనీన మైందో విశద మవుతుంది. ప్రాచీనతని నిరసించే చెంగంపుళ కృష్ణపిళ్ల, ఇటప్పళ్లి రాఘవన్ పిళ్ల[2] వంటి ఆధునిక కవుల్ని కూడా అభినందించ గలగడంలో ఆయన నిజమైన సాహిత్య ప్రీతి, కవి జన ప్రీతీ స్పష్టం అవుతాయి. జి. శంకర కురుప్పు, కె. కె. రాజా, నాలప్పాట్టు నారాయణ మేనోన్ వంటి యువ కవుల రచనల్ని కూడా ఆయన ప్రోత్సహించారు.

రచయితని లాక్షణికంగా 'శబ్ద వ్యాపారి' **(man of letters)** అంటారు. డా రాధాకృష్ణన్ చేత చాలా గౌరవంగా 'మహా విద్వాంసుడూ, మహాకవీ' అని స్మరించబడిన ఉళ్లూర్ కేవల శబ్ద వ్యాపారి కాడు; ఆయన కార్య దక్షుడు **(man of action)** కూడా! నిరుపమాన మైన ఆయన పాండిత్యం నిర్విరామ మైన

---

1. సుమారు 170 ఉపోద్ఘాతాలు ఆయన వ్రాశారు మలయాళంలో ఆయన వ్రాసినన్ని ఉపోద్ఘాతాలు మరి ఎవరూ వ్రాయలేదని వాడుక.
2. చూ. చెంగంపుళ 'సంకల్పకాంతి' కీ, ఇటప్పళ్ళి 'తుషార హారమ్' కీ ఆయన వ్రాసిన ఉపోద్ఘాతాలు.

ఆయన కృషివల్లా, కర్మయోగం వల్లా లభించిన ఫలితం. ఆయన ఘనత ఆయన పాండిత్యంలో ప్రతిఫలిస్తుంది. ఉళ్లూర్‌ను ఈ క్రింది విధంగా రాధాకృష్ణన్ ప్రశంసించినప్పుడు మనందరి మనస్సుల్లో ఉన్న మాటే ఆయన చెప్పా రనిపిస్తుంది.

"ప్రభుత్వోద్యోగి అయినా, చీఫ్ సెక్రటరీ స్థాయి అందుకున్నా, ఆయన నిజమైన హృదయం ఎప్పుడూ సాహిత్య రంగానికే, వైదుష్యానికే అంకిత మైంది. ఎప్పుడూ ఆయన వాటిని ఉజ్జగించలేదు. మనలో చాలా మంది 'నేను చేస్తున్న పని చాలా క్లిష్టమైంది. అందుచేత నేను ఎక్కువగా రాణించలేక పోయాను' అని సాకులు చెబుతూ ఉంటారు. కాని, నిజంగా మహనీయు లైన వారు ఒక విషయాన్ని తమ ఆశయంగా ఎంచుకుంటే, ఎన్నడూ దాన్ని అశ్రద్ధ చేయరు. ఉళ్లూర్‌కి అభీష్టమైనవి: మలయాళ సాహిత్యం, కవిత్వం, తమిళ వైదుష్యం, సంస్కృత వైదుష్యం. వీటన్నిటి విషయంలోనూ ఆయన సుదీర్ఘకాలం కృషిచేశారు."[1]

తిరువనంతపురంలో జరిగిన సమస్త కేరళ సాహిత్య పరిషత్ 28వ వార్షిక సమావేశాన్ని ప్రారంభిస్తూ డా. రాధాకృష్ణన్ చేసిన ప్రసగం కూడా చూడ దగింది. ఆ సందర్భంలో ఆయన ఉళ్లూర్‌ని ఇలా స్మరిస్తారు: "కొంతమంది ఆధునిక మలయాళ రచయితల పేర్లు మాత్రమే స్మరించి ఊరుకోవడం అనుచితం. అయినా ఉళ్లూర్ పరమేశ్వరయ్యర్, వళ్లత్తోళ్ నారాయణ మేనోన్ ల పేర్లు ఈ సందర్భంలో మనకు గుర్తు రాకుండా ఉండవు. వా రిద్దరితోనూ స్వల్పంగా పరిచయ భాగ్యం నాకు కలిగింది."

(చూ. "రాష్ట్రపతి రాధాకృష్ణన్ ప్రసంగాలూ-రచనలూ"-పుట 239)

# 10. శిఖరాయమాన మైన రచన

ఇక – పండితుడుగా, విమర్శకుడుగా, పరిశోధకుడుగా, వచన రచయితగా ఉళ్లూర్ సాధించిన శిఖరాయమాన మైన రచన అయిన 'కేరళ సాహిత్య చరిత్రమ్'ను గురించి చెప్పుకోవలసి ఉంది. దాని భౌతిక పరిమాణపు వివరాలే ఎవరి నైనా హడల గొట్ట గలవు. 7 భాగాలూ, 64 అధ్యాయాలూ గల ఆ 3,000 పుటల

1. మహాకవి ఉళ్లూర్ స్మారక గ్రంథాలయ, పరిశోధక సంస్థకి ప్రారంభోత్సవం చేస్తూ డా. రాధాకృష్ణన్ చేసిన ప్రసంగం నుంచి. చూ. 'శత జయంతి సంపుటం – మహాకవి ఉళ్లూర్' – పుట. 159.

గ్రంథం అయిదు సంపుటాలుగా వెలువడింది. ఆ బృహద్రచన కోసం 30 ఏళ్ళ పాటు ఆయన విషయాలు సేకరించారు.ఎవరి సహాయం లేకుండా 12 ఏళ్ళ పాటు స్వయంగా తనే ఆ గ్రంథం అంతా వ్రాశారు. తీవ్రంగా వ్యాధిగ్రస్తులై ఉన్న సమయంలో ఆ గ్రంథం చివరి భాగం వ్రాసి పూర్తి చేశారు. పరమపదించడానికి మూడు రోజుల క్రితం ఆఖరు వాక్యం వ్రాశారు. తరువాత మూడు రోజులూ ఇంచు మించు ఆయన మన స్పృహలో లేరు. మరణానంతర ప్రచురణగా వెలువడిన ఆ గ్రంథాన్ని పరిష్కరించి ప్రకటించడానికి కేరళ విశ్వవిద్యాలయం వారు నాలుగు సంవత్సరాలు శ్రమించవలసి వచ్చింది.

పరిమాణం దృష్ట్యా మలయాళ భాషలో వెలువడిన గొప్ప మౌలిక రచన అదే! నాణ్యం దృష్ట్యా చూసినా మలయాళ వచన రచనల కన్నిటికీ అది తల మానికం! నిస్సందేహంగా ఉళ్ళూర్ శిఖరాయమానమైన రచన అది. 1915 లో వెలువడిన 'ఉమా కేరళమ్' తొలి ముద్రణలోనే దీనిని గూర్చిన ప్రకటన వెలువడడం చూస్తే, మలయాళ సాహిత్యాని కొక సమగ్ర చరిత్ర వెలయించడం నాటికే ఆయన జీవిత ధ్యేయంగా గ్రహించినట్టు విశదమవుతుంది. ఇంచు మించు అదే కాలంలో ఆయన సతీర్థ్యుడైన స్వదేశాభిమాని కె. రామకృష్ణ పిళ్ల కూడా అలాంటి గ్రంథం వ్రాయాలని సంకల్పించి, పరమేశ్వరయ్యర్ ప్రకటన చూసి తమ యత్నం విరమించు కున్నారట! 1924 లో తన సాహిత్య చరిత్ర రచనకి అంతరాయం కలిగిస్తూ తనని ఎలాంటి వ్యాసాలూ అర్థించవద్దని పత్రికా సంపాదకులను కోరుతూ ఆయన ఒక ప్రకటన చేశారు. సమస్త కేరళ సాహిత్య పరిషత్తులో ఆరంభ దశలో ఒక ప్రామాణికమైన, అసందిగ్ధ మైన మలయాళ సాహిత్య చరిత్ర వెలువడ వలసిన ఆవశ్యకత ఉందని తరచు ఉద్ఘాటించ బడుతూ వచ్చింది. 1927 లో జరిగిన పరిషత్ ప్రథమ వార్షిక సమావేశంలో ఇలాంటి సాహిత్య చరిత్రని రూపొందించడం కోసం ఒక ఉప సంఘాన్ని ఏర్పాటు చేస్తూ తీర్మానించారు. ఆ ఉప సంఘంలో ఉళ్ళూర్ కూడా ఉన్నారు. ఎలాగైనా ఆ చరిత్ర పూర్తి చేయడం ఆయన జీవిత ధ్యేయాల్లో ఒకటి అయింది. ఉద్యోగ విరమణ అనంతరం ఆ జీవితాశయ సాధన కోసమే ఆయన జీవించి ఉన్నారని కేరళలో చాలామంది నమ్మకం.

మలయాళ భాషలో మొట్ట మొదటి సంపూర్ణ సాహిత్య చరిత్ర వెలువడిన 84 ఏళ్లకు ఈ 'కేరళ సాహిత్య చరిత్రమ్' వెలుగు చూసింది. పి. గోవింద పిళ్ల వ్రాసిన ఆ తొలి రచనలో సాధారణంగా తొలి ప్రయత్నంలో ఉండే లోపా లన్నీ

ఉన్నాయి. అనంతరం వచ్చిన సాహిత్య చరిత్రలు కూడా అయితే అసమగ్రలో, లేదా పార్య గ్రంథ ధోరణిలో వ్రాసినవో కావడంతో ప్రామాణికత, సమగ్రత గల మలయాళ సాహిత్య చరిత్ర చిరకాలంగా తీరని కోరికగానే మిగిలిపోయింది. ఆ స్థితిలో ఉళ్ళూర్ సాహిత్య చరిత్ర కేరళ సాహితి పాఠకుల తపః ఫలితంగా వెలువడింది.

ఇలాంటి బృహత్ సాహిత్య చరిత్రల నిర్మాణానికి కొన్ని ఇతర భారతీయ భాషల్లో[1] కూడా ప్రయత్నాలు జరిగినయి. అయితే – ఆ పథకాలను ఒక విడి వ్యక్తి కాక కొంతమంది విద్వాంసుల బృందాలు చేపట్టినయి. ఒకే వ్యక్తి ఒక్కచేతి మీదుగా ఇలాంటి బృహత్కార్య సాధనకు పూనుకున్న సందర్భం భారతీయ భాషా సాహిత్యాల్లో కనీ వినీ ఎరుగని విషయం! రచయితల్ని గురించీ, వారి రచనల్ని గురించీ – ఆ రచయిత లెంత అప్రధానులైనా సరే – సమాచారం సేకరించడానికి ఆయన దేశంలో విస్తృతంగా పర్యటించారు. ఈ గ్రంథ రచనా కాలంలో అద నపు భోగట్టాల్ని ఆర్థిస్తూ వందల కొద్దీ మందికి స్వయంగా ఆయన ఉత్తరాలు వ్రాశారు. ఈ బృహత్ సాహిత్య చరిత్ర రచనా కార్యం ప్రపంచ సాహిత్యం లోనే విల్‌డ్యురాంట్ 'నాగరకత కథ' లాంటి బృహద్గ్రంథాల రచనతో సరిపోల్చ దగింది. ఈ గ్రంథానికి తుది సవరణలు, పున స్సంశోధనం జరిపే అవకాశం ఆయనకు లేకుండా పోవడం చాలా విచారకర మైన విషయం!

ఈ చరిత్రలోని 64 అధ్యాయాల్లోనూ దాదాపు పది అధ్యాయాలు కేరళ రచయితలు వ్రాసిన సంస్కృత రచనల చరిత్ర. ఉళ్ళూర్ రచనలోని విశిష్ట లక్ష ణాల్లో ఒకటి సంస్కృత సాహిత్యానికి కేరళ దేశం చేకూర్చిన పుష్టికి ప్రత్యేక గౌరవం కల్పించడం. తత్పూర్వ సాహిత్య చరిత్ర రచయిత లెవ్వరూ ఈ అంశాన్ని విస్తృతంగా తరచి చూసే ప్రయత్నం చెయ్యలేదు. కచ్చితంగా చెప్పాలంటే మల యాళ రచనల్ని గురించిన చరిత్రలో సంస్కృత రచనల పరామర్శకి స్థానం లేదు. కాని, స్వస్థానాభిమాన పూరితుడైన ఉళ్లూర్‌కి సంస్కృతంలో గ్రంథాలు వెల యించిన శంకరాచార్య, విల్వమంగళ్, నారాయణ భట్టాతిరి వంటి ప్రముఖ కేరళ రచయితలను పరిహరించడానికి మన సొప్పలేదు. ఒక సంగతి గమనించాలి. ఈ

---

1. ఉదాహరణకి – కన్నడంలో మైసూరు విశ్వవిద్యాలయ పర్యవేక్షణలో కొందరు సాహితీపరులు ఏకమై అలాంటి బృహత్ సాహిత్య చరిత్ర తయారు చేస్తున్నారు.

గ్రంథనామం 'మలయాళ సాహిత్య చరిత్ర' కాదు: 'కేరళ సాహిత్య చరిత్ర'. ఆ పేరే ఈ పద్ధతిని సమర్థిస్తూంది.

మొదటి ఆరు అధ్యాయాల్లో భాషా స్వభావం, ద్రావిడ భాషా కుటుంబం, మలయాళ భాష ఉత్పత్తి, మలయాళ, సంస్కృత భాషల మణి ప్రవాళ రూప సమ్మేళనం మొదలైన ప్రాతిపదికాంశాల చర్చ కొనసాగింది. అతః పూర్వం సాహిత్య చరిత్ర రచయితలు పట్టించుకోని జానపద సాహిత్యానికి దీనిలో గుర్తింపు లభించింది. ఆ జానపద సాహిత్యం ఉత్తరాది విభాగం, దక్షిణాది విభాగం అని రెండు వర్గాలుగా విభక్తమైంది 'కిళిప్పాట్టు', చంపూ,[1] 'ఆట్టక్కథ', 'తుళ్లాళ్', 'వెణ్మణి' ప్రస్థానాలు మొదలైన వివిధ సాహిత్యోద్యమాలు తగినంత విపులంగా వర్ణించబడినయి మైలు రాళ్లుగా కనిపించే ప్రముఖ ప్రాచీన కవులందరిని గురించీ సభక్తికంగానూ, సవిమర్శకంగానూ, సమగ్రంగానూ చర్చించారు. అతః పూర్వపు సాహిత్య చరిత్ర లన్నీ పరిహరించిన మారుమూల రచనలూ, రచయితలూ రచయిత అభినందనలతో సహా ఈ చరిత్రలో స్థానం సంపాదించారు. పెద్దా, చిన్నా-రచయిత లందరి రచనల నుంచీ రసపద్భాగాలు విస్తృతంగా ఉదాహరించబడటం వల్ల ఈ గ్రంథం మరింత ఉపయోగకరంగా రూపొందింది. మొత్తం 500 పై చిలుకు గ్రంథ కర్తల్ని గురించీ, 3 000 పై చిలుకు గ్రంథాల్ని గురించీ ఈ సాహిత్య చరిత్రలో ఆయన వివరించారు.

కేరళ సాహిత్య చరిత్ర వెలువడిన తర్వాత విమర్శ రంగంలో సాగిన విస్తృత మైన కృషివల్ల ఈ బృహద్రచనలో అనేక లోపాలు గుర్తించబడిన మాట నిజమే! అయితే - రచయిత మరి కొంతకాలం జీవించి ఉంటే తేలికగా సవరించుకొని ఉండే అల్పమైన దోషా లివి. అయితే పరిశోధన రంగంలో అంతకు ముందు కృషిచేసి ఉన్న విద్వాంసుల్ని కృతజ్ఞతతో స్మరించడం లాంటి మర్యాదల్ని కచ్చితంగా ఉళ్లూర్ పాటించా రని చెప్పడానికి వీల్లేదు. అంతే కాక - కాలనిర్ణయం, గ్రంథ కర్తృత్వం, సమన్వయం వంటి వాటిలో ఆయన చేసిన చాలా నిర్ణయాలు అనంతర కాలంలో ప్రశ్నించబడినయి. ఇలాటి లోపాలు ఉన్నా ఈ సాహిత్య చరిత్ర తత్పూర్వ చరిత్రల నన్నింటినీ మరుగున పడి పోయేట్టు చేసిం దనడంలో ఎంత

---

1. అంతకు ముందే ఉళ్ళూర్ ఒక 'చంపూ సాహిత్య సమగ్ర చరిత్ర' ప్రకటించి ఉన్నారు. మొదట కేరళ విశ్వవిద్యాలయంలో చదివిన 'అతిథి ఉపన్యాసం' యొక్క విస్తృత రూపం అది.

మాత్రం సందేహం లేదు. భవిష్యత్తులో కూడా దీన్ని తలదన్నిన చరిత్ర వెలువడడం అసంభవ మని ధైర్యంగా జోస్యం కూడా చెప్పవచ్చు!

సాహిత్య చరిత్ర ప్రయోజనం ఏమిటి? సాహిత్య చరిత్ర "సాధారణ పాఠకుడు సాహిత్యాన్ని ఆస్వాదించడానికి తోడ్పడాలి. లేకపోతే అది బూడిదలో పోసిన పన్నీరే!" అన్నాడు జార్జ్ శాంప్సన్.[1] ఉళ్లూర్ రచన ఈ ప్రయోజనాన్ని అద్భుతంగా సాధిస్తూంది. ఆయన శైలి మరింత ధారాళ మైంది; మామూలుగా ఉండే జటిలత తగ్గి పోయింది. పాండిత్య గౌరవంతోనూ, విషయ విస్తృతితోనూ పాఠకుణ్ణి ఒక వంక ఉక్కిరి బిక్కిరి చేస్తున్నా, మరొక వంక ప్రతిభతో, మాధుర్యంతో, ఠీవిగా సాగే వచన శైలితో ఈ గ్రంథం అతణ్ణి అలరించకుండా ఉండదు. హుందాతనం, ధారా శుద్ధీ ఆయన రచనా శైలిలో ఎప్పుడూ ఉన్నాయి. ఈ గ్రంథ శైలిలో కొత్తగా అలవడిన విశేషం: మాధుర్యం. ఈ సాహిత్య చరిత్రలోని ఆయన శైలి మిల్టన్ శైలిలోని ఆర్గన్ సంగీతాన్నీ, 'శుద్ధ–మద్దళిక'[2] వాద్యాన్నీ తలపింప జేస్తూంది. ఒక కవి చివరి రచన కావ్యం కాకుండా వచన రచన కావడం దురదృష్టం. 'కేరళ సాహిత్య చరిత్రమ్' పాండిత్యానికి శిఖరం; వచనంలో పరాకాష్ఠ; విమర్శలో మహోన్నత శృంగం!

# 11. సింహావలోకనం

శక్తిమంతుడైన ప్రతి కవీ తన పాఠకుల మనస్సుల్లో ఉద్వేగ భరితమైన ఒక పరివేషాన్ని సృష్టించుకుంటాడు. ఆ పరివేషం ద్వారానే సాధారణంగా వాళ్ళు ఆయన్ని దర్శించడం, అర్థం చేసుకోడం జరుగుతూ ఉంటుంది. అలాంటి ఒక కాంతి పరివేషాన్ని తన చుట్టూ ఉళ్ళూర్ కూడా సృష్టించుకున్నాడు. మలయాళం కూడా భారత రాజ్యాంగంలో గుర్తించబడిన ఒక ద్రావిడభాష అని తప్ప అంతకంటె మలయాళాన్ని గురించి ఎక్కువ పరిజ్ఞానం లేని మలయా ళేతరుల దృష్టిలో సుదీర్ఘమైన 'ఉళ్ళూర్ ఎస్ పరమేశ్వర అయ్యర్' అనే పేరుకి గాని, ప్రేమతో వ్యవహారంలోకి వచ్చిన 'ఉళ్ళూర్' అనే సంక్షిప్త నామానికి గాని

1. చూ "The Concise Cambridge History of English Literature" - తొలి ముద్రణ ఉపోద్ఘాతం,

2. కథాకళి నాట్యంలో వాడే ఒక రకమైన మృదంగం.

ఎలాంటి ప్రాధాన్యం లేకపోవచ్చు! కాని, మలయాళీల మనస్సుల్లో మలయాళ సాహిత్యంలో 'న భూతో, న భవిష్యతి' అనిపించే ఒక అమరుడైన, నానాముఖ ప్రతిభాశాలి అయిన మహా మనీషిని గూర్చిన మధుర స్మృతులను ఆ పేరు రేపుతుంది. కవిగా, విమర్శకుడుగా, పరిపాలకుడుగా, పండితుడుగా, చరిత్ర రచయితగా సుప్రసిద్ధుడైన ఆ మనీషి నాటకం, వ్యాసం, అనువాదం అనే రంగాల్లో కూడా చెప్పుకోదగ్గ విజయాలు సాధించారు. ఆయన రచనల్ని గూర్చిన భౌతిక వివరాలు ఆశ్చర్య జనకాలు. ఆయన వ్రాసిన కావ్యాలు 30 పైచిలుకు ఉన్నాయి. వాటిలో ఒకటి మహా కావ్యమ్; ఆరు ఖండ కావ్యాలు; పన్నెండు కావ్య సంపుటాలు. ఇవి కాక తొలినాటి పద్యాలూ, నానా విషయాలమీద అప్పు డప్పుడు వ్రాసినవీ ఇంకా ఎన్నో ఉన్నయి. మహా కావ్యంలో 19 సర్గలు; 2,000 పైచిలుకు శ్లోకాలు. ఖండ కావ్య సంపుటాల్లో వెయ్యి పైచిలుకు ఖండిక లున్నయి. మహా భారత తేతివృత్తం తీసుకుని ఒక పెద్ద వచన నాటకం కూడా ఉళ్ళూర్ వ్రాశారు. ఆయన వచన రచనలు సుమారు పది దాకా ఉన్నయి. వాటిలో ఒకటైన 'కేరళ సాహిత్య చరిత్రమ్' ఒక్కటే బాహ్యరూపంలోనూ, ఆంతర మైన విలువలోనూ కూడా మలయాళంలోని ఏ ఇతర రచన నైనా తలవంచుకునేట్టు చేయగల బృహద్రచన. మరొక వచన రచన : ఆయన పరిశోధక వ్యాసాలతోనూ, సాహిత్య విమర్శలతోనూ కూడిన సంపుటం. అది కూడా ఆయన సాహిత్య చరిత్రతో సరిపోల్చ దగిన బృహద్రచన. ఇక - వివిధ సాహిత్య గ్రంథాలకు ఆయన వ్రాసిన ఉపోద్ఘాతాలూ, పరిచయాలూ వందల సంఖ్యలో ఉన్నయి.

హిమవన్నగ సదృశమైన ఈ ప్రతిభని గురించీ, సాహిత్య వ్యాసంగాన్ని గురించీ చెప్పుకో దగిన అద్భుతమైన ఒక విషయం ఏమిటంటే — అది విశ్రాంతితో కూడిన ఏకాంత జీవితంలో రూపొందింది కాదు; అత్యున్నత విద్యార్హతలు సంపాదించిన అనంతరం రాజ్యాంగ నిశ్రేణికలో నిర్విరామంగా మీది మీది మెట్లకు ఎగబ్రాకుతూ ఉన్న కాలంలో సాధించబడింది. ఆవేశం ముఖ్యం అనే వాళ్ళూ, సృజనాత్మకారంగంలో నిర్విరామ కృషిని నిరసించేవాళ్ళూ కూడా కొంద రుండవచ్చును. కాని, ఈ విధంగా తన సర్వ శక్తులూ వినియోగించి కృషి చెయ్యా లంటే నిస్సందేహంగా ఆ వ్యక్తి ఆవిష్టుడై ఉండాలి. సృజ నాత్మక రంగంలో ముమ్మాటికీ ఆవేశం ముఖ్య మని మనం ఒప్పుకుంటాం! కాని, ఆ ఆవేశంవల్లనే తీవ్ర పరిశ్రమ ఉత్పన్న మవుతుందనీ, పరిశ్రమ అనేది ఆవేశం యొక్క ఘనీభూత రూపం మాత్రమే అనీ కూడా మనం అంగీకరించక తప్పదు.

మాత్రం సందేహం లేదు. భవిష్యత్తులో కూడా దీన్ని తలదన్నిన చరిత్ర వెలువడడం అసంభవ మని ధైర్యంగా జోస్యం కూడా చెప్పవచ్చు!

సాహిత్య చరిత్ర ప్రయోజనం ఏమిటి? సాహిత్య చరిత్ర "సాధారణ పాఠకుడు సాహిత్యాన్ని ఆస్వాదించడానికి తోడ్పడాలి. లేకపోతే అది బూడిదలో పోసిన పన్నీరే!" అన్నాడు జార్జ్ శాంప్సన్.[1] ఉళ్లూర్ రచన ఈ ప్రయోజనాన్ని అద్భుతంగా సాధిస్తూంది. ఆయన శైలి మరింత ధారాళ మైంది; మామూలుగా ఉండే జటిలత తగ్గి పోయింది. పాండిత్య గౌరవంతోనూ, విషయ విస్తృతితోనూ పాఠకుణ్ణి ఒక వంక ఉక్కిరి బిక్కిరి చేస్తున్నా, మరొక వంక ప్రతిభతో, మాధుర్యంతో, ఠీవిగా సాగే వచన శైలితో ఈ గ్రంథం అతణ్ణి అలరించకుండా ఉండదు. హుందాతనం, ధారా శుద్ధీ ఆయన రచనా శైలిలో ఎప్పుడూ ఉన్నాయి. ఈ గ్రంథ శైలిలో కొత్తగా అలవడిన విశేషం: మాధుర్యం. ఈ సాహిత్య చరిత్రలోని ఆయన శైలి మిల్టన్ శైలిలోని ఆర్గన్ సంగీతాన్నీ, 'శుద్ధ–మద్దళిక'[2] వాద్యాన్నీ తలపింప జేస్తూంది. ఒక కవి చివరి రచన కావ్యం కాకుండా వచన రచన కావడం దురదృష్టం. 'కేరళ సాహిత్య చరిత్రమ్' పాండిత్యానికి శిఖరం; వచనంలో పరాకాష్ఠ; విమర్శలో మహోన్నత శృంగం!

## 11. సింహావలోకనం

శక్తిమంతు డైన ప్రతి కవీ తన పాఠకుల మనస్సుల్లో ఉద్వేగ భరిత మైన ఒక పరివేషాన్ని సృష్టించుకుంటాడు. ఆ పరివేషం ద్వారానే సాధారణంగా వాళ్ళు ఆయన్ని దర్శించడం, అర్థం చేసుకోడం జరుగుతూ ఉంటుంది. అలాంటి ఒక కాంతి పరివేషాన్ని తన చుట్టూ ఉళ్ళూర్ కూడా సృష్టించుకున్నాడు. మలయాళం కూడా భారత రాజ్యాంగంలో గుర్తించబడిన ఒక ద్రావిడభాష అని తప్ప అంతకంటె మలయాళాన్ని గురించి ఎక్కువ పరిజ్ఞానం లేని మలయా ళేతరుల దృష్టిలో సుదీర్ఘ మైన 'ఉళ్ళూర్ ఎస్ పరమేశ్వర అయ్యర్' అనే పేరుకి గాని, ప్రేమతో వ్యవహారంలోకి వచ్చిన 'ఉళ్ళూర్' అనే సంక్షిప్త నామానికి గాని

1. చూ "The Concise Cambridge History of English Literature" - తొలి ముద్రణ ఉపోద్ఘాతం,
2. కథాకళి నాట్యంలో వాడే ఒక రకమైన మృదంగం.

రాజరాజ వర్మ రాజా. ఈ వర్గంవారు - మలయాళ సాహిత్యంలోకి వెల్లువలాగ వచ్చి పడుతున్న ఆధునిక కవితా ధోరణుల స్వరూప స్వభావాలు తెలియని ప్రాచీనాలంకార సంప్రదాయ వీర సమర్థకులు దురదృష్ట వశాత్తు ఈ విధంగా ప్రాచీన ఆధునిక, సంప్రదాయాల్ని సమర్థించే ఈ ఇరువర్గాలవారూ ఒండొరులతో తలపడడంతో ఉళ్ళూర్‌ని అభ్యుదయ నిరోధకుడైన కవి అనీ, సంప్రదాయానుయాయి అనీ ముద్ర వేయడం జరిగింది. ప్రాచ్య, పాశ్చాత్య కవితా రీతుల్లో నిష్ణాతులైన జోసెఫ్ ముండ శ్శేరి ఉళ్ళూర్ కవిత్వాన్ని నిర్దాక్షిణ్యంగా విశ్లేషించి దానిలోని గోరంతలైన దోషాల్ని కొండంతలుగా ప్రదర్శింప జూడడంతో పరిస్థితి తారస్థాయికి వచ్చింది. అప్పుడు ఉళ్ళూర్ కవితా సమర్థనలు శర పరంపరలుగా వచ్చి ఆయన యశస్సును సురక్షితం చేయ యత్నించినయి. అయితే - అట్టి ప్రయత్నాల్లో కనిపించిన అవిమర్శకమైన అభిమాన తీవ్రతవల్ల వాటికి విశ్వసనీయత సిద్ధించక, వాటి ప్రయోజనం అవి సాధించలేక పోయినయి.

విమర్శక రంగంలో వెలసిన ఈ అతివాదాలకు కారణం: కవి జీవిత చరిత్రను సరిగా అధ్యయనం చేయక పోవడం; ఆయన కావ్యాలు శ్రద్ధగా చదివి అర్థం చేసుకోక పోవడం. ఆయన ప్రశంసకులూ, అభిశంసకులూ కూడా దారిద్ర్యంలో కష్టాల మధ్య ఆయన ఎలా పెరిగి పెద్దవా డయిందీ, జీవితంలో చేదు భాగం కూడా ఆయన ఎలా ప్రత్యక్షంగా అనుభవించిందీ మరచి పోయారు. ఈ వాస్తవ చిత్రం మరుగున పడి వాళ్ల మనస్సుల్లో ఆయన ఆగర్భ శ్రీమంతు డనే చిత్తరువే స్పష్టంగా నిలిచి ఉన్నట్టు కనిపిస్తుంది. మరొక భ్రమ - ఈ కవి అగ్రవర్ణు డైన బ్రాహ్మణు డనీ, సామాన్య ప్రజలకు దూరంగా అత్యున్నత అధికార పదవుల్లో ఉన్న వా డనీ భావించడం. వెనుకటి అధ్యాయాల్లో వివరించిన ఆయన జీవిత చరిత్ర ఇవన్నీ కేవలం నిరాధార మైన అపోహ లని స్పష్టం చేయగలదు. వెనుకటి అధ్యాయాల్లో సూచించిన అభిప్రాయాలను దృష్టిలో ఉంచుకుని ఉళ్ళూర్ కవితను సింహావలోకనం చేస్తే ఆయన వాస్తవ వ్యక్తిత్వ మూర్తి మరింత స్పష్టంగా గోచరం కాగలదు.

మహాకవి జీవిత చరిత్రను సరియైన పద్ధతిలో అధ్యయనం చేస్తే ఇంతవరకూ ఆయన జీవిత చరిత్రకారుల ఉపేక్ష వల్ల కొంతా, విమర్శకుల ఔదాసీన్యం వల్ల కొంతా ఆయన్ని గురించి ప్రచార మైన అభూత కల్పన లన్నీ క్షణంలో మటు మాయం కాగలవు ఆ అపోహలను తొలిగించడానికి ప్రస్తుతం అందుబాటులో ఉన్న ఫోటోగ్రాఫ్‌లే చాలు! ఆయన జీవితాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తే లెక్కలేనన్ని

కష్టాల్ని ఎదుర్కొంటూ వచ్చిన ఒక అసహాయ వీరుని మూర్తి, ఆ సంఘర్షణల ఫలితంగా దయార్ద్ర హృదయుడైన ఒక సాధు స్వభావుని రూపం మన కన్నుల ముందు నిలుస్తుంది. దారిద్ర్యానికీ, లేమికీ గురి అయినందువల్ల అనాథల, అధో వర్గాలవారి యాతనల పట్ల సహజంగా ద్రవించి పోయే లక్షణం ఆయన మనస్సుకి అలవడింది. నిరంతర కర్మయోగాన్ని గూర్చి విజయ గీతాలు ఆలపించకుండా ఆయన ఉండ లేకపోయారు. ఈ ఆధునిక కాలంలో సగర్వంగా ప్రదర్శించదగిన 'కవిమూర్తి' ఇది. అయితే - ఒక అంశం మనం గుర్తుంచుకోవాలి! ఆయన పునాదులు మాత్రం సాంస్కృతిక సంప్రదాయం తాలూకు సనాతన మైన విలువల్లోనే ఉన్నాయి.

ఉళ్ళూర్‌కి వ్యతిరేకంగా వచ్చిన ప్రధాన మైన విమర్శ : ఆయన పురాతన భావాల ప్రభావానికి తల ఒగ్గారనీ, అలంకారాలు అమితంగా వాడుతూ, ఆడంబర మైన, కృతకమైన శైలితో తన కావ్యాల్లోని ఆవేశ ధారకు భంగం కలిగించారనీ. 19 వ శతాబ్ది తుది దశకంలోనూ, 20 వ శతాబ్ది తొలి దశకంలోనూ కేరళ సాహిత్య పరులమధ్య చెలరేగిన తీవ్రమైన 'ద్వితీయాక్షర ప్రాస వాదం' ఆయనను ఖండించే వారికి తగినంత ఆయుధ సామగ్రి అందజేసింది. నిజాని కది ఒక టీ కప్పుతో తుపాను. చెప్పుకోదగిన సిద్ధాంత సంబంధమైన అంశా లేవీ ఆ వివాదంలో చర్చకు రాలేదు. అయితే రచయితల్ని విశేషంగా కల్లోలపరచి, అన్యోన్య దూషణలతో కూడిన వాక్కలహాలకి అది కారణమైంది. పద్యంలో ప్రతిపాదంలోని రెండో అక్షరంలో ప్రాసవేసే ఆచారం అర్థరహితం అని కొందరు ఎదురు తిరగడమే ఆ వివాదానికి పైకి కన్పించే కారణం. మలయాళ ఛంద శ్శాస్త్రంలో ఆ నియమాన్ని 'ద్వితీయాక్షర ప్రాస' అంటారు. అంతవరకూ మలయాళ కవుల్లో ఎక్కువమంది ధ్వని సారూప్యం విషయంలో ఆ ప్రాస స్వచ్ఛతను కాపాడుకుంటూ వచ్చారు. ఏ ఇతర భారతీయ భాషలోనూ ఇంత కఠోరంగా పాటించబడని ఈ ప్రాసను అవశ్యం పాటించదగిందిగా విధించడం అన్యాయ మని కొందరు కవులు ఎదురు తిరిగారు. అంత వరకూ – ఆ కల్లోలంలో ఆధునిక విప్లవ లక్షణాల బీజం ఇమిడి ఉందని ఒప్పుకోవాలి! అయితే – వాదంలో పాల్గొన్న వారిలో ఎలాంటి ఖచ్చితమైన నమ్మకాలు గాని, నిజాయితీ గాని, లోపించడంతో కలహిస్తున్న ఇరు పక్షాల మధ్యా లక్ష్య సంబంధమైన భేదం స్పష్టంగా గుర్తించడం సాధ్యం కాదు. ఇంచుమించు అది వ్యక్తులమధ్య సాగిన వివాదం. కవిత్వ ప్రాశస్త్యాన్ని గురించిన భావాలు కాక, ఆ యా వ్యక్తులపట్ల గౌరవభావమే రచయితలు ఏదో

ఒక వర్గంలో చేరడానికి కారణమైంది. 'ద్వితీయాక్షరప్రాస'ను సమర్థించే పక్షానికి నాయకుడు: సాటిలేని విద్వాంసుడు కేరళవర్మ వలియ కోయిల్ తంపురాన్ తద్ వ్యతిరేక పక్షానికి మహా వైయాకరణి,[1] కేరళవర్మ అన్నగారికొడుకు అయిన ఏ. ఆర్. రాజ రాజ వర్మ నాయకత్వం వహించారు

కేరళవర్మ పట్ల తనకు గల అచంచల మైన భక్తివల్ల వెంటనే ఉళ్ళూర్ ఆయన పక్షాన రంగంలోకి ఉరికి, ఆయనకు ఇష్టమైన 'ద్వితీయాక్షరప్రాస'ను సమర్థించడానికి పూనుకున్నారు ఉళ్ళూర్‌యొక్క ఈ ప్రత్యక్ష పక్షపాత ప్రవర్తన ఆయన విమర్శకులకు చక్కని ఆయుధంగా ఉపయోగపడింది. వాళ్ళు ఆయన్ని సంప్రదాయ దుర్గ రక్షకుడుగా, సాహిత్యంలో సంప్రదాయవాదిగా, పరిణామ వ్యతిరేక వాదిగా చిత్రించారు. అయితే — రచయితల్ని 'ద్వితీయాక్షర ప్రాస' వివాదంలో వాళ్ళు సమర్థించిన పక్షం దృష్ట్యా వర్గీకరింప జూచే యత్నం నిరర్థక మైంది; అవిశ్వసనీయ మైంది. ఏమంటే - కేరళవర్మ సాహిత్యంలో అనేక రంగాల్లో ఆధునిక మైన అభ్యుదయ దృష్టిని, ప్రదర్శించగా. రాజ రాజ వర్మ మరి కొన్ని విషయాల్లో తన ఆధునికతనూ, అభ్యుదయ వైఖరినీ ప్రదర్శించారు. ఆధునిక మలయాళ సాహిత్యంలో చెప్పుకోదగిన కొత్త పుంతలు తొక్కిన మహాకవి కుమారన్ ఆశాన్ ఆ వివాదంలో జోక్యం కలిగించుకోలేదు. కాని, తన రచనల్లో నియతంగా ఆయన ద్వితీయాక్షర ప్రాస పాటించారు. మహాకవి వళ్ళత్తోళ్ కూడా ఆ ప్రాస ప్రయోజనం పట్ల వైముఖ్యం చూపలేదు. ఈ ఇరువురు మహాకవుల విషయంలో వారు అవలంబించిన మార్గం వల్ల వాళ్ల కవితా విశ్వాసాల్ని గురించీ, ఇష్టానిష్టాల్ని గురించీ నిర్ణయాలు చేసే అవకాశం లేనప్పుడు ఉళ్ళూర్‌ను మాత్రమే ఆయన 'అలంకార పద్ధతి'కి చెందిన కవి అని ముద్ర వేయడం అన్యాయం!

అభూత కల్పనలు అంత తేలిగ్గా తొలగిపోవు. ఉళ్ళూర్ స్వయంగా 1927 లో సాహిత్య పరిషత్ వార్షిక సమావేశంలో చేసిన తన ఉపన్యాసంలో అలంకారాలు ఎక్కువగా వాడడాన్ని ఖండించి, ఔచిత్య పాలనమే కవులకు తమ కవితా పథంలో ప్రధాన ధ్యేయంగా ఉండాలని ఉపదేశించారు: "సాహిత్యంలో అలంకారాల స్థానం అప్రధాన మైంది" అంటూ తన వాదానికి ఉపోద్బలకంగా భోజ, మమ్మట, కాళిదాసాదులనుంచి ఎన్నో శ్లోకాలు ఆయన ఉదాహరించారు.

---

1. ఈయనకు 'కేరళ పాణిని' అని బిరుదు. కేరళ పాణినీయం వ్రాశారు. విమర్శకులు.

కవిత్వంలో అలంకారాలే ప్రధానం అని ప్రతిపాదించే అలంకార మార్గానికి చెందినవారు ఉళ్లూర్ అనే సిద్ధాంతాన్ని కొందరు ప్రచారం చేసినా,[1] ఉళ్ళూర్ రచనలలో మాత్రం అలాంటి అభిప్రాయం ఎక్కడా ప్రకటించబడలేదు.

అయితే - కవిత్వంలో అలంకారాల ప్రాధాన్యాన్ని వాచా ఆయన ఖడించి ఉన్నప్పటికీ, 'ఉమా కేరళమ్' అనే ఆయన మహాకావ్యంతో సహా ఆయన కావ్యాలన్నీ అలంకారాల నిరంకుశత్వంతో బిర్రబిగిసి, ఆయన వాచ్యంగా ప్రకటించిన అభిప్రాయాన్ని ఎంతమాత్రం సమర్థించడం లేదు – అని కొందరు అనవచ్చును. 'కర్ణ భూషణమ్', 'మఙ్గళ్ళ్లి', 'పెరియ త్తినోటు' మొదలైన ఆయన ఖండ కావ్యాలను కూడా ఇందుకు ఉదాహరణగా ఎత్తి చూపించవచ్చును. ఇది మరో అపోహ దీనిని కూడా తొలగించడం అవసరం. ఒక కవియొక్క కవితా వ్యాపారాన్ని ఒక నిరంతరమైన ప్రక్రియగా మనం దర్శించాలి. ఒక కావ్యం వ్రాయడం ముగించి, దాన్ని ప్రచురించడంతోనే అంత మయ్యేది కాదది. బ్రహ్మాండమైన తన పాండిత్యంతో, పరిశోధకుడికి ఆవశ్యక మైన అద్భుత మైన సామగ్రితో, సంస్కృత సాహిత్య సంప్రదాయంతో తలమున్కలైన వా రైనప్పటికి 'ఉమా కేరళమ్' ప్రచురణ అనంతరం ఒక నూతన ప్రస్థానం కోసం ఆయన అన్వేషణ ప్రారంభించారు. క్రమంగా పన్తళమ్ కేరళ వర్మ, వలియ కోయిల్ తంపురాన్ వంటి ప్రగాఢ సంప్రదాయ వాదుల ప్రభావంనుంచి ఆయన బయటపడడం మొదలు పెట్టారు. కావా లని ఆయన ప్రయత్నించి సాధించిన ఈ నూత్న పరిణామం 'కర్ణభూషణమ్'లో మనకు కనిపిస్తుంది. మలయాళ కవిత్వంలో నూతన యుగావిష్కర్తగా ఏ. ఆర్. రాజ రాజ వర్మచేత 'నళిని' అనే కావ్యోపోద్ఘాతంలో పేర్కొన బడిన కుమారన్ ఆశాన్ స్వయంగా ఉళ్ళూర్ పరమేశ్వరయ్యర్‌ని తన గాఢ శ్రేయోభిలాషులలో ఒకరని పేర్కొన్నారు. ఆశాన్ వ్రాసిన 'చండాల భిక్షుకి'కి, ఖండకావ్య సంకలనానికి వ్రాసిన ఉపోద్ఘాతాలలో ఆశాన్ విప్లవాత్మక ధోరణులకు ఉళ్ళూర్ హృదయ పూర్వకంగా స్వాగతం చెప్పారు.

---

1. చూ. కేరళ యూనివర్శిటీ యాజమాన్యాన 1966 లో ప్రొఫెసర్ జోసెఫ్ ముండశ్శేరి చేసిన ఉళ్ళూర్ స్మారకోపన్యాసం. తరువాత అది 'ప్రభాషణావళి' అనే పేర గ్రంథరూపంగా వెలువడింది.

ఎవ్వరూ కాదనడానికి వీలు లేని ఈ భూతార్థాల దృష్ట్యా ఉళ్ళూర్ తీవ్ర మైన సంప్రదాయ వాది అనే ప్రచారం అర్థరహిత మని స్పష్ట మవుతుంది. వాస్త వికమైన కాల్పనిక ధోరణిలో ఆయన వ్రాసిన 'ఐక్య గాథ', 'అన్నుమ్ - ఇన్నుమ్', 'ప్రేమ సంగీతమ్' లాంటి ఇంకా ఎన్నో భావగీతాల (lyrics) ను గురించి వెను కటి అధ్యాయాల్లో చర్చించి ఉన్న అంశాల పరిశీలన ఈ అపోహను పూర్తిగా రూపు మాప గలదు.

పౌరాణిక గాథలలో గాఢంగా కూరుకు పోవడం వల్లా, క్లిష్ట మైన మారు మూల సంస్కృత పదాల ప్రయోగం వల్లా ఆయన శైలి గందర గోళంగా తయా రయిం దని నిరసించే వాళ్ళు ఒక సంగతి గుర్తుంచుకోవాలి — ఎన్ని చెప్పినా శైలి అనేది కవి వ్యక్తిత్వం నుంచి తేలికగా వేరు చేయరానిది; అతని వైయక్తిక భావ ప్రకటన రీతితో పెనవేసికొని పోయి ఉండేది. టాల్‌స్టాయ్ నాటి సరళమైన సౌందర్య భావనను మించి ఆధునిక కవిత చాలా ముందంజ వేసింది. ఇలియట్ అనుయాయుల కవితా దురవగాహత (obscurity) తోనూ, ఫాక్నర్ లాంటి గొప్ప నవలా రచయితల సంకీర్ణ శైలితోనూ సరిపుచ్చుకోడం నేర్చుకొంటూంది. ఒక చిన్న బిగంతో సాధించడానికి వీలైన క్లిష్టత ఈ రోజులలో మహాపరాధంగా భావించబడడం లేదు. ఆ మాట కొస్తే ఏ కాలంలోనూ అది అపరాధం కాదు. ఉళ్ళూర్ కవిత్వం లోని క్లిష్టత రెండు సరళ మైన స్థాయిలలో మాత్రమే కనిపిస్తూంది. ఒకటి : ప్రతి పదార్థ స్థాయి. నిఘంటువు సాయంతో ఈ క్లిష్టతని తేలికగా అధిగమించవచ్చును రెండు : ప్రతీకల స్థాయి. భారతీయ పౌరాణిక గాథలతో తగినంత పరిచయం ఉంటే ఈ చిక్కునూ తేలికగానే అధిగమించవచ్చును. 'దురవగాహత' అనే ఆరో పణ ఆయన నొక ఆధునిక వీరుడుగానే నిరూపిస్తూంది, పాతకాలపు సంప్రదాయ వాదిగా నిరసించడానికి తోడ్పడదు. సంస్కృత పద జాలాన్ని ఇంకా ఇంకా ఎక్కు వగా స్వాయత్తం చేసుకోడం వల్ల మాత్రమే మలయాళ భాష ఆధునిక భావ ప్రక టనకు మరింత పటిష్ఠ మైన సాధనం కాగలదు. అలాంటి శైలే భవిష్యత్తులో రూపొందవచ్చు. తన శైలిలో సంస్కృత పదాలను ధారాళంగా గుప్పించడం ఉళ్ళూర్‌ని భావి మలయాళ శైలికి పూర్వరంగ నిర్మాతగా నిరూపిస్తూం దని నేను నమ్ముతున్నాను. సాహిత్య సంబంధ మైన ఈ జోస్యం నిశ్చయంగా విశ్వసించ దగిందే! ఆ సంగతి అలా ఉండగా ఉళ్ళూర్ శైలిలో కనిపించే సంపన్నతకూ, గాంభీ ర్యానికీ, ధారాళతకూ చాలావరకు సంస్కృత పదజాలం పట్ల ఆయనకు గల మక్కువే

కారణం అనే మాట ఎవ్వరూ కాదనలేరు. ఈ విషయంలో 'అతి' చెయ్యడం ఒక్కటే ఆయన దోషం; అదైనా క్వాచిత్కంగానే!

'సాపేక్షతా విమర్శ' (Comparative Criticism) వల్ల ఉళ్ళూర్ కవిత్వానికి మేలు కంటె హానే ఎక్కువగా జరిగిం దని మలయాళ సాహిత్య విద్యార్థి ఎవరైనా గుర్తించక తప్పదు. ఆయనతో పాటుగా ఆధునిక మహా కవి త్రయంలో చేర్చబడిన ఆయన సహవ్రతులు కుమారన్ ఆశాన్, వళ్లత్తోళ్ నారాయణ మేనోన్‌లతో ఆయన్ని పోల్చి చూస్తున్నారు. ఆశాన్, వళ్లతోళ్ ల విలక్షణ కవితా గుణాలను గుర్తించేందుకు విడిగా వారి కావ్యాల పరిశీలనకు మాత్రమే పూను కుంటారు. ఉళ్ళూర్ విషయంలో మాత్రం అలా కాకుండా తరచు ద్వేషభావంతో ఆ ఇరువురి రచనల అపేక్షయా అంచనా కట్టడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ ఇరువురూ వారి వారి పద్ధతులలో వారు మహా కవులే! అలాగే ఉళ్ళూర్ కూడా తన విలక్షణమైన పద్ధతిలో తాను మహా కవి. ఆ ఇరువురి కావ్యాల్లోని ప్రశంసనీయ మైన కవితా లక్షణాలను, అంటే ఆశాన్‌లో కనిపించే భావ గాంభీర్యం, ఉద్వేగాల ఉదాత్తత, గాఢమైన కారుణ్యం, సంఘ ప్రతిస్పందన శీలం మొదలైన గుణాల్ని, వళ్లత్తోళ్‌లో కనిపించే అర్థవ్యక్తి, సమకాలీన రాజకీయోద్యమ నిమగ్నత, సౌందర్య దృష్టి మొదలైన గుణాల్ని – ఉళ్ళూర్ కవిత్వంలో కూడా ఉండా లని ఆశించి, అవి లేక పోవడంతో వాళ్ళు తలక్రిందు లవుతున్నారు. నిరుపమానమైన ఆయన వ్యక్తిత్వానికి న్యాయం చేకూర్చే పద్ధతి కాదిది. ఆశాన్ లోనూ, వళ్లత్తోళ్ లోనూ కనిపించే పైన పేర్కొన్న కవితా గుణాలు చాలా గొప్పవే! అయితే అవి మాత్రమే ఉత్తమ కవితా గుణాలు అని ఎవరూ ఘంటాపథంగా చెప్పలేరు. శైలీ గాంభీర్యం, మాతృదేశ పూర్వ వైభవ సంకీర్తనం, సర్వ సుపరిచితం కాని పదజాలం వాడడంవల్ల కావ్యాల్లో దురవగాహత సాధించే లక్షణం – ఇవి ఏ కాలంలోనూ, ఏ సాహిత్యంలోనూ నిషిద్ధ కవితా గుణాలుగా భావించబడలేదు. విద్వ ద్విశ్లేషకుల మనస్సుల్లో తప్ప కవిత్వంలో ఇవన్నీ ఏక కాలంలో ఉండదగినవే! వీటిని రమణీయంగా తీర్చి దిద్దే అంశం స్రష్ట అయిన కవియొక్క కళాత్మక మైన నిజాయితీ! ఉళ్ళూర్ కవిత్వం – మహాకావ్యం గాని, లఘు కావ్యం గాని, ఈ ఉదాత్తధర్మం వల్లనే చిరస్థాయిగా నిలుస్తుంది. మలయాళంలో నిర్జీవ మహాకావ్యాల శవమందిరంలోకి ఆయన 'ఉమా కేరళమ్' నెట్టబడలేదు. అందుకు కారణం: దానిలో ఎన్ని లోపా లున్నప్పటికీ, ఇతర కవుల్లో లేని కళాత్మక మైన పూర్తి నిజాయితీతోనూ, అనుభూతి ప్రత్యగ్రతతోనూ అది తళతళ లాడుతూంది.

ఈ నూతన దృష్టి కోణంనుంచి ఉళ్ళూర్ కవితను అధ్యయనం చేస్తే ఆయనది మెల్లగా, డొంక తిరుగుడుగా, బరువుగా సాగే కవిత్వం అనీ, నిజమైన మానవత్వపు విలువలు దానిలో మృగ్యం అనీ భావించే వారి అపోహ నిరాధారం అనీ తేలుతుంది. దానివల్ల – తన కవితామూర్తి ఏకతకు భంగం కలిగించకుండానే ప్రాచీన కవితా ప్రౌఢిమకూ, కాల్పనిక కవితా వైవిధ్యానికీ చక్కని సమన్వయం సాధించిన ఒక వాస్తవిక మైన ఆధునిక భారతీయ మహా కవిగా ఆయన మూర్తి పునః ప్రతిష్ఠితం కాగలదు. కుమారన్ ఆశాన్ తన ఉదాత్త సాగర సంగీతాలతో కేరళను పరవశింపజేస్తే, వళ్లత్తోళ్ అవ్యాహత మైన తన ఆకాశ సంగీతంతో మలయాళీలను ఆనందపరిస్తే, ఉళ్ళూర్ మహోన్నత పర్వతాల అవినశ్వర సంగీతంతో మన హృదయాలను పులకింపజేశారు. ఒక చెట్టో, ఒక వాగో లాంటి పరిమిత దృశ్యం కాదు ఆయన. సముద్ర పరీతమై, నానా విధ వృక్ష, జంతు జాల భరితమై, వైవిధ్యంతో, పౌష్కల్యంతో, నిరుపమాన మైన విస్తృత భూభాగంతో కూడిన ఒక మహా ఖండం ఆయన! కేరళ దేశీయుల చేతనకు అస్పష్ట మైన తమ ప్రాచీన చరిత్రతోనూ, భారతదేశపు ప్రాచీన చరిత్రతోనూ సమన్వయం సాధించ గలిగిన అజరామర మైన పద్య, గద్య కృతులు నిర్మించిన మహా మనిషి, మహా కవి ఉళ్ళూర్ !

# ఉపయుక్త గ్రంథ సూచి


**మలయాళంలో :**

1. మహాకవి ఉళ్ళూర్ — ఏ. డి. హరిశర్మ, ఎం. ఓ. జోసెఫ్ (ప్రొ॥ డి. పద్మనాభన్ ఉన్ని వ్రాసిన ఇంగ్లీషు ఉపోద్ఘాతంతో) తిరువనంతపురం - ప్రథమ ముద్రణ : 1940.

2. ఉళ్ళూర్ మహాకవి — వటక్కుంకూర్ రాజరాజ వర్మ రాజా ఎస్. బి. ఎస్., కోట్టయమ్: ప్రథమ ముద్రణ : 1955.

3. ఉళ్ళూర్ కవిత — కవితా సమితి, తిరువనంతపురం, ద్వితీయ ముద్రణ : 1973.

**ఇంగ్లీషులో :**

1. 'ఉమా కేరళమ్' అనే మహా కావ్యానికి కేరళవర్మ వలియ కోయిల్ తంపురాన్ ఇంగ్లీషులో వ్రాసిన ఉపోద్ఘాతం (తిరువనంతపురం - 1913.)

2. 'Under the knife' — ఓ ఎమ్. తామస్, కోట్టయమ్, ద్వితీయ ముద్రణ : 1927.

3. 'A Centenary Volume — Mahakavi Ulloor' మహాకవి స్మారక గ్రంథాలయం, పరిశోధక సంస్థ, తిరువనంతపురం - 1977.